# మణిమంజరి

వాఙ్మయ - యోగ - పరిశోధన పత్రిక

సంపుటి : 8. సంచిక 1

శ్రీ ప్రభాకర జయంతి సంచిక

ఫిబ్రవరి 1983











## వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

'శ్రీనివాస్' 6/2 ఆర్. టి. (న్యూ)

విజయనగర్ కాలనీ, హైదరాబాదు-500 457

ఆంధ్రప్రదేశ్

వాఙ్మయ - యోగ - పరిశోధన షాణ్మాసిక
మణిమంజరి
శ్రీ ప్రభాకర జయంతి సంచిక
ఫిబ్రవరి - 1988

వార్షిక చందా : ఇరవై అయిదు రూపాయలు
విడిప్రతి : పదిహేను రూపాయలు
వెనుకటి సంచిక : పదిహేను రూపాయలు

ప్రకాశకులు ;
వేటూరి ఆనందమూర్తి
వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు
హైదరాబాదు-500 457.



ముద్రణ :
దక్షిణ భారత ప్రెస్
ఖైరతాబాద్, హైదరాబాదు-500 004.

# సంపాదకీయం

మా యీ 'మణిమంజరి' పాఠకలోకానికి ఉత్తేజాన్ని కలిగిస్తున్నదనే మా కందుతున్న లేఖల్నిబట్టి తెలుస్తున్నది. ఎందరో మాకు రగనారూపాన తమ సహాయసహకారా లందిస్తున్నారు. అందరికీ మా కృతజ్ఞతలు. మొన్నీమధ్య మిత్రులొకరు మణిమంజరిని చదివి ఆనందించి తమ ఆధీనంలో ఉండిన ఒక అమూల్యనిధిని మా పరంచేయడానికి వచ్చారు. ఆ నిధి ఏమిటంటే 1911-1950ల నడుమ వేటూరివారు తమ బాల్య మిత్రులైన చల్లా సూర్యనారాయణగారికి వ్రాసిన కొన్ని లేఖలగుత్తి. ఇంకా చాలా వుండవలెనట. ప్రమాదవశాన చాలా పోయినవట. వీటినైనా మాకందిస్తే బాగుకదా అని తోచి ప్రీతితో తెచ్చియిచ్చినవారు సూర్యనారాయణగారి కుమారులు. వారికి ప్రత్యేకంగా మా కృతజ్ఞతలు. వాటిల్లో ఇంతకు పూర్వం మా యెరుకకురాని విశేషాలు చాలా తెలియవచ్చినవి.

మా యీ కృషి వాఙ్మయసేవకు దోహదంచేస్తున్నందుకు మాకు ముదంగానే వుంది. కాని ఆర్థికంగా చాలా ఇక్కట్టు లెదుర్కోవల్సి వస్తున్నది. ఆయినా పత్రిక ఆగకూడదన్న పట్టుమీద దీనిని నెట్టుకు వస్తున్నాము. ఆర్థికంగా ప్రభుత్వ యంత్రాంగము, హార్దికంగా సహృదయవర్గము తోడుపడితేనేగాని మా ఆశయము నెరవేరదు.

పిండికొద్దీ రొట్టె అన్నదెరిగి జాగరూకత వహిస్తూనే మొదట అనుకొన్నట్లు 120 పుటలకు తక్కువ కాకుండా పత్రికను తెస్తున్నాము. మిత్రుల సూచనలందుకొని తగు మార్పులు కావిస్తున్నాము. కొత్తశీర్షికలనూ ఆరంభిస్తున్నాము. శృంగారశ్రీనాథం ఆంగ్లానువాదాన్ని మా సహసంపాదకుల అనారోగ్య కారణాలవల్ల ప్రస్తుతం కొనసాగించలేకపోతున్నాము. ఆనుకూల్యాన్నిబట్టి ఆ శీర్షికను తిరిగి అందించగలము.

పత్రికాప్రకటనము గ్రంథప్రకటనము సమాంతరంగా నిర్విఘ్నంగా కొనసాగించాలన్న దృష్టితో "వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు"ని రూపొందించడం జరిగింది. తొలి ప్రచురణ 'నీతినిధి' వెలువడింది. 'వేటూరివారి పీఠికలు సంపుటం ముందుముందు రాబోతున్నది.

చక్కని తెలుగు గ్రంథమేదయినా వెలువడినతర్వాత గ్రంథాలయాల నిమిత్తం ప్రభుత్వమొక ఐదు వందకాపీలైనా వెంటనే కొంటుందన్న విశ్వాసం కలుగకపోతే ప్రస్తుతపరిస్థితులలో గ్రంథప్రకటనోద్యోగం మన రాష్ట్రంలో ఫలప్రదం కాబోదు.

పరిపాలనలో ఎన్నో మార్పులు వస్తున్నాయి. మన పరిపాలకులీ అంశాన్ని గమనిస్తారనీ ముందు ముందు మంచికాలం రహిస్తుందనీ మనసారా ఆశిద్దాము.



# స్వవిషయము

"రవికి దీపమున నర్చ లిచ్చు పగడివోలె"

(నన్నిచోడుని కుమారసంభవము 1-49)

ఇంతకుముందు శ్రీ ప్రభాకర పరిశోధక మండలి (హైదరాబాదు) వారు ప్రచురిస్తుండిన ఈ షాణ్మాసిక 'మణిమంజరి' వాఙ్మయ-యోగ- పరిశోధన పత్రికగా రూపుదిద్దుకొన్నది. అదే ఇప్పుడు వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు పక్షాన వెలువడుతున్నది. గురుదేవులు స్వర్గీయ శ్రీ ప్రభాకరశాస్త్రిగారి దివ్యస్మృతి కంకితమై నూ యీ 'మణిమంజరి' శ్రీవారి జయంతి-వర్ధంతి సందర్భాలను పురస్కరించుకొని ఏడాదికి రెండు సార్లు యథాపూర్వం ఫిబ్రవరిలోను-అగష్టులోను వెలువడుతుంది. గురుదేవుల 95వ జయంతి పురస్కరించుకొని 'ప్రభాకర జయంతి సంచిక' ప్రస్తుతం మీముందున్నది.

విడిప్రతిక-వెనుకటి సంచిక-వెల(స్వదేశంలో) రూ 15/-(పోస్టేజి ఉచితం.
రిజిస్ట్రేషను ఖర్చులు అదనము)

సంవత్సరచందా.. రూ. 25/-( " )

సంవత్సరచందా(విదేశాలకు) 8 డాలర్లు ( " )

వలసినవారు ముందుగానే సొమ్మును మనియార్డరు ద్వారాగాని. డిమాండ్ డ్రాఫ్టు ద్వారాగాని క్రింది విలాసమునకు పంపి చందాదారులు కావచ్చును. "మణిమంజరి- హైదరాబాదు" పేరున చెక్కులు పంపగోరేవారు బ్యాంకుచార్జీల నిమిత్తం అదనంగా రూ. 3/-పంపవలెను.

'మణిమంజరి' కొత్త శీర్షికలమ సంతరించుకొంటున్నది. గురుదేవుల మౌలిక రచనలెన్నో పరంపరగ వెలువడుతున్నవి.

కృతజ్ఞతలు :
ఈ సంచికలోని ఆంగ్లవిభాగాన్ని సరిచూచి
అచ్చుకివ్వడంలో మాకు తోడ్పడిన
శ్రీ టి. డి. జగదీశన్‌గారికి, చిరంజీవి
శ్రీ హర్షకు కృతజ్ఞులము.

సంపాదకులు
మణిమంజరి
6/2 RT (NEW) విజయనగర్ కాలనీ,
హైదరాబాదు-500457. ఆంధ్రప్రదేశ్.

# విషయసూచిక



యోగమిత్రుల గోష్ఠిలో ప్రభాకరులు (తిరుపతి-1949)

# వేంకటేశ్వర వాఙ్మయోద్ధారకుడు 'వేటూరి'

—డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు

శ్రీ వేంకటేశ్వర వాఙ్మయ సంశోధనకై అసాధారణ కృషి సల్పిన మహాభాగులలో శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రాగ్రసరులు. వేంకటేశ్వరస్తుతి ప్రధానకములైన రచనలు గావించిన తాళ్ళపాక కవులను తెలుగువారికి తొలిసారిగా పరిచయముగావించి, వారి నాంధ్రలోకమున చిరస్థాయిగా నిల్పిన కీర్తి వేటూరి వారిది. మొట్టమొదట 1918న శ్రీ శాస్త్రిగారు సంధానించి ప్రచురించిన ప్రాచీన సంకలన కావ్యము ప్రబంధరత్నావళిలో తాళ్ళపాక అన్నమయ్య వేంకటేశ్వర శతకమును తొలుత లోకమున కెఱుకపరచినది శ్రీ శాస్త్రిగారు. అటు పిమ్మట 1928లో ప్రచురించిన "శృంగార శ్రీనాథము"లో అన్నమయ్యను శ్రీనాథునకు సమకాలీనునిగా పేర్కొని యున్నారు. అటు తర్వాత మరి రెండేండ్లకు 1925లో వేంకటేశ్వర వచనములలో కొన్నింటిని ఎన్ని ''భారతి'' మాసపత్రికలో ప్రచురించినారు. శ్రీ శాస్త్రి గారికంటె ముందుగా పెదతిరుమలాచార్యుని సీసపద్య శతకము (1917) పరమయోగి విలాసము (1918) శ్రీ పిఠాపురం మహారాజా వారు ప్రచురింప జేసినారు. ఈ రెండు గ్రంథములను దక్క తక్కిన తాళ్ళపాక వాఙ్మయ సర్వస్వము శ్రీ ప్రభాకర శాస్త్రిగారి చేతిమీదుగా ప్రచురితమైనదే.

'వేంకటేశ్వర వచనములు' సంపూర్ణముగా పరిష్కరించి 1945లో తిరుమల తిరుపతి దేవస్థానము వారిచే ప్రచురింపజేసినారు. అప్పటికే శ్రీ శాస్త్రిగారు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాగారమున తెలుగు శాఖ 'రీడరు' గా పనిచేయుచున్నారు. ఆంధ్రసాహిత్య చరిత్రలో తొలితెలుగు కవయిత్రిని గుర్తించి, పరిశోధించి తెలిపిన గౌరవము వేటూరివారికే దక్కినది. సుభద్రా కళ్యాణము (ద్విపదకృతి)ను రచియించినది సంకీర్తనాచార్యుడు తాళ్ళపాక అన్నమయ్య భార్య 'తిమ్మక్క'యేయని సోపపత్తికముగా నిర్ధరించినారు. ఈ విషయమునందే మరికొన్ని వినూత్నసాక్ష్యాధారములతో డా॥ వేటూరి ఆనందమూర్తిగారు తమ పరిశోధన నిబంధము "తాళ్ళపాక కవులు-వివిధ సాహితీ ప్రక్రియలు" అను దానిలో నిరూపించినారు. ఈ సుభద్రాకళ్యాణపు వ్రాతప్రతిని శ్రీ కాళహస్తిరాజావారి యాస్థాని నుండి సేకరించి తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయమునకు చేర్చి, పిమ్మట పరిష్కరించి ప్రచురింపజేసినారు. (1950).

అట్లే తాళ్ళపాక తిరువేంగళప్ప (క్రీ శ. 1515-65) రచించిన 'శృంగారామరుకము'ను చక్కగా పరిష్కరించి ప్రచురించినది కూడ వారే (1949).

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు శ్రీ వేంకటేశ్వర సంబంధి వాఙ్మయమును సుప్రకటితము సేయు తలంపుతో వైచుకొన్న పథకములో "శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు" సంపుటమొకటి. ఈ సంపుటమున శ్రీ వేంకటేశ్వరస్వామిని ప్రధానీకరించుకొని భక్త కవులు రచించిన రచనలు నెక్కొన్నవి. ఇందులో ప్రకటింపబడిన పందొమ్మిది రచనములు. ఇంతకుముందు వెలుగును జూడనివే. ఇందు కొన్ని రచనములు ప్రశస్త రచనాపాటవము కలవి. మరికొన్ని స్తుతి మాత్ర సుందరములైనవి. ఇందులో శ్రీ వేంకటేశ్వర పంచచామరములు, వేంకటనగాధ్యక్ష శతకము తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథ భాండాగారము నుండి సేక

రించినారు. తక్కినవి మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తకశాలనుండి స్వీకరించినవి. కొన్నింటికి ప్రత్యంతరములు కూడ లేవు. నేటికి రమారమి నలుబదియేండ్ల క్రిందట శ్రీశాస్త్రిగారు ఈ రచనలను వెదకిపట్టి ప్రచురింపకపోయినచో, ఆయా కవుల కవితలు పుర్వులకు బోనము పెట్టునవియై లుప్తమై పోయెడివి. ఈ సంపుటమందలి రచనలు కొన్ని అందదుకులుగా గ్రంథపాతములలో తప్పులతో నుండగా వానినెల్ల కంటవత్తిడుకొని సరిపరచి గ్రంథపాతములను స్వయము పూరించి (అట్టివి వేరుగా చూపబడినవి) నిర్దుష్టముగా ప్రచురించినారు. ఈ సంపుటిలో పన్నెండుకృతులు అజ్ఞాతకర్తృతములు, ఏడుకృతులు జ్ఞాతకర్తృకములు. అందు ప్రకటింపబడిన వేంకటాచలపతి శతకములోనిది ఈ పద్యము.

సిద్ధపుటాస్య రంగమున
    నిల్పి, ప్రబోధపుఁ గాసెకట్టి యే
ప్రొద్దును వెంటఁ దంబురను
    బూనిచి తాత్త్విక నాట్య శాస్త్రపున్
బుద్ధులు సెప్పి నా హృదయ
    పుత్రిక మీకును మేలు పాడగా
దిద్దితి వేంకటాచలప
    తీ ! కలశాంబుధి కన్యకాపతీ !

ఈ శతకము నందు ఏడు పద్యములు మాత్రమే లభ్యమైనవి. 'శ్రీ వేంకటేశ్వరకళ్యాణ' మను గేయాత్మక రచన మొకటికలదు. అందు ఆరుగేయములు మాత్రమే లభ్యముకాగా, తక్కిన మూడుగేయములు శ్రీ శాస్త్రిగారు స్వయము రచించి పూరించినారు. ఆ పూరణము మూలరచనమున కలసిపోవునట్లున్నది.

అట్లే కర్త పేరు లేని వేంకట శైలనాయక శతకమును శోధించి, తత్ శతకరచయిత ప్రబంధరాజ విజయ వేంకటేశ్వర విలాస కర్త గణపవరపు వేంకటేశ్వర కవియని గుర్తించినారు ఆ కవి కూర్చిన యమక శతకములోని ఒక మచ్చుతునక.

కమ్మని తమ్మిదో దుమిని
    గమ్మక నమ్మకరాంకుఁ డెమ్మె మై
నిమ్మెయి నిమ్మెయిన్ గదిమి
    యిమ్మెయిఁ గ్రుమ్మె నురమ్ము రమ్ము వే
రమ్ము కరమ్ము నెమ్మది తి
    రమ్ముగ నమ్మిన నన్ను నెంచి చి
త్రమ్ముని నుంచి యేలు నిర
    తమ్మిక వేంకట శైలనాయకా!

శ్రీ ప్రభాకర శాస్త్రిమహోదయులు ప్రాచీన గ్రంథము లందలి వర్ణనా పరము లైన రచన లెల్ల సేకరించినారు. ఆ ప్రశస్త ప్రాచీన కవుల రచనములనెల్ల నొక సంపుటముగా ముద్రింప నున్నట్లు తెల్పినారు. అంతలో శ్రీ శాస్త్రిగారు (1950) లో పరమపదించుటతో, ఆ రచనసాంతము సుపరిష్కృతమయి ఈ నాటి దనుక ప్రచురితము కాలేదు.

సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులు తాళ్ళపాక అన్నమయ్య జీవిత చరిత్రమును, అతని మనుమడు చిన తిరు వేంగళనాథు డను పేరు గల చిన్నన్న ద్విపద కెలయించెను. తెలుగున ప్రాచీన కవుల చరిత్రమును దెలుపు గ్రంథములలో నిదియొక్కటి. దీనికి విస్తృపీఠిక 126 పుటలలో పర్యాప్తముగ విరచించినారు. ఈ పీఠికయే అటు పిమ్మట తి. తి. దేవస్థానము వారిచే ప్రత్యేక గ్రంథముగాకూడ వెలువడినది. ఇందు శ్రీ వేంకటేశ్వర వైభవాదికము, తాళ్ళపాకవారి సంకీర్తనము లాధారముగా తగిన యుపపత్తులతో చరిత్రను శ్రీ శాస్త్రిగారు వెలయించినారు.

శ్రీ తాళ్ళపాక అన్నమయ్య వర్ధంతి ఉత్సవములను తొలుత ప్రకల్పన మొనరించి సంకీర్తన ప్రచార

మునకు క్రొత్త యూపిరి పోసి నారనుమాట మరువ రానిది. శ్రీ శాస్త్రిగారొనర్చిన ఈ కృషి అనంతర పరిశోధకుల నెంతగానో దోహదము చేసినది.

ఏనాడో ఆరంభించి, ఆగిపోయిన తాళ్ళపాక వారి సంకీర్తనలు 4,5 సంపుటములు(1948-49) పరిష్కరించి ప్రకటించినారు. అటు పిమ్మటనే శ్రీమాన్‌రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, ప్రస్తుతము శ్రీ గౌరి పెద్ది రామసుబ్బ శర్మగారు ఆ వాఙ్మయమును సంపుటములుగా ప్రచురించుచున్నారు. వీని ప్రచురణకు ప్రేరణ వేటూరి వారిదే యనుట మరువరాదు.

శ్రీ వేంకటేశ్వరారాధనా ప్రవణములైన తాళ్ళపాకకవులరచనలు వెలువరించుట శ్రీ శాస్త్రిగారి జీవిత లక్ష్యములలో నొక్కటి. హిందూ ధర్మ ప్రతిష్ఠానమునకు వేంకటేశ్వర మహిమాను వర్ణనాత్మక రచనలు వెలువరించుటలో వేటూరి వారు గైకొన్న శ్రద్ధ ఆనన్యము. ఆ రోజులలో అది యొక యజ్ఞము చేయుట వంటిది. ఇందు శ్రీ శాస్త్రి గారికి సహాయపడుచు వారిని నీడవలె ననువర్తించిన వారు మిత్రులు శ్రీమాన్ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారు.

వీరిప్పటికిని టి. టి. దేవస్థానమునపండితులుగా నుద్యోగించుచున్నారు.

తాళ్ళపాక కవులపై, వైష్ణవ వాఙ్మయముపై పరిశోధనలు సాగించుటకు మూల ద్రవ్యమును సేకరించినది శ్రీ శాస్త్రిగారే. అటు తర్వాత ఎంతో మంది పరిశోధనలు సాగించి పట్టములు గైకొన్నారు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వేంకటేశ్వర వాఙ్మయోద్ధరణకై కృషి సాగించిన మహనీయులు. వారు వేంకటేశ్వర స్తుతి పరముగా రచించిన పద్యము లొండు రెండు తిలకింపుడు.

నిలిపితి వేడుకొండల మీద నూరును
 ఇల్లెయు దరిలేని పట్టునందు
నెలకొల్పితివి దివ్యనిలయంబు లచ్చోట
 బహుభోగ్య భాగ్యముల్ పరిఢవిల్ల
రక్షించుచుంటి సర్వప్రపంచము మ్రొక్కు
 లిడువారి కాపదల్ దొడరకుండ
రప్పించు కొనుచుంటి వెప్పుడు గోటాను
 కోట్ల భక్తులను నీ కొండ దరికి
అనుదినము వేనవేలు ద్రవ్యంబు సేక
రించుచుంటివి వడ్డితో బెంచి పెంచి
నీ చరిత్రమ్ము తరమగునే నుతింప ?
వేంకటేశ్వర దేవ! నిశ్శంకభావ !

అంకిలిలేని భక్తి మనసారఁదలంచి నమస్కరించి, మా
సంకట మార్పవే యన, వెసన్ సుఖమిచ్చి, యను
 గ్రహించి, తో
కింకర కల్పకంబ! పరికించితి నీ మహనీయతల్ 'కలా
వేంకటనాయకో' యను సువిశ్రుత సూక్తి యధార్థ
 భావమున్

(ఆంధ్రాభ్యుదయము- మాసపత్రిక 1925)



# నాడీగ్రంథాలు – అభిజ్ఞుల అభిప్రాయాలు

సేకరణ-వివరణ
—ముదివేడు ప్రభాకరరావు

## నాడీగ్రంథ పరిచయం :

జ్యోతిశ్శాస్త్రమే గుప్త విద్య కాగా అంతకంటె గుప్త విద్య, గుహ్యాతి గుహ్యమైన విద్య నాడీ గ్రంథ పఠనము. ఇటువంటి అపురూపమైన విద్య యొకటి యున్నదని లోకానికి ప్రప్రథమంగా చాటి చెప్పిన మహా పురుషులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. 1917 అక్టోబరు 6 వ తేదీన 'కృష్ణా పత్రిక'లో వారు 'నాడీ గ్రంథములు' అను శీర్షికతో నొక వ్యాసమును ప్రకటించిరి.

బహు నాడీ గ్రంథముల పేర్లను పరిచయము చేయుచు ఆ వ్యాసములో వారిట్లు వ్రాసిరి. "కడచిన యెనిమిది మాసములు నేను దక్షిణ దేశమున నుండి యీ శాస్త్రమున నత్యద్భుత గ్రంథములను జూచితిని-ఆశ్చర్యపోయితిని. వానిని గూర్చి యాంధ్రదేశము వారెక్కువగా నెరుగరు. ఆంధ్రదేశమున నా గ్రంథములు లేవనవచ్చును. వాని ప్రచారము లేదు. ఈ గ్రంథములను 'నాడీ గ్రంథము' లని యెదరు. బహు నాడులున్నవి-కొన్ని సంస్కృత భాషలో నున్నవి. కొన్ని ద్రమిళ భాషలో నున్నవి. శుక్రనాడి, చంద్ర నాడి, బ్రహ్మనాడి, ధ్రువనాడి, అగస్త్యనాడి, విశ్వామిత్రనాడి, సుబ్రహ్మణ్యనాడి మొదలగునవి. ఇందు గొన్ని గ్రంథములు, ఒక పురుషుడు సరిగా నొక పురుషాయుష జీవితకాలమెల్ల వ్రాసినఁగాని ప్రత్యంతరము సాధింపరానంత పెద్ద గ్రంథములు. సామాన్యముగా నివి ముద్రింపరానివి. జ్యోతిశ్శాస్త్రమున కప్రామాణ్యమును వాదించు బుద్ధిమంతులెల్లరు నీ గ్రంథములం యద్భుతో త్తరత్వమును జక్కగాఁ బరికింతురు గాక !".

అని వ్రాయుచు తంజావూరులో నొక శూద్రుని కడ అరవ (పాట్టు) పద్యములలో నున్న 'అగస్త్య నాడి'ని గురించి, దానికన్న మిన్నయై తంజావూరులోనే పశ్చిమ వీధిలోనున్న స్వామి నాథయ్యర్ అను బ్రాహ్మణ ధనికునివద్దనున్న "కాశికానాడి"ని గురించి, వ్రాసిరి. సంస్కృతమున శుక్రనాడి, ధ్రువనాడి మొదలగునవి కలవని అందులో ధ్రువనాడి సత్యాచార్య ప్రణీతమని, ఈ సత్యాచార్యుని వరాహమిహిరుడు, భట్టోత్పలుడు పేర్కొన్నారని, అందు అత్యాధునిక నాగరక జీవన విధానములోని వైజ్ఞానిక ఉపకరణములు సైతము పేర్కొనబడియుండుట ఆశ్చర్యకరమనీ వ్రాసిరి. ఏదో యొక నాడీ గ్రంథము మన యాంధ్ర మండలమున జగ్గయ్యపేటలోగూడ నున్నట్లు వినవచ్చెననీ, వ్యాసాంతమున ఇట్లు వ్రాసిరి.

"అత్యాశ్చర్యమును గలిగించు నిట్టి మహోత్కృష్ట గ్రంథము అంతవఱకు నైరోపా దేశీయుల కంటఁబడినట్టు కానరాదు. భరత ఖండమున నున్న ప్రాచీన సంస్కృత గ్రంథములను సర్వమును గాలించి, ఏయే దేశమున నేయే స్థలమున నేయే పుస్తకశాలయున్నదో, అక్కడ నేయే గ్రంథములున్నవో యెఱిగి, యనన్య సాధ్యమయిన తీరున, 'క్యాటలాగు'ను బ్రచురించు

చున్న జర్మను దేశీయుల 'కేటలాగస్ కేటలాగోరం' లో నీ నాడీ గ్రంథముల ప్రశంస గానరాదు."[1]

శ్రీవారు తమ ఆత్మకథయైన 'ప్రజ్ఞాప్రభాకర మున' చిట్టచివరి యధ్యాయమున 'నాడీ గ్రంథముల'ను గూర్చి విపులముగా వ్రాయుచు అందు ప్రతిఫలించిన తమ జీవితానుభవ విశేషములను, శ్రీవారి మాస్టరు గారి యొక్క జీవిత విశేషములను, యితరుల అను భవములను సప్రమాణముగా నిరూపించి తుదకు మాష్టారు గారి ఆజ్ఞచే తాటాకుల నాడిని చూచుట కట్టి పెట్టి, శరీరమున చైతన్యముతో ఆడుచున్న నాడిని గుర్తించి యోగ సాధనపై దృష్టిని కేంద్రీకరించినట్లుగా వ్రాసుకొనిరి.

## ధ్రువనాడి—శ్రీవారి జీవిత విశేషాలు

"ఈ నాడీ గ్రంథము లాయా జాతకుల హృదయ ములలో దాగియుండిన రహస్యార్థములఁ గూడఁగొన్ని కొన్ని పట్టులందద్భుతముగా వివరించుట కలదు. అవి నాడీ రచయితకును, జాతకునకే తెలియవలెను గాని గ్రంథ పాఠకుడగు నాడీ స్వామికిఁ గూడ తెలియవు. ధ్రువ నాడిలో నిట్టివానిని గొన్నింటిని బేర్కొందును"

"జలగండ మవాప్నోతి మృతప్రాయోపజీవనః" అని నా జాతకమునఁ గలదు. నేను మఱచితిని గాని యది జరగిన విషయమే ! మా దొడ్డిలో పిల్లలము కొందఱ మాడుకొనుచుంటిమి. నూతిలో వెదురుగడలు దింపి వానిని బట్టుకొని పైకి లాగుచుంటిమి. నేను వేసినగడ నీటిలో అడుగున బురదలోనికిఁ జొచ్చు కొన్నది. దాని పై యంచు ఒర మీఁదనున్న నా కంఠ కుండెను. లోనికి తల వాంచి యెట్లే నందుకొన జూచు చుంటిని, ప్రక్క పిల్లవాడు నా ముడ్డి పైకెత్తెను. నేను నూతిలోఁ బడిపోయితిని. పిల్లలందఱు పటా పంచలై పాఱిపోయిరి. మా నాయనగా రూరలేరు. మా యమ్మగారు నింటిలో నేదో పని చేసికొనుచుండిరి. నూతిలో పెద్ద ధ్వని గలుగుట ప్రక్క యింటి యతఁ డాలకించి దొడ్డిలోనికి వచ్చి చూడఁగా పిల్లలందఱు పాఱిపోవుచుండిరి. ఒక పిల్లవానిఁ బట్టుకొని గట్టిగా నడుగఁగా నేను నూతిలోఁబడుట చెప్పెను. అతఁడు పర్వెత్తుకొనివచ్చి చూచు తఱికి నాల్గు మూఁడు నిమి షము లాయెను. నేనొక మునుక వేసి తేలి నూతిలో నూగిసలాడుచున్న గడను పట్టుకొని మరల మునుక వేయక తేలియుంటిని. అతఁడొరల మీఁదుగా దిగి వచ్చి నన్నుఁబట్టుకొని మా యమ్మగారి కప్పజెప్పెను. ఈ విషయ మా నాడిలో నున్నది."

"అట్లే పందొమ్మిదవయేట అవనిగడ్డ దగ్గఱ బండి యేటిలోనికి దిగుచుండగా బోల్తాకొట్టి చచ్చిబ్రదికితిని. "వాహనా త్పతనం చైన తన్మూలాచ్ఛ మహద్విపత్" అని యందు కలదు.[2]

## ధ్రువనాడి-మాష్టరు సి. వి. వి. జీవిత విశేషాలు

"ధ్రువనాడిలో అస్మదాచార్య పాదుల జాతకము నందుండి పఠించునపుడు, వ్రాయించునపుడును నేను సన్నిధినే యుంటిని. ఇంకను కొంతఱు మిత్రులుండిరి. ఆ గ్రంథము గల శేషాచార్యుఁడు శ్రీవారి యెడ నప్పు

---

1. Theodore Aufrecht అను జర్మనీ దేశస్థుడు The Catalogus Catologorum అను గ్రంథమును రెండు సంపుటులలో సంకలించి ప్రచురించెను. దీని తర్వాత డాక్టర్ రాఘవన్ The New Catalogus Catalogorum ను ప్రారంభించెను.

2. ఈ విపత్తును గురించి విశదముగా శాస్త్రిగారు తమ స్వీయచరిత్రయైన 'ప్రజ్ఞాప్రభాకరము'న 'బండి పాటు' అను 12వ యధ్యాయము, పుటలు 47-52లో వివరించియున్నారు.
—చూ॥ ప్రజ్ఞాప్రభాకరము, ద్వితీయ ముద్రణ, 1976.

దద్భుత భక్తి గల శిష్యుఁడు. వారి జాతకము నంత వఱకు నక్షరాక్షరము సత్యముగా నుండెను."

"అందులో నాకు విడ్డూరము గొల్పిన విషయములు గొన్ని యున్నవి.

"బ్రహ్మ స్వరూపో భగవాన్ దర్శనం చక్వచిత్ క్వచిత్
అదర్శనం క్వచిచ్చేతి శతశ్చంచల బుద్ధిమాన్".

అని నల్వదవయేటి వృత్తాంతము వర్ణితమయి యుండెను. ఇది చదువుచో నేను దగ్గఱ నుంటిని. ప్రతి పదము ప్రామాణిక మగునో కాదో యని శ్రీవారు పరీక్షించుచుండిరి. ఈ శ్లోకము చదువునపుడు కొంత యాగి యోచించి నవ్వి, 'సరిగా వ్రాకుచ్చి నాడు, మీఁద చదువుఁడు' అనిరి.

అప్పుడీ శ్లోకమున కర్థమేమో బ్రహ్మదర్శనము లభించుట యనఁగా నెట్టిదో, అప్పుడేమి జరగినదో, వివరించి తెలుప వేఁడెద నని పలుక నాలుక చివరి దాఁక ప్రశ్నము సాగును గాని నాలుక దాఁటి బైటికి రాదయ్యెను. ప్రశ్నింపవలెనని చాల తంటాలు పడితిని గాని ప్రశ్నింప నా చేతఁగా లేదు. 'జీర్ణమంగే సుభాషితమ్' అన్నట్టుగా నీ ప్రశ్నార్థము నాలోనే నిలిచిపోయినది గాని పయికి రానేలేదు. నేనీ యోగ మార్గమున చేరిన పది యేండ్లకు అనఁగా 1926-వ సంవత్సరమున నా యనుభవమున నొక యద్భుతానందమయ విషయము జరగెను. దాని నెఱుగుదునంతే కాని 1936 దాఁక అనఁగా మఱి పది యేండ్ల దాఁకఁగాని దాని వివరణ మెల్ల తెలియ రాదయ్యెను".

## ధ్రువనాడీ చమత్కారము

మద్రాసులో ఒక గొప్ప యింటి పిల్లవాడు కడుపులో తీవ్రమయిన యనారోగ్యముతో బాధపడు చుండగా ధ్రువనాడి చదివించుట జరిగినది. అందు 'శస్త్రవైద్యేన జీవతి' అని వచ్చుటతో తత్పూర్వమే నిర్ణయించిన ప్రకారము శస్త్రచికిత్సకు ఏర్పాట్లు జరిగినది. కాని ఆ బాలుడు విధవశాత్తు 'శస్త్ర చికిత్స జరుగుచుండగనే మరణించెను. మరల నాడిని పరిశీలించగా శస్త్రవైద్యే = శస్త్రవైద్యమున (వైద్యము జరగు కాలమున) నజీవతి = చనిపోవును అని యర్థము తేలినది. 'శస్త్రవైద్యే నజీవతి' అనుదానిని 'శస్త్రవైద్యేన జీవతి' అని పఠించుట చేత సంభవించిన ప్రమాదము. ఇది రచయిత దోషము కాదు, వ్రాయసకాని దోషము, అనవచ్చును కాని పఠించువాడెట్లు చదివినను అస్తినాస్తి విచికిత్సలో పడవలసినదే కదా! ఇది నాడీ రచనాగత చమత్కారము.

## శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు

"తమిళంలో ఉండే నాడీగ్రంథాల మీద ఈయనకు (దువ్వూరి రామిరెడ్డికి) మాంచి విశ్వాసం. వాటి విషయాలు నిజంగా అద్భుతాలు. పుట్టిన సమయంతో పని లేకుండానే, కుడి అరచేతనున్న ఏదో ఒక రేఖను బట్టి, పాత తాటాకు పుస్తకాలు దీసి జాతకుని పేరు, తల్లి, తండ్రి, పెండ్లాము, పేర్లు, జన్మకాల గ్రహస్థితి అంతా కచ్చితంగా సరిపోయేటట్లు కౌమార నాడి అనేది చెపుతుంటి. కందర్ నాడి సప్త ఋషి వాక్యం, కాకర్ భుజంగ నాడి, గణేశనాడి మొదలైనవి ప్రసిద్ధాలు...

---

తెలుగు వైతాళికులు (రెండవ సంపుటం) శ్రీ దువ్వూరి రామిరెడ్డిని గూర్చి శ్రీ మరుపూరి కోదండ రామిరెడ్డిగారి ఉపన్యాసం (పుటలు 41-73) 'జ్యోతిషముపై ప్రీతి' అనే ఉపశీర్షిక(పుటలు 65-67) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు. 1977

మేమిద్దరం వేటాడి చాలా వాటిని పట్టినాం. ఈ కవి కోకిలకు మొదట ఈకూత నేర్పింది, వేటూరి ప్రభాకరశాస్త్రి. మదరాసు లింగిచెట్టి వీధిలో ఒక బేరిసెట్టి ఉండేవాడు. అతని దగ్గరకు వచ్చిన లగ్నం ప్రకారం ఆగంతకుల పుట్టుపూర్వోత్తరాలు ఆశ్చర్యజనకంగా చెప్పే వాడు. అతడు చెప్పేది పుస్తకం లోనిదైనా అదంతా అతనికి గుడ్డిపాఠం. తమిళం తెనుగులో పాటగా పాడేవాడు. ఉత్తప్పుడు "మూతి తుడుచు కోమీ- రొంబానాళ్లగా కానమే" అనే ఆ అరవనోరు జ్యోతిషం చెప్పే పట్టున, ఏదో పూనినట్లు తెనుగు ద్విపదలో పాడేవాడు. చెప్పిన జ్యోతిషానికంటె, ఈ కవితా ప్రజ్ఞకు రామిరెడ్డి చకితుడయ్యేవాడు. కందర్ నాడి, అడుగవచ్చిన వానితో గూడ వచ్చిన వాడి లగ్నకోటులను సాక్షులుగా చెప్పేది.

ఇంత సోదె ఎందుకంటె- సప్తఋషివాక్యం అనే దానిలో రామిరెడ్డిని గురించి చెపుతూ- "అన్యనాటీ ఈసై పెట్టి (అన్యదేశ సంగీత పేటిక.)ని నిర్మిస్తావు" అని చెప్పివేసింది. ఇక వీటిని నమ్మమంటారో వద్దో మీరే చెప్పండి."

1926లో మన దేశంలో రేడియో ప్రవేశపెట్టబడింది. బ్రిటిషువారి హయాంలో దీనికి కొంత కంట్రోలు వుండేది. నాడీ గ్రంథంలో పై సంగతి వినక పూర్వమే రామరెడ్డి 1930లో బొంబాయి నుండి రేడియో విభాగాలు తెప్పించి మ్యాగజీన్లలో చదివి స్వహస్తాలతో రేడియో సెట్టును అమర్చియున్నాడు.

## శ్రీ ఆచంట జానకిరాంగారు

"కాకినాడలో ఉండగా నాకు నాడీ జ్యోతిష్యంతో పరిచయం కలిగింది. వర్ధమాని సోమనాథ శర్మ అనే ఒక ఆయన బాలాంత్రపు వారి కోసము ఆ నాడీ గ్రంథము చదువుతూండగా అక్కడకు వెళ్ళి కూర్చున్నాను; ఆయన అప్పుడు అతి అద్భుతంగా ఫలాలు చెప్పేవారు అని ప్రసిద్ధి. ఫలం చెప్పడమంటే వేరే గణించి చెప్పటం కాదు. ఒక పురాతన తాటియాకు గ్రంథం నుంచి ఒక మోస్తరు సంస్కృత భాషలో చదువుకుంటూ పోతూ ప్రస్తారం చేసి చెపుతారు మనలను గురించిన విషయాలు. చాలా వింతగా ఉంటుంది.

ఆ చెబుతున్న విషయం పూర్తి అయ్యాక నాకేసి చూస్తూ ఆయనంతట ఆయనే అన్నారు— "ఏదీ మీ చెయ్యి" అని సాముద్రిక శాస్త్రరీత్యా నా జాతక చక్రం సిద్ధం చేసి కొద్దిసేపటిలో, నన్ను గురించిన పూర్వ విషయాలు చదువజొచ్చారు. నాడీ గ్రంథం నుంచి. మా తండ్రిగారి గురించీ తల్లిగారిని గురించీ వివరాలు చెబుతూ ముఖ్యమైన సంఘటనలు అన్నీ జరిగినవి జరిగినట్టుగా తు.చ. తప్పకుండా చదివారు. అంతేకాక మా తండ్రిగారికీ నాకూ మధ్య ఉన్న విపరీతమైన అన్యోన్య ప్రేమ భావాన్ని చక్కని భాషలో వర్ణించారు. "పైకి తెలియనివ్వరు ఇతని తండ్రి. కాని, ఈ పుత్రుని దెస తేనె పట్టు ఎలా అమృతంతో నిండి వుందో అలా ప్రేమతో నిండి ఉన్నది ఆ తండ్రి హృదయం" అని చదివారు. ఇది నన్ను వింతగా కదలించి వేసి, నేను భోరుమని ఏడ్చి వేశాను. శర్మగారు వారి భార్యను పిలచి, చెంబెడు నీళ్ళను తెప్పించి ఇచ్చారు నాకు ముఖం కడుక్కోను. ఆ తరువాత మళ్ళీ ప్రారంభించారు. ఎన్నెన్నో చెప్పారు పూర్వ విషయాలు. నా అడయార్ నివాసము గురించీ, బెంగుళూరులో నా శాస్త్రపరిశోధనావిషయాల గురించీ, నా ప్రేమ గురించీ అది విఫలమైన యుదంతము గురించీ.

తరువాత, ప్రస్తుతానికి వచ్చి, కొద్ది రోజుల్లో నాకు ఉత్తర దిశ ప్రయాణ మున్నదనీ, వంశధారా ప్రాంతములో ముహూర్త కాలము ఆగి ఆ తరువాత ఒక మహానగరము జేరుతాననీ అక్కడ నేను వెళ్ళిన కార్యము ఒక్క మూడు రోజులలో పూర్తి అవుతుందనీ, విజయవంతంగా తిరిగి వస్తాననీ చదివారు. మొదటి రోజు నా పై అధికారులతో పరిచయము, రెండవ రోజు సంప్రదింపులు, మూడవ రోజు నేను వారిని పూర్తిగా ఆకర్షించి వేయడంవల్ల నాకే సంపూర్ణ

విజయము అని ఉన్నది ఆ నాడిలో. నిజమే. ఇన్సూరెన్సు పని విషయమై పై అధికారులతో సంప్రదించడానికి ప్రయాణము పెట్టుకుని ఉన్నాను నేను. త్రోవలో వంశధార ప్రాంతాన ఉన్న పర్లాకిమిడిలో నా స్నేహితుడు ఉలవభద్ర దొరను చూడాలని సంకల్పించి ఉన్నాను కూడా.

ఇలా ప్రయాణమై వెళ్ళాక, శర్మ చెప్పినట్లే మొదటి రోజు వారందరితోను పరిచయమైంది. నాకంటే చాలా పెద్ద హోదాలో ఉన్నవారు నలుగురు డైరక్టర్లు నన్ను చాలా ఆదరించారు. రెండవ రోజున నేను వారితో జరిపిన సంప్రదింపుల ఫలితంగా వారు నా సూచనలను అన్నిటినీ ఆమోదించి వానిని గురించి నాన్నగారి అంగీకారము పొందటానికి వారి ఆఫీసు నుండే మద్రాస్‌లో ఉన్న నాన్నగారితో ట్రంక్ టెలిఫోన్‌లో మాట్లాడమన్నారు.

.... ... ....

మరునాడు డైరక్టర్లను కలుసుకొన్నప్పుడు ఇంత సులభంగా ఆఫీసు కార్యాలను చక్కబెట్టకలిగినందుకు వారు నన్ను ప్రశంసిస్తూ నాన్నగారిని గురించీ, నన్ను గురించీ చాలా స్నేహపూర్వకంగా మాట్లాడారు. వారి ఆతిథ్యం స్వీకరించి ఇక రెన్నాళ్ళు కలకత్తాలో ఉండి కాకినాడ వచ్చేశాను.

నాడీ గ్రంథములో నాకు నమ్మక మెక్కువైంది, శర్మ నాకు దగ్గర స్నేహితుడైనాడు కాబట్టి చీటికీ మాటికీ అతని వద్దకు వెళ్ళనారంభించాను.

ఇది ఒక ఇరవై మూడు ఏళ్ళ క్రితం జరిగినది. మంచి చెడ్డల బాధ్యత పూర్తిగా మనది కాదు. అని నేను విశ్వసింపక తప్పదు. ఐనా ఆ రోజులలో నాడీ గ్రంథములో నన్ను గురించి తెలుసుకున్న కొన్ని విషయాలు నా జీవిత దోరణిని వింతగా మార్చివేశాయి అని ఒప్పుకోక తప్పదు. కొన్ని అనివార్య కారణాలవల్ల అప్పటికి నా కుటుంబ వ్యవస్థలో అల్లకల్లోలము ప్రబలుతోన్న రోజులవి. కాని, విశ్వ ప్రయత్నము చేసి, పడిపోనున్న పేక మేడ పడిపోకుండా పదిలపరచి ఉండవచ్చు- ఈ నాడీగ్రంథము ద్వారా కొన్ని విశేషాలు తెలిసికొని కొన్ని ఆకర్షవంతములైన ఊహలు ఊహించుకొని ఉండకపోతే నేను ఎల్లాగైనా ఆ గృహచ్ఛిద్రాన్ని అరికట్టి ఉందునేమో! ఎటువంటి పరిస్థితులలోనూ మనస్సు చెప్పిన తీరున గాక హృదయము సూచించిన తీరునే నిర్ణయిస్తాను నేను, అని అప్పటికే స్నేహితులందరూ అనేవారు. ఈసారి నా విధ్యుక్త ధర్మాన్ని పాటింపవలసిన అగత్యం చాలా వుంది. అలా చేసి ఉంటే నా కుటుంబ జీవనము నిలబడి వుండేది. అలా చేయక హృదయానికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చాను. ఈ దృక్పథానికి నాడీ పఠనము దోహద మిచ్చింది.[1]

### శ్రీ విస్సా అప్పారావు

నాడీ గ్రంథము లేకాలమునాడో ప్రజ్ఞావంతులచే చెప్పబడి తాటాకుల మీద వ్రాయబడి యున్నవి. ఈ నాడులలో కొన్ని మాత్రమే సంస్కృతమునను ఎక్కువగా తమిళములోను చెప్పబడినవి. శుక్రనాడి, ధ్రువనాడి సంస్కృతములో నున్నవి. చంద్రనాడి, బ్రహ్మనాడి, అగస్త్యనాడి, విశ్వామిత్రనాడి, సుబ్రహ్మణ్యనాడి, నందినాడి, కాకాభుజందనాడి మొదలైన వెన్నో తమిళ భాషలో ఉన్నవి. ఇవి చాల పెద్ద

1. సాగుతున్న యాత్ర (ప్రథమ భాగం)—ఆచంట జానకిరాం (పుటలు 164-166) ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ. (1962)

గ్రంథములు. ఇవి నాడీ స్వాముల వద్ద అచ్చటచ్చట కలవు. వారు వానిని గుప్తముగా ఉంచి జీవనోపాధి కుపయోగపరచుకొనుచున్నారు. అన్నియు అముద్రిత ములే.[1]

జాతక ఫలములు కావలసినవారు జాతకమును నాడీకారునకు చూపించినచో నాడిని వెదకి ఫలములు గల భాగమును వ్రాసి యిచ్చును. కొన్ని నాడులను కౌశికనాడి; అగస్త్యనాడి మొదలైన వానిని చేతిరేఖ లాధారముగా చూడనలెను నాడి చూచువాడు చేయి చూచి ఒక ముఖ్యమగు రేఖను గుర్తించి దానిని బట్టి జాతకమును వెదకి యిచ్చును. ఉదాహరణమునకు ఒకటి "ఆడిక్కి విరిచక్ర ఇరపాలి సంకృతలికిత యేక యోగాంశరేఖ" దీనినిబట్టి తీసిన జాతకమును చదివి వినిపింతురు. సరిగా నున్నదని చెప్పిన తరువాత వ్రాసి యిత్తురు. కొంత మూల్యమును తీసికొందురు. ఈ నాడులలోని జాతకములు సాధారణముగా గతించిన విషయములను సరిగా వివరించును. అందు అసాధారణములగు విషయములు కూడ ఉండును. పుట్టిన తిథి వార నక్షత్రములు, జనన కాలము, రాశి, అంశ చక్రములు, జననకాల దశా శేషము, తరువాత వచ్చు దశలు, అంతరములు, జీవిత విశేషములు, జీవితాంతము వరకు ఉండును. జాతకుని పేరు, తలిదండ్రుల పేరు ఉండును. నా పేరు వెంకటప్పయ్యని చెప్పబడినది. వెంకటప్పయ్య అని నాకు నామకరణము జరిగినది. ఈ జాతకములలో భవిష్యత్తు సాధారణముగా సరిపోదు. కొన్నిట బొత్తిగా తప్పుగా నుండును. ఒక్కొక్క లగ్నమందు ఒకనాడే భిన్న భిన్న జాతకము లుండును. అందుచేత భేదములు కలుగును. జాతకమును తీసికొనిన నాటి వరకు సరిపోయిన జాతకము జీవితాంతము వరకు కూడ సరిపడుట కాకతాళీయముగా నుండును. అనేక జాతకములను ప్రజ్ఞాశాలులగు మహర్షులు గుణించి ఫలములను వ్రాసి యుండిరని, వానిని సరిగా గుర్తించుటకు జాతక చక్రముగాని, చేతిలోని రేఖగాని సూక్ష్మతరమైన సాధ్యము కాదని ఊహించవలసి యున్నది."

"రేఖాధారమగు కౌశికనాడిని నే చూపించుకొంటిని. నా మిత్రులు చూపించుకొనిరి. అందు ఒకటి రెంటిలో మాత్రము భవిష్యత్తు కూడ చాల వరకు సరిగా చెప్ప

---

1) నాకు తెలిసినంతవరకు 'సప్తర్షినాడి' అను నాడీ గ్రంథమొకటి ఐదారు బృహత్ సంపుటాలుగా మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక పరంపరలో ఈ క్రింద కనబరచిన తీరులో ముద్రితమైయున్నది.

A. సప్తర్షినాడి (వృషభ లగ్నము) సంపా: S. తంగవేల్‌నాడార్, MGOS No. 103, (1953)

B. సప్తర్షినాడి (మిథునలగ్నము) సంపా: R.V. రాజగోపాల అయ్యంగార్, MGOS No. 115 (1954)

C. సప్తర్షినాడి (కటకలగ్నము) సంపా: V S. శేషాద్రియాచార్యార్ MGOS No. 123, (1958)
C.G. రాజన్

D. సప్తర్షినాడి (సింహలగ్నము) సంపా; R.V. రాజగోపాల అయ్యంగార్ MGOS No. 144 (1956)
C.G. రాజన్

E. సప్తర్షినాడి (కన్యాలగ్నము) సంపా: C G. రాజన్ MGOS No. 168 (1961)
T. చంద్రశేఖరన్

—వివరణ కర్త

బడియున్నది. నేను తీయించిన రెండు జాతకములలో భవిష్యత్తు సరిగా లేదు "

సత్యాచార్య ప్రణీతమైన ధ్రువనాడి సంస్కృత మున నున్న దానిని నేను చూపించుకొంటిని నా జాతక చక్రమునకు సంబంధించిన జాతకములు కొన్ని యుండెను. ఒక్కొక్కటి చదివిచూడగా 15 ఏండ్ల వరకు కొన్ని, 30 35 ఏండ్ల వరకు కొన్ని సరి పడుచు తరువాత తప్పుచు వచ్చినవి. నాటి వయస్సు వరకు పూర్తిగా సరిపోయిన జాతకమును వెదకుటకు కాల వ్యవధి నాకు లభింపక, అందుండి జాతకమును తీసికొని రాలేకపోతిని. కాని మద్రాసులోని పెద్దలను ఈ ధ్రువనాడి నుండి జాతకములను వ్రాయించుకొన్న వారిని నేనెరుగుదును. వారి జాతకములు పూర్తిగా దాఖలా లిచ్చినవి. ఇందు మొదట జాతకుని గురించి సంగ్రహముగా చెప్పబడును. తరువాత ఆది నుండి అంతము వరకు సంవత్సర ఫలములు వివరింపబడును. జాతి, మతము, దేశము, పితృ మాతృ వంశములు, అన్నదమ్ములు, అక్క చెల్లెండ్రెందరో, అందు జాత కుని స్థానము, వారి వారి యాయుర్దాయములు జాత కుని వివాహము, భార్యయొక్క రూప గుణ శీలములు, సంతానము మొదలైనవి, నేటి ఉద్యోగములు రైళ్ళు తంతి టపా సౌకర్యములు మొదలగు విషయములు గురించి నాడిలో నుండును. పూర్వ జన్మ వృత్తాం తములు, భావి జన్మ విశేషములు కూడ సూచింప బడియుండును. ధ్రువనాడిలో ఏబది రెండు సంపు టములు కలవు. చాల పెద్ద గ్రంథము. దానిని వ్రాయుటకే కొన్నేళ్ళు పట్టునేమో. అట్టి ఉద్గ్రంథము లెట్లు వ్రాసినది ఆలోచించినచో అద్భుతముగా తోపక మానదు. నాడీ గ్రంథముల గురించి కృష్ణా పత్రికలో 1917 అక్టోబరు 6వ తేదీ నాటి సంచికలో వ్రాసిన కీ॥ శే॥ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు ఇట్లు వ్రాసి యున్నారు. "ఈ గ్రంథములు అలోక సామాన్య మైన దివ్య చక్షుస్సుతో నెవ్వరో మహానుభావులు లోక సంగ్రహ కాంక్షచే రచియించియుండిరే గాని శాస్త్రము పరిగణనము సలిపి సమకూర్చినవి కావని పెక్కురు తలచుచున్నారు." ఇంకొక రీ క్రింది రీతిని నభిప్రాయ పడిరి. "జ్యోతిశ్శాస్త్రము పారము ముట్టి చూచిన మహామహులు తమ పాండితీ విశేషమును వెలార్చుచు అనేక శతాబ్దుల క్రిందట విశ్వమానవ జాతక సంగ్ర థన రూపములను నాడి గ్రంథములను వివరించి యుండిరి."

మచ్చునకు ధ్రువనాడి నుండి కొన్ని శ్లోకముల నిచ్చుచున్నాను.

గాంధాంశే తులాలగ్నే లగ్నేశే కర్మరాశిగే
వృశ్చికాంశే కమలనాధే లగ్నాధీశే బలాన్వితే
లాభేకటకాంశగే హేశః పంచమే ఝషగాంశగే శశీ॥
భాగ్యే అజాంశగే భౌమే కర్మే మృంగాసగే బుధే
అదృష్ట శాలీ ధర్మాత్మా దార ద్వయయుతో భవేత్
ద్వితీయాఽ దృష్ట శాలీచభర్తార మనువర్తతే॥
పంచమాబ్దవయః కాలే స్వీకారో హ్యన్య వర్గకే
స్వీకారాత్పూర్వ కాలేతు తత్పితా మృతి మాది శేత్
స్వీకార మాతృ సౌఖ్యంచ పితృమాతృ సుఖావహమ్
పంచమాబ్దేఽక్షరారంభః విద్యా విఘ్న స్తదాభవేత్"

'ఆత్మజ్ఞాన పరాయణోఽ తి నిపుణో బౌద్ధ ప్రధానో గుణీ
హృష్టో లౌకిక మార్గతో నచల విప్రఖ్యాత శిష్య వ్రజః
సౌమ్యోక్తి ర్బహు విత్త దార తనయః సద్బ్ర హ్మతేజాజ్వలన్
ఆత్మాయు ర్విజితేంద్రియో నత నృపోవైరించ యోగే భవేత్"

1917 నవంబరు 3వ తేదీ కృష్ణాపత్రికలో పంచా గ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారు నాడీ గ్రంథముల గురించి వ్రాసిరి. అందుండి కొన్ని విషయములు సంగ్రహముగా వ్రాయుచున్నాను.

"తెలుగు దేశమందుకూడ తెలుగుభాషలో ఇట్టి గ్రంథములున్నవి. బెజవాడకు దగ్గరగా నున్న గంగూరు ఖండికలో పిశుపాటి రామకృష్ణ శాస్త్రి గారింట 'భీమకవి జోస్య' మను గ్రంథముండెను. ఈ గంగూరు భీమకవి ప్రశ్నలు 1890 ప్రాంతముల వరకు వాడుకలో నుండెను. ఇది కొందరికి జీవనాధారముగ నుండెను. దీని నాధారము చేసికొని లకోటా ప్రశ్నలు చెప్పుచుండిరి. ఈ ప్రశ్న గ్రంథస్వరూపము కొంత సీస పద్యములుగను కొంత తెంపు లేని పురాణ ధోరణి ననుసరించు వచనముగను పాటలు గాను ఉండును. లక్షణ మంతగా పాటింప బడదు. ఇది క్రమముగా శిథిలమై పోయినను ఒకరిద్దరిండ్లలో 1917 నాటివరకు కొంత నిలిచి యున్నది. గ్రంథస్వాములు వానిని దాచి పెట్టి మర్మమును తెలుపకుండుట చేత వాని స్వరూపము బైటపడుటలేదు. ఇది సంప్రదాయ మెరుగని వారి పాలబడి ప్రచారము లేక క్రమముగా మాసిపోవుచున్నది. ఇట్టి శాస్త్రపరిచితి క్షుద్రో పాసనా లబ్ధము. దురాచరణానృత వాద సమ్మిశ్రము. వంశ వృద్ధికి భంగకరము. ఈవిద్య నభ్యసించు వారందరు తమకది అచ్చిరాలేదనే చెప్పుచుండిరి. ఇట్టి క్షుద్రో పాసనా విద్యలనేకములు తంత్ర సంబంధములు- కట్టు మోతువిద్యలు చేతబళ్లు మొదలగునవిట్టివే. ఇవి అనుసరింపరానివి. ఇహపరములకు దూరములు."

దక్షిణామూర్తి శాస్త్రిగారు వ్రాసిన దానిలో చాల యథార్థమున్నది. దండిభొట్ల రామమూర్తి శాస్త్రిగారు, చిరావూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, తిరువళ్ళిక్కేణిలో నేనెరిగిన సుబ్రహ్మణ్యోపాసకు లిద్దరును ఉపాసనా బలము చేతనే కొన్ని వేళలలో అద్భుతముగా చెప్ప గలుగుచుండిరి. వీరి ఉపాసనలు క్షుద్రములు కావు. నిష్ఠ నియమములతో కూడినవే. ఇట్టివారియందు కూడ అనేక రీతులున్నట్లు తోచును. చిరావూరి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు తమ పంచపక్షి ఉపాసన గురించి చెప్పు వారికది అచ్చి రాలేదని వారి వంశము వృద్ధి కాలేదని అనిరి.

కాని జైమిని, పరాశర మునుల ప్రణీతములైన జ్యోతిశ్శాస్త్ర గ్రంథములు, నాడీ గ్రంథములు అట్టివి కావు. ఈ నాడుల గురించి బాగుగ తెలిసికొనవలె నని కొంత శ్రద్ధతో నేను ప్రయత్నించినాను. పూర్తిగా జీవితాంతము వరకు సరిగా దాఖలా నిచ్చు నాడులకై వెదుక నారంభించితిని. నా మిత్రులు రాళ్లబండి సుబ్బారావుగారి వద్ద వారి జాతకమునకు చెందిన తాళపత్రము ఒక నాడి నుండి తీసుకొని వచ్చినది ఉన్నది. అది వారు నాకు చదివి వినిపించిరి. నేటివరకు అందులో చెప్పిన రీతినే జరుగుచున్నది. మరియు ప్రెసిడెన్సీ కాలేజీలోని ఒక ప్రొఫెసరు గారొకనాడొక తాటాకును తీసికొని నావద్దకు కాలేజీ లోనికి వచ్చిరి. భూతద్దముతో అందు వ్రాసి యున్న అరవపాటలు ఒక నాడీ గ్రంథము నుండి సేకరింపబడినవి. చదివిరి వారి జీవితము గురించి అంతయు పూసగుచ్చినట్లు అందు వ్రాయబడి యున్నది. తల్లిదండ్రుల పేర్లు, ఇంగ్లాండు వెళ్ళి పెద్ద పరీక్షలు ఇచ్చి వచ్చుట, ఉన్నతోద్యోగము, సోదర భావము మొదలగునవి కలవు. అప్పుడు నా మిత్రునకు కలిగిన ఆశ్చర్య మింతింత కాదు. అద్భుత ప్రతిభావంతులైన మన పూర్వుల గురించి ఒక్కసారిగా ఆయనకు తెలియవచ్చినది. పెద్దల విద్యల గురించి ఏమియు తెలియనట్టివి, తెలిసికొనుట కేమియు లేదని ఉదాసీనత కలిగినట్టి, ఇట్టి ప్రతిభాశాలులు నాడీ గ్రంథములు ఉన్నవని నమ్మవారి యెడ చులకన భావము కలిగినట్టి వారిలో ఒక ఒకరైన నా మిత్రులు తన యభిప్రాయము లెట్లు తారుమారైనది నాతో స్పష్టముగా వెలిబుచ్చిరి.

నేనెరిగిన నాడు లన్నిటిలోను సర్వోత్తమమైనది 'కాకాభుజండనాడి'. ఇది కాకాభుజండ మహర్షి వశిష్ఠునితో చెప్పుచున్నట్లు వ్రాయబడినది. మధ్య మధ్య

వారిద్దరకు సంభాషణలు చర్చలు జరుగు చుండును. ఇది కుంభకోణములో నొకరివద్ద ఉండెను. వారు కొంత కాలము క్రిందట కీర్తిశేషులైరి. ఈ నాడి స్వరూపమును ప్రత్యక్షమున తెలిసి కొనుటకై నేను వారి కడకు కుంభకోణము వెళ్లియుంటిని. తాటాకు పత్రముల మీద రెండు వైపులను చీమల బారులవలె విషయము వ్రాయబడి యున్నది. అందుండి నా జాతకపు పాటలు నా యెదుటనే ఒక మిత్రుడు వ్రాసి నాకిచ్చెను. జాతకసంబంధములగు పాటలన్నియు ఈనాడి నుండి ఒకేసారి లభ్యములు కావు. వాయిదాల మీద అందు చెప్పిన రీతిని ఆపాటలు పంపబడు చుండును. ఒక పాటలో సీస పద్యములో వలె నాల్గు పాదములు ప్రాస యుక్తము లుండును. పాటలన్నియును ముక్త పద గ్రస్తములు. అందు వర్తమాన విషయములతో కలిపి భవిష్యత్తులోని విషయములు చెప్పబడును. జాతకుని గురించియే కాక లోకరీతి పరిపాలనా విషయములు, యుద్ధములు, భావిలో మానవుడు పొందనున్న దివ్యానుభవములు కూడ ఉండును. ఇంగ్లీషు భాష వాడబడి యుండును. దానికి కవి భాషయని పేరు. ఇంగ్లీషు వారికి 'వికటన్' అని, ఫ్రాన్సు వారికి "వ్రజ్జీలన్" అని, జర్మనులకు "వరలీన" అని. ఆస్ట్రియా వారికి "అషి" అని, పేర్లు చెప్పబడినవి "వికటావతి" యను పేరుతో విక్టోరియారాణి గురించి కలదు.

ఈ నాడిలోని వివిధములగు కొన్ని విషయముల గురించి క్రింద వ్రాయుచున్నాను.

1. మద్రాసు గవర్నమెంటువారు 1931 వ సంవత్సరములో ఉద్యోగస్థుల జీతములను తగ్గించిరి. దాని వలన నాకు కలిగిన చీకాకు సమయములో ఈ నాడిని గురించి విని తెలిసికొన గోరితిని. నేవచ్చిన కారణము అందు చెప్పబడియున్నది.

2. మరియు, గోదావరికి దగ్గరగా నున్న పెద్దాపురములో జన్మించెను, కవిభాషలో పదార్థగుణ శాస్త్రమును (Physics) చదువును, పదార్థగుణ మూలమును తెలిసికొనును, ఇతను 'అప్పా'— "అప్పాఇవన్ కడుమైయల్లామ్" అన్నిటిలోను గట్టివాడు ఇతనికి లింగధారులతో బాంధవ్య మున్నది. అని, ఎన్నో విషయములు "సోదిశోత్రేన్" సోది చెప్పుతున్నానని వ్రాయబడి యున్నది. జాతక చక్రము నుండి జ్యోతి శాస్త్ర రీత్యా ఈ విషయముల నెట్లు సకారణముగా నిరూపింప వచ్చునో అచ్చటచ్చట చెప్పబడును. జాతకమునకు శాస్త్రరీత్యా ఫలము లెట్లు చెప్పవలెనో సాధారణు లెట్లు తప్పులు చెప్పుచుందురో చూపబడినది. మరియు నేను చేయుచున్న ఉద్యోగ మండలి తరగతులు, జీతములు, జీతముల వృద్ధి క్రమము ఎచ్చటెచ్చట ఎప్పు డెట్టి ఉద్యోగములు చేయునది మొదలగు విషయములన్నియును చెప్పబడియున్నవి.

3. "పరిపాలకుల (ఆంగ్లేయుల) అవినీతి చేత వారి సమానస్కంధులలోని కలహముల వలన పెద్ద యుద్ధము వచ్చును. తూర్పు పశ్చిమముల మధ్యగల పెద్ద రాజ్యములలో యుద్ధము వ్యాపించును. ఎల్లయిన్ పక్షము వారికి చాల కష్టములు వచ్చినను తుదకు జయము కలుగును." అని చెప్పబడి యున్నది. ఎల్లయిన్ (Allies) అను మాట ఆల్ లైస్ (all lies) అని చమత్కరింపబడినది. ఇట్టి చమత్కారములు నాడిలో ఎన్నో. "యుద్ధ పరిణామముగా హిందూకు (India) స్వాతంత్ర్యము వచ్చును" అని చెప్పబడినది. "ఈ యుద్ధము గురించి కవి భాషను బట్టి చెప్పెదను.

ఏడో అక్షరము (G) మొదలు పదునాలుగో అక్షరము (N) చివరగల వారున్నారు (german) అని భావము. అందు N అక్షరమును త్రిప్పి Z ఆ రెంటి మధ్య బి సి లకు పూర్వమున్న అచ్చును (A) ఉంచుచో (NAZ అగును) ఆ పేరు గలవారు చేయు దుష్ట కార్యములు, అధర్మములు లెక్కలేని కష్టము

లను కలిగించును". అని కలదు. ఈ పాటలు 7-2-32 న నాకు వచ్చినవి. ఆనాటికి నాడీలను వారున్నట్లే లోకమునకు తెలియదు.

ఈ పాటలు 1940 వరకు 613 వచ్చినవి. తరువాతి పాటల నిచ్చుట నిలిపి వేయబడినది. ఇచ్చిన పాటలలోని విశేషములు జరుగుచు వచ్చుచున్నవి.

4. కాకాభుజండనాడిలో వ్యక్తుల జాతకములేగాక, 'అరశర్ కాండ' మను భాగములో మన దేశమును పాలించిన ఇంగ్లీషు రాజుల గురించియు కలదు. "వర్తక సంఘములోని వారు పాలించి, వికటావతికి ఇండియా రాజ్య పాలన మప్పగింతురు. అట్లప్పగించిన తరువాత 43 ఏండ్లు ధర్మవరిపాలనచేసి ఆమె గతించును. ఆమె కుమారుడు పదేండ్లు రాజ్యము చేయును. అతని పరిపాలనాంత కాలమందు పెద్ద తోకచుక్క (Halley's Comet) వచ్చును తరువాత అతని కుమారుడు రాజ్యము ప్రారంభించి, భరతఖండమునకు వచ్చి పట్టాభిషిక్తుడగును. దానితో ఇంగ్లీషు వారి రాజ్య పతనము ప్రారంభమగును" అని యున్నది. ఆ కాలమందు జర్మనీ దేశమెట్లు విజృంభించునో, ఆస్ట్రియా ప్రభువు కుమారుని సర్వియావారు హత్య చేయుటచే కలిగిన యుద్ధములో 'వరలీనాథన్' జర్మను చక్రవర్తి యగు కైజరు యొక్క ప్రభను పడగొట్టుటకై ఇంగ్లాండు అతనికి ప్రతిపక్షముగా ఎట్లు చేరునో చెప్పబడినది. వరలీనాథుడు శత్రువులను—ప్రిజ్జలను (France) ను దూదిసేకినట్లు కొట్టి-పీడించునని చెప్పియున్నది.

మరియు, ఐదవ జార్జి రాజ్య కాలములో 25 సంవత్సరములు నిండగానే వైభవముగా ఉత్సవము (రజతోత్సవము) చేయుదురని, "జడ్ అన ముడింజు దయ్యా"—అనగా 26 వ అక్షరమగు జడ్ అని ఉచ్చరించినతోడనే అనగా 26 వ రాజ్య సంవత్సరము రాగానే, అతని రాజ్యము ముగియునని కలదు. కుమానే జార్జి,వి[1] (George V) ఎన్ఋ వన్‌దాల్ పేరదనిన్ అధిగారమ్ తనమేవాంగి పిరట్టువదాయ్ అరివీరే మిత్ర నాల్' అని యున్నది. అనగా, భగవంతుడు George V నుండి అధికారమును తానే తీసుకొని అనూరాధ నక్షత్రము వాడు అతని ఆయువు నపహరించును. ఇంకను ఆనాటి గోచరమందలి గ్రహ సంపుటి కూడ చెప్పబడినది. చంద్రునితోపాటు గురుడు కూడ వృశ్చికలగ్న మందుండునని, పాప గ్రహములు ముందు రాసులలో ఉండునని చెప్పి యున్నది. ఆ తేదీ 21-1-1936 నాడు పంచాంగంలో గ్రహములట్లే యుండెను.

5. అరశరకాండ నుండి ఇంకొక్క విషయము నుదాహరించెదను. (ii) పోర్‌బందర్‌లో జన్మించిన ఒకనిలో భగవంతుని కళ యొకటి ప్రవేశించును. అతడు దేశమందలి వారి నందరిని గూర్చి ఏకాభిప్రాయులగునట్లు చేయగలుగును. స్వాతంత్ర్యాభిలాషను వారికి కలిగించును. స్వతంత్ర భారతమునకై గొప్ప అందోళనమును అహింసా మార్గమునచేయును: అతని పేరు మోహన్‌దాస్. కరంచంద్ గాంధి యను ఇంటి పేరు కలవాడు. గాంధి కారణముగా ఏర్పడిన అహింసామార్గము రానురాను ప్రపంచమంతటను విస్తరించి, పొగడ్తగాంచును. భారత దేశమునకు స్వాతంత్ర్యము లభింపగానే వచ్చిన కార్యము ముగించుకొని అతడు గతించును.

(iii) స్వాతంత్ర్యము వచ్చిన తరువాత హిందీ దేశ భాష యగును. సందేహము లేదు. తరువాత

---

1. ఐదవ జార్జియని మామూలుగా వ్రాయుదానిలో ఐదు రోమను అంకెగా వ్రాయుట పరిపాటి. ఆ అంకే ఇంగ్లీషు వర్ణమాలలో (V) 'వి' వలె నుండును.

దేశమునకు గొప్ప అభ్యుదయము కలుగును. అందు పైని 'బృందిత' (?) భాష దేశ భాష యగును. ఆ భాషలో సర్వవిజ్ఞానము ప్రచారమగును. అంతవరకు హిందీయే రాజభాషగా నుండును.

(iv) ఏటమ్ను చీల్చి విభజించుటచేత పరమాణువును ఇంక విభజించుటకు వీలులేనిస్థితి ఏర్పడును. (??)—"శేషమే అటమ్ ఎన్అల్ ఒన్త్రై వెత్తు, కీరిక్కిరిపిరి త్రిశవో పరమాణుక్కుమ్ చూడునురై ఇనిపిరిక్కముడియదేను".

పైనుదాహరించిన విషయములలో చిన్నవి, పెద్దవి, మహత్తరములైనవి కూడ కలవు మరియు, మానవుడు ఇంతకంటె గొప్ప స్థితిని పొందునని, ఆ పరిణామ ఫలము మహా మహిమ కలదని, సూర్యాది గ్రహముల యొక్క శక్తులకు లోనై జీవితమును నడుపుకొనుచున్న మానవుడు ఆ శక్తుల నతిక్రమించి సర్వస్వతంత్రుడు కాగలడని, బైటనున్న ప్రకృతి శక్తులను వశపరచుకొని సంపాదించుచున్న శక్తి సామర్థ్యముల కంటె తనలోని శక్తులను జయించి, తన్నుతాను తెలిసికొనినచో లభించు శక్తి స్వాతంత్ర్యములు నిరుపమానములని,సర్వసమర్థములని, నిత్యములని అట్టి స్థితిని దివ్యానుభవములను పొందుటకై పురోగమనము సాగుచున్నదని కాకాభుజండ మహర్షి నాడిలో పలుచోట్ల స్పష్టపఱచి యున్నాడు.

ఇట్టి గ్రంథములలోని విజ్ఞానము, సంస్కృతి నిరుపమానములు. శ్రేయోదాయకములగు నిట్టి గ్రంథములు మూలబడి యుండుట, చింతింపదగిన విషయము. వీనిని బాగుగ పరిశీలించి వీని ఉపయోగానుపయోగములను తెలిసికొనుట ప్రాజ్ఞత. ఆధిభౌతికమగు పాశ్చాత్య నాగరకత నేడు ప్రబలియున్నది. దానివలన మానవ జాతికి శాంతి భద్రతలు కలుగుట లేదు. అధ్యాత్మతత్వ మూలకమగు భారతీయ సంస్కృతి యొక్కటియే శాశ్వత శాంతి అభ్యుదయములను ప్రసాదింపగలదు. ఆత్మ విద్యా మూలములగు సత్యాహింసా మార్గములను అనుసరించియే కదా గాంధి మహాత్ముడు ప్రపంచమున కాదర్శ మార్గమును చూపించియున్నాడు. అట్టి మహత్తర మార్గమును ప్రపంచములోని వారందరు అవలంబింపవలెను. దానివలన శాశ్వతమగు శాంతి, నిరుపమానమగు అభ్యుదయము లభింప గలవు. *

### చివరి మాటలు:

ఈ మాటలు నాడీ పఠనాన్ని గురించి మాస్టర్ సి. వి. వి. గారి ఆదేశము. "వ్రాయసగాఁడేమేని మార్పు చేయవచ్చును. మాతృక వ్రాసినవాఁడే యెఱుక చాలక యేమేని తప్పు వ్రాసియుండవచ్చును. గ్రంథకారుఁడే యజ్ఞుఁడై తప్పిదపు రచనము చేసియుండవచ్చును. దానికి పరమ ప్రామాణ్యము కల్పించుకొని మీరు చదువరాదు. నా దగ్గఱకు మీరు వచ్చి శిష్యులగుట నాడి మూలమునఁగాదు. నాడిఁ జూచుట మీరు నా శిష్యులయిన తర్వాతనే .ఏ కారణములతో మీరు నా శిష్యులయితిరో ఆ కారణములతోనే నన్నను వర్తింపుడు. నా మాటలు స్వతః ప్రమాణ

---

*. సంస్కృతి, సంపుటము-3 సంచిక 9 నవంబరు 1955. రాజమహేంద్రవరము-
'నాడీ గ్రంథములు'- శ్రీ విస్సా అప్పారావు, పుటలు 20-28

ములు కాని పరతః ప్రమాణములు గావు. నా కార్యము లను నాడి ననుసరించి విశ్వసింపవలదు" అనిరి.

వారిట్లెందుకు చెప్పిరనగా కాకాభుజంద నాడిలో శ్రీవారిని గూర్చిన అనేక విషయములు బయల్పడినవి. కాని అందు యథేచ్ఛముగా కల్పనలు సాగుచున్నవని శ్రీవారు కనిపెట్టిరి. అందుకే శిష్యుల నిటు హెచ్చరించిరి.

"మానవ హృదయము నిర్దుష్టము కానంత వఱకు, మానవ వాక్కు సుపవిత్రము కానంతవఱకు, మానవ కార్యములు వినిర్మలములు కానంతవఱకు సృష్టి రహస్యము మానవత గుర్తున కందనేరదు. ప్రయత్నములు సాగుచున్నవి. ఈ నాడీ గ్రంథము లట్టి ప్రయత్నమున పుట్టినవే.

"విహాయ శాస్త్ర జాలాని యత్సత్యం
తదుపాస్యతామ్
వేద శాస్త్ర పురాణాని వదపాంసుమివ త్యజేత్"

అని చెప్పినవా రిట్టి భావము గలవారే. మీరీనాడీ గ్రంథాదుల వెంటాడుట సాగించితిరేని మీలోని ప్రజ్ఞోద్బోధములు కుంటుపడును. ప్రజ్ఞోద్బోధముల వెంటాడుచు బాహ్యశాస్త్రాది సాధనములను విడనాడవలెను. కడకు ఆత్మానుభూతిలో నెలకొనుట యగును. మీరు చూడవలసినది యీ తాటాకుల నాడి గాదు. శరీరమున చైతన్యముతో ఆడుచున్న నాడి. ఈ తాటాకుల నిప్పటికిఁకఁ గట్టిపెట్టి ఇందు చూపు తత్పరతను యోగసాధనముల మీఁద చూపుఁడు'' అనిరి. *

## ఉపయుక్త వ్యాససూచిక


1. నాడీ గ్రంథములు — వేటూరి ప్రభాకరశాస్త్రి. కృష్ణాపత్రిక, 1917, అక్టోబరు 6 వ తేది. మణిమంజరి, సం-1, సం-2 అగస్టు 1981 లో పునర్ముద్రితము.
2. శ్రీ కాకాభుజందరు మహర్షి — వావిలికొలను వేంకట రమణారావు ఆంధ్రవాణి, 21-4-1945. మణిమంజరి, సం-1, సం-2, అగస్టు 1981 లో పునర్ముద్రితము.
3. నాడీ గ్రంథములు — పంచాగ్నుల దక్షిణామూర్తిశాస్త్రి. కృష్ణాపత్రిక 1917 నవంబరు 3 వ తేదీ.
4. నాడీ గ్రంథములు — 'ప్రజ్ఞా ప్రభాకరము'—వేటూరి ప్రభాకరశాస్త్రి అధ్యాయము-30, ద్వితీయ ముద్రణ, 1976.


* ప్రజ్ఞా ప్రభాకరము— వేటూరి ప్రభాకరశాస్త్రి ద్వితీయ ముద్రణ, 1976. అధ్యాయము-30 'నాడీగ్రంథములు' (పుటలు 139-153)

| | | |
|---|---|---|
| 5. తెలుగు వైతాళికులు | — | సంపుటం-2 దువ్వూరి రామిరెడ్డిని గూర్చి మరుపూరు కోదండరామిరెడ్డిగారి ఉపన్యాసము, హైదరాబాద్ 1977. |
| 6. సాగుతున్న యాత్ర | — | ఆచంట జానకిరాం (ప్రథమ భాగం) ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ, 1962. |
| 7. నాడీ గ్రంథములు | — | విస్సా అప్పారావు పంతులు, సంస్కృతి, సం-3. సం-9 నవంబరు, 1955, రాజమహేంద్రవరము. పుటలు - 20-28 |
| 8. మాయా సంధి | — | వావిలికొలను వెంకటరమణారావు. ఆంధ్రవాణి, 26-5-1945 మణిమంజరి। సం-2, సం-1 ఫిబ్రవరి, 1982 లో పునర్ముద్రితము. |



# చిన్ననాటి చేష్టలు – సీతాఫలము

— వేటూరి ప్రభాకరశాస్త్రి

దమ్మిడీ కొకటి సీతాఫలముపండు,
తమ్ము లన్నల మేము తలకొక్కపండు
అమ్మ సమ్మతి గొంటి మారగించితిమి.
''అమ్మ!! నా కడఁగదే అతీపివాపి !!

దమ్మిడీ చాలునే అమ్ముతున్నారే
మాయమ్మ కొనిపెట్టె మరియొక్కపండు
అమ్మగా అమ్మగా అయిపోవునేమొ
అమ్మగా! అమ్మగా!! ఆలసింపకువే!"

''సీతాఫలము చాల శీతళిస్తుంది
జలుబు చేస్తుందిరా జ్వరము వస్తుంది
కొనను పొ''మ్మని అమ్మ కూక లేసింది
కొనలేదు మఱినాడు కొద తీరలేదు.

చేత దమ్మిడిలేదు చేయునది లేదు
ఆతీపిపై వాపి అడచుకోలేను
ఆపండ్లగింజలే ఆటలాడుటకు
రెండు జేబులలోను నింపించుకొంటి.

గింజలే, గింజలే, గుంజు లేనేలేదు,
ఎందు కీగింజ లని యేవ తోచునుగొంత,
అంతలో నాఫలము నతిమధురిమమ్ము తోచు;
పారవైచుట యెట్లు? లారగించుట యెట్లు

పప్పు తీపేమొ యని పగులగొట్టితిఁ గాని
అది బాద మక్రోటు ఆలుబకరా కాదు
కసుకుమనికొఱికితిని,తుసుకుమనియుమిసితిని.
యాక్కులాలా! నోరువోక్కురోక్రై చెడెను

విసరికొట్టితి గింజ లన్నీ
కసరుకొంటిని వాటిమీఁదను
ఒక్కగింజే చేత మిగిలిన
దూహ గొల్పినదీ.

నాటి సీతాఫలపు చవు లవి
యూటలూరెను నోటిలోపల
ఏవంగిపును గోప ముడిగె ని
కేమొ తల పొదవెఁ.

చూచితిని యోచించిచూచితిని మరిమరీ
సీతాఫలపుగింజ చేతఁబట్టుకొనీ
ఒక్కత్రుటిలో గింజ ప్రక్కలై యందులో
మొక్క వెల్వడినట్లు బుద్ధి పొడమినదీ.

మొక్కయది పెద్దదై పెక్కుపూవులుపూచి
పిందెలై కాయలై ప్రిదిలి పండ్లైనట్లు
అవి నేను తినగలిగినన్ని తిన్నట్లు మా
యమ్మకును 'ఇంద' మనియానఁగొల్పినయట్లు.

అప్పుడే ఆగింజ జేకొని
యాస లెల్ల ఫలించినట్లై
పాటిదొడ్లో పాతిపెట్టితి
భద్రమగుచోటన్.

ముఖము గడిగిన, కాళ్లు గడిగిన
పుక్కిలించిన, మంచినీళ్ళవి
పాదులోనే, నాకు పా దది
ప్రాణపదమాయెన్.

నిక్కముగనే మొక్కమొలచెను
నేను నొక జనకుండ నయితిని
బిడ్డవలె నాచిన్న మొక్కను
పెంచదొడగితిని.

పాదుచేయుట యెరువువేయుట
పదనుగొల్పుట నీళ్ళుపోయుట
పెరుగసాగిన మొక్కజూచుచు
మురిసిపోవుటయ్యె.

గడచినవి రెండేడ్లుగాబోలు, నేపాతి
మొలపించినది మొక్క పూతపూచినది, నా
కిల్లంత గంతులే, గల్లంతులే, బలే
అల్లకల్లోలమే అది పండ్లుపండెనని.

పూవు లెన్నో రాలిపోయినవి, నా కెన్నొ
గడబిడల్ మనసులో, పొడమదాపించెయని,
ఎట్టకేలకు నొక్కచిట్టిపిం దగ పడెను
తియ నీరు నే బోసి దినదినము పోషింప,

మే కెరువు తియనీరు మేపితిని చెట్టునకు
ప్రాకుతీగల ద్రెంచి పాఱవై చితి, మన్ను
క్రుళ్ళగించితి, చెట్టువ్రేళ్ళు తెగకుండగా
ఆపించె క్రమముగా నేపునంబెరిగినది.

ఆనాడు నేదిన్న యాదమ్మిడిపండు
నురువుకంటెను బెద్దపెరిగినది యా కాయ
పచ్చికాయో పండో ప్రతిదినము పరికింతు
పండిదిగొ తిందునని దండోర వేయుదును.

మాయమ్మ చూచె,నది "నాయనా నీచేతి
చలువ సీతాఫలము ఫలియించినదిగాని
కోయకుమి యిప్పుడదికాయ కసుగాయసుమి
పక్వ మగునందాక బాగుగా బెరుగనీ

పెరిగి గింజలగళ్ళు విరిసి లో పిక్కటిలి
పండబాఱినతఱిని బ్రద్దలగు నప్పు డది
యొకనాడుమెత్తబడుటకు దాచియుంచియా
మర్నాడు తింటేను మహారుచిగ వుంటుంది.

చెప్పకుండా కాయ చెట్టునుంచి కోసేవు
కాయయును నీయాస కడకు వ్యర్థములవును,
ఆరముగ్గినపండు అతిరుచ్యముగ నుండు
నన్నదమ్ములు మీరె యారగింతురు గాని".

అమ్మమాటలు నమ్మి యాగితిని గొన్నాళ్ళు
కాయకాయే పగులు కానరాకే పోయే
నే నాగలేనైతి నెరపితిని సాహసము
కత్తితో నొకగంటు గావించితిని దాన,

అమ్మతో జెప్పితిని అది పగులు వానెనని
నామాట తథ్యమని నమ్మినది మాయమ్మ
పగిలితే కోసుకో, పండెనేమో యనెను
కోసుకొనివచ్చితిని కొయ్యవంటిది కాయ.

కసరుగాయే, కత్తిగంళే, పగులలేదు
ఇదియేమిరా తండ్రి యిట్లు చేసితి వనెను,
పనికిమాలినకాయ పారవేసెద ననెను
నాకాయ తెమ్మంటి చీకొట్టి తఱిమినది.

నాకెరుకపడకుండ నాకాయ దాచినది
దాని దెలియగ గోరి తంటాలు పడ్డాను
వెదకితిని వెదకితిని తుదకి గనుగొంటి నది
తవుటిలోపల గ్రుక్కి తట్టలో దాచినది.

ఔపడిన దమ్మ నీ దాపరిక మన్నాను
"ఎంతయావర నీకు ఎట్లు కనుగొన్నావు ?
ఉక్క కది మెత్తబడునో యేమొ రెన్నాళ్లు
తెరచిచూడకురోరి తెలివిమాలినవాడ !"

అనియెమాయమ్మనాయాత్ర మెరుగదుగదా
దమ్మిడీ కానాడు తాను గొనియియదాయె,
నా చెట్టుకాయనే నన్ను తిననియదాయె
తల్లిదండ్రులు పెద్దతంటాలు పిల్లలకు.

మర్నాడు చూచితిని మరి మెత్తబడలేదు
మఱిమొక్కపూటాగి తెరచి చూచితి నంతె
మరికొంతసేపాగి తెరచిచూచితి నంతె
ఎంతయాగిన నంతె యేమిసేయగవచ్చు !

అందులో నొకచెక్క తిందునని కోసితిని
వట్టివగ, రందు రవ్వంతైన రుచిలేదు
పారవైచితిని గోపారుణాతుండనై
ఆరజూచిన దమ్మ నారోతచేత యది.

"పండునేమో కాయ పాడుచేసితివిరా,
ఇంత తొందరయైన నెట్లురా నీబ్రదుకు
ఎబ్బెబ్బె నీవెంత యేబ్రాసివై తివిర
ఏడ్వవలసినదె నీ వింకేమి చేసెదవు."

అని యసహ్యించుకొనె నను గసరుకొనిరోసె
అవమాన మయ్యె నా కావురని యేడ్చితిని
నాసొమ్ము నే పాడుచేసుకొన్నా నన్న
గర్వమొక్కటి నాకు దుర్వారమై పొడమె.

అవమాన మొకప్రక్క నాగర్వమొకప్రక్క
పండు చెడె నన్న దుర్భర దుఃఖమొకప్రక్క
ముప్పేటలై నన్ను ముప్పుతిప్పల బెట్టె
రోతరోతై పోయె నాతీరు నాకపుడు.

ఆనాడు మానాన్న యఖిలంబు విన్నాడు
"అనుచితము చేసితివి, పనికి మాలినవాడ!"
అనునంతలో నేను గనలుచును బలికితిని,
నాచెట్టు నాకాయ నాయిష్టమేకదా.

నష్టపడితిని పండు నాకె నష్టము దీన
నెవరి కేమీ యంచు నవకతవకలు పలుక;
"నానోయి యవివేకి! యాచెట్టు నీచెట్టె
నాస్థలములో నాటినాడవది యెఱుగుమా.

నీవు నాబిడ్డడవు గావునన్ నావాడ
వే, యింతకును నెవ్వడేని యెదియేని యిది
నాది యని చెప్పుకోగా దగుట కద్దాని
జక్కరక్షింపదగు సామర్థ్య ముండవలె.
అది లేనివా డెవడు నిది నాది యనఁదగడు''
అని యిట్లు మానాన్న మనసునొవ్వనియట్లు
మందలించెను నన్ను మందమందమ్ముగా
సిగ్గునం జిదికితిని సీతాఫలమువలన.

చదువుచే తప్పిదము సవరించుకొందు నని
పాఠములు రాత్రిదీపముముందు తెఱచితిని
తెనుగుపద్యములలో మొనగాడ నగుటచే
వేమన్న పద్య మది వేమారు చదివితిని.

''తామసించి చేయఁదగ దెట్టికార్యంబు
వేగిరింప నదియు విషమ మగును
పచ్చికాయ దెచ్చి పడవేయ ఫలమౌనె
విశ్వదాభిరామ వినురవేమ.''

''ఏమిరా చదివెదవు వేమన్న పద్యమా
వ్యర్థ మే నీ చదు వనర్థమే చేసితివి
తెలివిగలవాడవైతే యిట్లు చేతువా''
యనుచు మానాన్న పద్యార్థంబు వివరించె.

ఈపద్యమున నాకు లోప మొక్కటి తోచె
నాన్న! అది యడుగదగునా? అంటి; నడుగుమనె
వేగిరించిన నదియు విష మగు ననుదాని,
కా''పచ్చికాయ-ఫలమౌనె'' యను కథ చెల్లె.

తామసంబున చేయదగదు కార్యం బనుట
కేదికథ? పద్యమున లే దేమి? లోప మిది;
నాబుద్ధి దిద్దుటకె కాబోలు నీనాడు
పాఠమున వచ్చినది పద్య మిది యంటి.

''సీతాఫలము నీవు చెరిచినా వనునేవ
తొలగె నీ కీ ప్రశ్న తోచినది కాబట్టి
పండితుడవై నీవు ప్రథితిగాంచెద వేమొ
చదువుమా నాతండ్రి సత్కావ్యములు చక్క.

గుర్తించు సత్కృతుల గుణదోషముల నిట్టు
లాత్రపడెదవొ యేమొ ఆ చదువులో గూడ
సీతాఫలపుకథను చిరము స్మరియింపుమా
బుద్ధిగలవాడవై వృద్ధి పొందుమ తండ్రి!

కవి వౌదువేని యీకథ కబ్బ మొనరింపు
మల్లె వేమన్న పద్యమున గల లోపమును
తామసంబున జేయదగ దెట్టి కార్యమను
దానికథ నొక దాని బూని రచియింపుమా!''

ఆనాటి మానాన్న యాశీర్వచన మెట్లు
ఫలియించెనో నేను పలుకజాలను గాని,
ఆనాడు నేనాటినట్టిసీతాఫలము,
ఫలియించుచున్న దిప్పటి కెన్నొ ఫలములను.



# తెలుగు తెలుపుల మేరువు

— వేటూరి ప్రభాకర శాస్త్రి

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తెలుగు భాషకు దేశమునకు అనేకముఖముల మహోపకారము గావించిన మహనీయులు. వారి వార్ధకమున వారి కార్యభారమెల్ల శ్రీ లక్ష్మణరావుగారు వహించి నిర్వహించిరి. వీరేశలింగము పంతులుగారు శ్రీ లక్ష్మణరావుగారు మద్రాసులో నివసించిన వేద విలాస మందిరమందే నిర్యాణముచెందిరి. పంతులుగారి కార్యభారమెల్ల శ్రీ లక్ష్మణరావుగారి పరమగుటే వారక్కడ వసించి యక్కడే యుసురుల విడుచుటకు గారణము. వీరేశలింగము గారికి లక్ష్మణరావు గారిమీద నంత గౌరవము.

లక్ష్మణరావు గారు వీరేశలింగముగారి త్రోవనే యనేకాపూర్వవిషయములలో పరిశ్రమించి తెలుగు నాటికి మహోపకృతి కావించిరి. ఆంధ్రదేశ భాషా చరిత్రల గూర్చి సాహిత్య విమర్శము గూర్చి ప్రాచీన శాసన పరిశోధనను గూర్చి; విజ్ఞాన సర్వస్వ విరచనము గూర్చి లక్ష్మణరావు గారివలె నంతకుముందు తెలుగువాడై, తెలుగు విద్వాంసుఁడై పరిశ్రమించి మంచి విషయముల వెల్లడించినవాఁడు లేడనుట అతిశయోక్తికాదు. లక్ష్మణరావు గారు వీరేశలింగముగారి కంటె కొన్ని క్రొత్తతీరుల యపూర్వ విషయముల నుపక్రమించి నిర్వాహము గావించిరి.

వీరేశలింగముగారి కడనుండి తమపై సంక్రమించిన యాంధ్రాభ్యుదయ నిర్వాహభారమును వీరేశలింగము గారి వలెనే ఉసురు లుడుపు క్షణముదాక శ్రీ లక్ష్మణరావుగా రఖండచాతుర్యముతో నిర్వహించిరి.

లేవలేని స్థితిలో రాత్రులందు నిద్ర సరిగా పట్టని స్థితిలో అనారోగ్యాకులతచే నయిన మనోదౌర్బల్యముతో నుండియు స్వభావము నిరంతర పరిశ్రమ పరాయణ మగుటచే పడుకమీదనే గ్రంథసంచయము నుంచుకొని పనిచేయుచు తలవేడి యెక్కి చీకాకు గూర్పగా కుమార్తను చి॥ సౌ॥ అచ్చిమాంబను బిలిచి తలకు కొబ్బరినూనె వ్రాయించుకొనుచు తరచుగా నాతో జరపిన సల్లాప సందర్భములు స్మరణకు రాగా నాకిపుడు కడుపు కలచుచున్నది.

1910 ప్రాంతము నుండి లక్ష్మణరావు గారితో నాకు మైత్రి. వారి కడపటి నాళ్లలో నించుమించుగా ప్రతిదినము మేము కలసి కొన్ని గంటలు గడుపుచుండెడివారము.

లక్ష్మణరావు గారి కంఠము మేఘ గంభీరము. ఆకారము శాంతోదారము. వాద చాతురి తర్కజటిలము. కొన్ని యేండ్లపాటు నిరంతము వారితో వాఙ్మయ విషయ చర్చలు సాగించి వినోదించిన నేనెరుగుదును, వారి ప్రజ్ఞా నైశిత్యమును. ఆయన తెలుగు తెలువుల మేరువు. ఆంధ్రదేశమున కాయన త్యాగి. ఆయన కొఱత తీర్పరాని కొఱత. ఆయన తగు ధనవంతుడు గాకున్నను తాను రచించిన గ్రంథముల యాయతి విజ్ఞానచంద్రికకే విడనాడెను. అది తానెక్కైకొన్నచో వారి కుటుంబ మానాడే సువర్ణమయి యుండెడిది.

లక్ష్మణరావు గారు మరి కొంతకాలము జీవించి యుండినచో ఆంధ్రదేశ భాషల గౌరవము వేరు తీరుగా జగద్విఖ్యాతముగా వెలసి యుండ బోవును.

ఆయన విజ్ఞాన సారస్వతాది గ్రంథ నిర్వహణ మనసే గాక, ఆంధ్ర విశ్వవిద్యాలయ నిర్వాహమును గూడ కావించి యుండ గల్గును.

లక్ష్మణరావు గారికి శ్రీ సోమశేఖర శర్మ గారిపై నమిత వాత్సల్యము. లక్ష్మణరావు గారి కార్యోపక్రమములను సరిగా నిర్వహింప దగినవారు శర్మగారు. శ్రీ వీరేశలింగము గారియు, లక్ష్మణరావు గారియు ప్రజ్ఞా పాలకములు శర్మగారి కండయై తమ యుపక్రమముల వారిచే నిర్వహించు కొన గలుగు గాక!

లక్ష్మణరావు గారి సంకల్పముల నిర్వహించుటే ఆంధ్రులు వారికి జేయు నారాధనము.

"తెలుగు తల్లి"
లక్ష్మణరాయ వర్ధంతి సంచిక
సంపుటి- 4. సంచిక- 2
అక్టోబరు, 1944, పుటలు 30-31
సికింద్రాబాద్.

(సేకరణ- లేఖకుడు
ముదివేడు ప్రభాకరరావు, ఎం ఏ.,
సహాయాంధ్ర పరిశోధకుడు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్య పరిశోధన సంస్థ
తిరుపతి.)

౨

# నా క్రొత్తపంథా:
# వేటూరివారి చేయూత

— పి. వి. రాజమన్నార్

'కళ' పత్రికద్వారా నాకు పరిచితులైన మహనీయుల్లో వేటూరి ప్రభాకరశాస్త్రిగా రొకరు. అతని పరిశోధనా సామర్థ్యం, అతని సాహిత్య విమర్శ ప్రావీణ్యము అసమానం. అయినా అతడువిద్వాంసుడు మాత్రమేకాదు-రసికుడు; సహృదయుడు కూడా.అతని ప్రతిభను క్రొత్తమార్గంలో వినియోగించడానికి నేను పూనుకున్నాను. అదృష్టవశాత్తూ నా యత్నం సఫలమైంది. నాటక ప్రదర్శనం గురించి వారిచే వ్యాసాలు వ్రాయించాను. అప్పుడు ఏలూరు నాటక సమాజం వారు మద్రాసులో నాటకాలు ప్రదర్శించారు. సావిత్రి, శకుంతల, రాధాకృష్ణ (పానుగంటి వారివి.) కృష్ణ తులాభారం మొదలైనవి. ఆ నాటకాల్లో పాల్గొన్న నటవర్గంలో చేరిన ప్రఖ్యాత నటులు యడవల్లి సూర్యనారాయణ, అద్దంకి శ్రీరామమూర్తి, ఉప్పులూరు సంజీవరావు, పారుపల్లి సుబ్బారావు మొదలైన వారు. వీరి అభినయాన్ని విమర్శిస్తూ వ్యాసం వ్రాశారు 'కళ' కోసం ప్రభాకరశాస్త్రిగారు. నా ప్రార్థన పాటించి నిష్పాక్షికంగా, నిర్భయంగా నిశితంగా రచించిన వీరి విమర్శ ఒక చిన్న తుపాను లేవదీసింది. వీరి అభిప్రాయాల్ని కొందరు ప్రశంసిస్తూ కొందరు ఖండిస్తూ వ్యాసాలు వ్రాశారు. ఒకటి రెండు అట్టివి 'కళ' లో ప్రకటించాను. కొన్ని ఇతర పత్రికల్లో పడ్డవి. ఇటువంటి నాటక ప్రదర్శన విమర్శలు పాశ్చాత్య దేశాల్లో సామాన్యంగా పత్రికల్లో ప్రచురించడం సువిదితం.

అయితే తెలుగు పత్రికల్లో 'కళ' దారి చూపిందని నా నమ్మకం. శాస్త్రిగారి వంటి విమర్శకాగ్రేసరుల సాహాయ్యం లేకపోతే నేనీ క్రొత్తపంథా తొక్కడానికి సాహసించేవాణ్ణికాను. ఈ విషయంలో శాస్త్రిగారు నాకు చేసిన ఉపకారం మరచిపోలేను.

శాస్త్రిగారు అప్పుడు తిరువళ్ళిక్కేణి చిన్నతంబి మొదలి వీధిలో ఉండేవారు. అనేక పర్యాయాలు వారింటికివెళ్ళి అమోఘమైన సాహిత్య రహస్యాలు గ్రహించాను. వారికి నా మీద ఎక్కువ వాత్సల్యం. 'క్రీడాభిరామాన్ని', పరిష్కరించి అద్భుతమైన ఉపోద్ఘాతంతో ప్రకటించారు. అప్పుడు నా వద్ద ఒక అభిప్రాయం పుచ్చుకొని గ్రంథం ఆఖరున చేర్చారు. అందులో ముఖ్యాంశం ఏమంటే-అక్కడక్కడ కొన్ని పదాలు వర్ణనలు ప్రస్తుత సాంఘిక నియమాల ప్రకారం అసభ్యంగా ఉన్నా గ్రంథానికి అశ్లీలతా దోషం తగలదని. క్రీడాభిరామం ఎవరు రచించారు? వల్లభామాత్యుడా, శ్రీనాథుడా అనే వివాదం ఒకప్పుడు ప్రబలంగా ఉండేది. ఇలాటి వివాదాలు నాకునచ్చవు. షేక్‌స్పియర్ నాటకాలు ఎవరు వ్రాశారు అనే సమస్య గురించి అనేక గ్రంథాలు ప్రచురింపబడ్డవి — నేటి వరకూ —. ఈ వాదాలు నాకు హాస్యాస్పదంగా ఉంటవి ఎవరు కర్త అయితే నేమి, కృతి కదా ప్రధానం. 'క్రీడాభిరామం' వంటి కావ్యం తెలుగు భాషలో మరొక్కటిలేదు. తత్కాల సాంఘిక జీవి

తాన్ని అంత రసవంతంగా, స్వభావసిద్ధంగా చిత్రించిన కావ్యం......

ప్రభాకరశాస్త్రిగారు ముప్పై సంవత్సరాలకు పైబడి మద్రాసులో ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో పండితులుగా పనిచేశారు. ఆతరువాత తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇనిస్టిట్యూట్‌లో రీడర్‌గా ఉండి పరిశోధన సాగించారు. తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తనల్ని లోకానికి అందజేసింది వారే....

నేను ప్రతిసంవత్సరం తిరుపతికి ఒక పర్యాయమైనా వెళ్లడం మామూలు. 1950 సంవత్సరంలో నేనూ, కొందరు మిత్రులూ వెళ్ళాము. ఈ వార్తవారి చెవిని పడ్డది. మేము కొండమీదనుంచి దర్శనానంతరం క్రిందికి కారులో వస్తుంటే దారిలో ఎవరో ఆపారు. ఎందుకని విచారించాను. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి నుంచి తమ యింటికి రమ్మని ఆహ్వానం. సరాసరి కారు అక్కడికే పోనిచ్చాను. నన్ను చూచినప్పుడు వారి ఆనందం ఇప్పటికీ కనులకు కట్టినట్లుంది. "రా నాయనా" అని పలుకరించి నాకు, మిత్రులకు అల్పాహారం ఇచ్చారు. వారి అతిధ్యం అందుకుని, వారి ఆశీర్వాదం పుచ్చుకొని మద్రాసు వచ్చేశాము. తరువాత కొద్ది రోజులకే వారి నిర్యాణం. ఆ వార్తవినగానే నేను వారి దగ్గర సెలవు తీసికొని వెళ్ళేటప్పటి ఆయనచూపు జ్ఞాపకం వచ్చింది. ఇదే ఆఖరుచూపు అన్నభావం అందులో ఉండినట్లు తోచింది.

ప్రభాకరశాస్త్రి ఆంధ్ర సాహిత్యానికి చేసిన సేవ అద్వితీయమైంది. ఆయన చిత్రపటాన్ని తిరుపతిలో ఆవిష్కరిస్తూ ఈ క్రింది పద్యాన్ని చదివాను :

"సరసుడు, పండితుం, డఖిల
శాస్త్రవిశారదు, డాంధ్రవాఙ్మయాం
తరపరిశోధనోత్సుకు, డు
దాత్త విమర్శకచక్రవర్తి, యా
పరమపవిత్రజీవుడు ప్ర
భాకర భాస్కరు డస్తమింప, దు
ర్భరమగు నార్తితో దిమిర
బంధుర మయ్యెను తెల్గుగుండియల్"

(పుస్తక ప్రపంచం - సంపు. 5, సంచిక - 3
జులై 1964. పుటలు: 26 -27)



ఆంధ్ర రచయితలు :

# వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

—మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ప్రభాకరశాస్త్రిగారు పిడుగువంటివాఁడు. ఎడతెఱపి లేని భాషాపరిశ్రమము. గడిదేఱిన యుభయసాహిత్య పాండిత్యము. వడిగల కార్యదీక్షాదక్షత. చెడిపోవు నన్నపని తలపెట్టఁడు. ఒడుదొడుకులులేని తేట తెనుఁగుఁగవిత యిట్టివానిపాలఁబడినది. ద్రావిడము నెఱుఁగును. ఆంగ్లమునఁ దనకుఁగావలసినంత పరిచయము. తమిళమునఁ దగినవేత్త్వత. దీనిచేతనే ప్రాచ్య లిఖిత పుస్తక భాండా గారమునఁ బరిశోధన పండితులై చెన్నపురి పౌర పండితులచే జోహారులు చేయించు కొనినారు. అచ్చు యంత్రముల మొగ మెఱుఁగక మట్టి బ్రుంగినతాటియాకులఁ బట్టి కన్నులు చిల్లులు చేసికొనుచున్న ముదిపండితుఁడీయన.

ఆంధ్రభాషా స్వరూపము నవలోడించి, జాను తెనుఁగుఁదీయదనము నాకళించి వివిధ భాషావేత్తయై కవిత్వము నల్ల నారంభించినాఁడు.

కడుపుతీపు—కపోతకథ—మూన్నాళ్లముచ్చట—విశ్వాసము—మత్త విలాసము—భగవదజ్జుకము—ప్రతిమానాటకము—మున్నగునవి వెలయించినాఁడు. వీనిలో మూడు వంతులు ఖండకృతులే. అయిననేమి ? కలకండములు !

తెనుఁగునుడుల కూర్పునేర్పు నబ్బురముగా నబ్బించుకొన్న కవివరుఁడితఁడు. సంస్కృత సమాస సంగ్రథనము సరేసరి. పెద్దనవలె రచనకు మంచి బింకము నిత్తురు. ఎఱుకకుఁదవిలిన యొకసీసము వ్రాసెద,

కురులు చిక్కార్చి దిక్కులుగాంచి చేలాంచ
లముఃద్దుకొని కంచెలం దొలంచి
మొగము మంగళసూత్రమును నోలగందంబు
పసుపునఁ బూసి మన్ విసరివైచి
గుమురొత్తుపులకల నిమిరి పొక్కిలిబంటి
నీట నీరెండమైనాట డిగ్గి
గుమ్మడిమూటగాఁ గూర్చుండి చిగురాకు
దొప్పదోసిళ్లనీ రప్పళించి

దరిని గల బ్రాహ్మణుండు మంత్రములు వలుక,
నల కనకగాత్రి కృష్ణలో జలకమాడె
గరఁగఁబోసిన పొంగు బంగారమనఁగ,
నంగ కాంతులతోడఁ దరంగలాడ.

('కడుపు తీపు'లోనిది.)

పదముల కుదింపునకు, భావంపు సొంపునకు మఱి రెండు పరికింపుఁడు.

బాలింతతనము తోడనె,
సూలింతతనమ్ము వచ్చి సోలించుట ని
ల్లాలికిఁబనితోడని నెల,
కూలికి నొక దాసిపడుచుఁ గుదిరిచె నతఁడున్.

ఎల్లి దానిపేరు నల్లనిచాయది,
వయసు పదియునాఱు వత్సరములు
కూలి నాలి చేసికొనుచుండెడిది గాన,
చిక్కనయిన మేని చెలువుగలది.

("మూన్నాళ్ళ ముచ్చట" నుండి)

శ్రీనాథుఁడు ప్రభాకర కవికి నచ్చిన తెనుఁగుకవి. అతని పద్యము లెన్నో యితనికిఁ గంఠస్థములు. "శృంగార శ్రీనాథము" వ్రాసి శ్రీనాథునిపైఁ గల యతివేలాభిమానము నగుపఱిచినాఁడు. 'క్రీడాభిరామమున'కు బెద్ద పీఠిక వ్రాసి పరిష్కరింపఁగా, దానిని శృంగార గ్రంథమాలవారు ప్రకటించిరి. 'హరవిలాసము' వీరు సరిపఱిచినది యానందముద్రణాలయ మావిష్కరించినది. వీరొక తీరులోనికిఁ దెచ్చిన "కాశీఖండము" వావిళ్ళవారు వెలువరించిరి.

మన విశ్వకళాపరిషత్తువారు వీరి సహాయసంపదచే "రంగనాథరామాయణము" నేఁడు పునర్ముద్రించుచున్నారు. ఒకటేమిటి ? ప్రాక్తనప్రబంధము లెన్నిటిమీఁదనో వీరి పరిష్కరణ ముద్రలు పడియున్నవి.

ప్రబంధరత్నావళి — చాటుపద్య మణిమంజరి సంపాదించినారు. "తంజాపూరు ఆంధ్రరాజుల చరిత్ర" వ్రాసిరి. దీని 'తాడిమ' చూడఁదగినది. వీరిపేరు కవిగాఁగాక, గ్రంథసంధాతగాను, టీకాకర్తగాను దేశమున వాసిగనినది. "దేశికవిత" సేకరించవలె నన్నయాశ వీరికిఁ గొండంత "అపీ-యపీ" యని వీరు ప్రకటించుచున్న పరిశోధన వ్యాసములు అపూర్వ విషయ గర్భితములు.

ఇది యిటుండనిండు; వీరి యధ్యాత్మిక దృష్టి చాల పెద్దది. వీరు ప్రతికార్యము పరమేశ్వరప్రీత్యర్థమే సంకల్పింతురు. యోగనిష్ఠాగరిష్ఠులు. మానసిక శాంతి లేనివారు, శారీరక స్వాస్థ్యము వీడినవారు వీరి వాగమృతముచేఁ బరితృప్తులగుచుందురు. 'స్వయం తీర్ణః పరాంస్తారయతి' యీ యాభాణకము వీరిపట్ల నన్వర్థమగును. వీరివంటివారు మఱికొంద ఱున్న మానవసంఘము విజ్ఞానవిలసితము కాకపోవునా ? గాంధీమహాత్ముని పవిత్రాశయములు వీరి కొజ్జబంతులు ఈశ్వరమహత్త్వమెఱిఁగిన మహాత్ముఁడాయనయేయని వీరివిశ్రంభము. ఎంతవాడైనను, అడకువలో నడఁగి యాకుమూలపిందివలె నుండి తన పాండితీప్రతిభ బయలు చేసికొనకున్న పండితుఁడు ప్రభాకరశాస్త్రిగారు — ఈ వినయవాదము వినుఁడు !

"ఆఱవము వాడుకభాషతప్ప గ్రాంధిక భాష నాకు రాదు. ఇంగ్లీషు అసలేరాదు. చిరశ్రవణమున నేదో గుఱికి గొంతయెడముగా నర్థమగుట గాని యందు నాకేమాత్రము నెఱుకలేదు. తెలుఁగులో నేదో కొంత తంటాలు పడితిననుట తథ్యము. ఆంధ్రవాఙ్మయ సౌధ నిర్మాణ కర్మకారులలో నేను నొకఁడ నగుదు ననుకొని కొన్నాళ్లు కూలిపనిచేసి మట్టిముద్దలు మోసితిని. చేతులు కడిగికొను దశలో నిప్పుడున్నాను-నా యాధ్యాత్మిక పరిశ్రమమునకు సంబంధించిన విషయము లితరులకుఁ దెలియవలసినవిగావు...తెలుఁగున నేను నేర్చిన నాలుగు ముక్కలకు పూజ్యులు, గురువర్యులు నగు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి గురుత్వానుగ్రహము ప్రధాన కారణము...వాఙ్మయ విషయమున నాపైఁ గొన్ని యప్పులున్నవి. అవి యెప్పుడో తీర్పవలసినవి. కాని పెక్కేండ్ల నుండి యుపేక్షతోనే యుంటిని. ఈశ్వరానుగ్రహమున్న నందుఁ గొన్నింటి నేని యిఁకఁ దీర్చుకొనఁగల్గుదునేమో ?"

('భారతి' ప్రమాది, కార్తికము).

ఆడంబరములేని యిట్టి పాండిత్య మీయుగమున నార్థికముగ మిక్కిలి దవ్వుగదా ?

ఇట్టి పండిత కవి ప్రాపు చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునకుఁ బెక్కేండ్లు లేకపోయినది. అయిననేమి, తిరుపతి వేంకటేశ్వరులు శిష్యవాత్సల్యముతో నిపుడు తమ సన్నిధి నిడికొని యున్నారు.



శ్రీ ప్రభాకరశాస్త్రిగారు

# రంగనాథ రామాయణం రామలింగారెడ్డిగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు

—డా॥ వేటూరి ఆనందమూర్తి

1938 ప్రాంతాలలో డాక్టర్ సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారికి రంగనాథరామాయణాన్ని చక్కగా పరిష్కరింపజేసి ప్రకటించాలనే సంకల్పం రూపు దాల్చిన దగ్గర్నించి 1942 లో ఆ గ్రంథం శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పీఠిక లేకుండా ప్రకటింపబడినంత వరకూ నడచిన గాథను డా॥ వేటూరి శంకరశాస్త్రిగారు 'ఎన్నని చెప్పేది ?' అన్న తమ వ్యాసంలో సంగ్రహంగా పేర్కొన్నారు (చూ. మణిమంజరి ఆగస్టు 1982 సంచిక పుటలు 181-183.) "రంగనాథ రామాయణ పరిష్కరణమును గూర్చి లోకమునకు తెలియని" చరిత్రాంశముల నెరిగిన పెద్దలు ముగ్గురు నలుగురిలో పూజ్యులు శంకరశాస్త్రిగారొకరు.

★ ★ ★

మొత్తానికి రంగనాథ రామాయణం 1942 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి గ్రంథమాలలో 28 వ కుసుమంగా వెలువడింది. అందు పరిష్కర్తగా ప్రభాకరశాస్త్రిగారి పేరుందేగాని వారి పీఠికలేదు కట్టమంచి వారి యభిప్రాయములను తమ యభిప్రాయములతో 'జోడించి పొందించిన' శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారి సంగ్రహ పీఠికతోను కట్టమంచి వారి ఎనిమిది పుటలు అనుబంధ పీఠికతోను ఆ గ్రంథం వెలువడింది.

దరిమిలా ఆ ప్రచురణం మీద అప్పటి భారతి పత్రికలో శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి విమర్శ వెలువడింది. (చూ. సారస్వతాలోకం 1980 ముద్రిణ 5 వ వ్యాసం 'రంగనాథ రామాయణము'). గ్రంథకర్తృత్వాన్ని గురించీ, గ్రంథనామాన్ని గురించీ అచ్చులో శాస్త్రిగారి పీఠిక లేకపోవడాన్ని గురించీ అచ్చుపడ్డ పీఠికల్లోని అనేక విషయాలని గురించీ సాహిత్యజ్ఞులు తర్జభర్జనలు జరిపారు. శాస్త్రిగారు "రంగనాథుడను కవీశ్వరుని గూర్చి యిటీవల చెలరేగిన వాదదావాగ్నిలో జిక్కుపడి నేనాడలు కాల్చుకొనజాలను...రంగనాథుని గూర్చి యుపలబ్ధాంశముల నెత్తి చూపుటకే నా యీ యుపక్రమము. ఇందు ప్రామాణ్యచర్చను ప్రాజ్ఞులు కావింపగలరు గాక" అన్నమున్నుడితో కొన్ని విషయాల్ని వారి చివరి రోజుల్లో ప్రకటించారు (చూ. చాటుపద్య మణిమంజరి. ద్వి భా ప్రథమ సం॥ 1952-పు 61-87.)

"రచించిన రోజుల నుండి నేటిదాకా రంగనాథ రామాయణం ఆంధ్రదేశంలో చాలా ప్రచారంలో ఉంది.' అంటూ ఆ గ్రంథాన్ని ప్రకటించిన ముఖ్యమైన ముగ్గురు ప్రకాశకులను గురించీ, విజ్ఞులూ, సాహిత్య చరిత్రకారులూ వేసిన అంచనాలను గురించీ చక్కని సమీక్ష చేశారు ఆరుద్రగారు [చూ. సమ

[గ్రాంధ్ర సాహిత్యం-III- 1965. పు.221 254.] ఇది ఈ వ్యాసానికి పూర్వరంగం.

★ ★ ★

రాళ్లపల్లివారు తమ విమర్శలో ఇలా వ్రాశారు. "ఈకావ్యగౌరవమునకు తగినట్లు దీని శోధించు కార్య గౌరవముసుగృహీత నామధేయులగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిల వారిచేతి కబ్బినది. ఈ పనిని వారి కంటే సమర్థతతో, శ్రద్ధతో నిర్వహింపగల సిద్ధహస్తులుగా యెరిగి నంతలో వేఱొక్కరు లేరు. వారికి చేదోడు వాదోడుగా నామిత్రులు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్య గారును చాల పనిచేసిరని వినికి. కాని వారిపేరీ కూర్పులో ఎక్కడను కానరాక పోవుట చింతనీయము.

మఱి ప్రభాకరశాస్త్రి గారిది కూడ తెర మఱుగు పనియే యైనది. పీఠికలలో వారిపే రుల్లేఖింపబడి యుండక పోయినచో వారిది కూడ 'నిర్నామ' కర్మమే యైయుండెడిది. కాలమునకు సరిగ వారికి 'అనారోగ్యము' కలుగుటచే, వారు వ్రాయవలసిన వ్రాయ గలిగిన విపులమై ప్రామాణికమైన పీఠికతో చేర్చి యీ గ్రంథము చవిగొను భాగ్యము చదువరులకు లేకపోయినది. ఇది త్వరలోనే రెండవ కూర్పునకు రావలసినదిగాన అప్పటికైనను శాస్త్రిగారి యుపోద్ఘాతము రాగలదను నాశకును అవకాశమిప్పటి పీఠికలలో లేదు. "ఈ రంగనాథ రామాయణమునకు నెంతో విపులమైన విమర్శ వ్రాయవలెనని యున్నది. కాలానుకూల్యమునుబట్టి ఆపని భావికాలమున నెరవేర్పగలనని యాశపడుచున్నాను." అని యా భారమంతయు తన మీదనే వేసికొన్నారు శ్రీ పింగళి లక్ష్మి కాంతముగారు తమ సంగ్రహ పీఠికలో. శాస్త్రిగారి యారోగ్యము వారు శాశ్వతముగా పీఠికారచన చేయలేనంత చెడినదని యూహింప భయపడుచున్నాను. శాంతం పాపమ్! మఱి పీఠిక వ్రాయవలసిన భారము రెడ్డి గారిపై పడగా వారికిని అనారోగ్యమే విఘ్నమై దాపురించినది! కాబట్టి వారు లక్ష్మి కాంతముగారిని నియమించినారు. వారి పీఠికయైనను విపులముగా లేకున్నను స్వతంత్రముగా, గూడ నుండ జాలక పోయినది".

★ ★ ★

ఈ రామాయణ ద్విపదలంటే రామలింగారెడ్డిగారికి మక్కువ ఎక్కువ. బసవపురాణద్విపదల్ని సర్వ సమర్ధంగా పరిష్కరించి విపులమైన పీఠికతో వాటి నుద్ధరించిన ప్రభాకరకర శాస్త్రిగారికీ ఈ రామాయణ ద్విపదలంటే మక్కువే. అందుకే ఈ గ్రంథవు ప్రకటనకు ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు ఉద్యమించిన సందర్భంలో "ఈ పనిని వారి (శాస్త్రిగారి) కంటే సమర్ధతతో, శ్రద్ధతో నిర్వహింపగల సిద్ధహస్తులు నా యెఱిగినంతలోవే ఱొక్కరు లేరు" అని తమ విమర్శలో ప్రకటించిన రాళ్ళపల్లివారి ప్రత్యయమే వెనుక రామలింగారెడ్డిగారినీ ప్రభావితుల్ని చేసింది. ఆయన ఈ పనిని శాస్త్రిగారికి అప్పచెప్పాలనుకొన్నప్పుడు అది తగునని సూచించినవారుకూడా రాళ్ళపల్లివారేనని ఆ విషయమెరింగిన పెద్దలంటారు. ఆ ప్రకారమే కట్ట మంచివారు ప్రభాకర శాస్త్రిగారిని ఈ పనికి పూనుకోవలసిందిగా కోరడం జరిగింది. "శ్రీ శాస్త్రిగారు సమకాలికాంధ్రలోకో త్తరులలో నొక్కరు. పాండిత్యము, పరిశోధన, విమర్శనము అను నీమూటియందును బ్రగల్భులు. అతఁడీ రామాయణ సంపాదక కార్యమునను, ముద్రణముననను చేసిన విద్యాకైంకర్యము వర్ణనాతీతము" అని కట్టమంచివారు తమ అనుబంధ పీఠికలో వ్రాసిన తీరే దానికి నిదర్శనము.

ప్రభారకర శాస్త్రిగారప్పుడు ప్రభుత్వోద్యోగంలో ఉన్నారు. రంగనాథరామాయణ ద్విపదలమీద వారి కెంత మక్కువ వున్నా, విశ్వకళాపరిషత్తువారి అభ్యర్ధనను పురస్కరించుకొని గ్రంథపరిష్కరణ బాధ్యతను స్వీకరించాలన్న ఉత్సాహమెంత వున్నా తఖ్తాల

పరిస్థితులు, ఉద్యోగవిధులు, అధికారుల అంశలు ఆలోచనలు, వారి ఉత్సాహాన్నీ, పరిశ్రమనీ కట్ట మంచివారన్నట్లు 'విద్యాకైంకర్య' మాత్రంగానే సీమితంచేసినవి. ఇవే రాళ్ళపల్లివారు తమ విమర్శలో 'తెరమఱుగు పనియైన' దనీ, 'నిర్మామకర్మ' మైనదనీ వ్రాసినదాని వెనుకనున్న కారణాలు.



1938 మధ్యలో విశ్వకళా పరిషత్తువారి అభ్యర్థన వచ్చేనాటికి శాస్త్రిగారు మద్రాసు (ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం)లో పనిచేస్తూ వుండినారు. గన్నవరపు సుబ్బరామయ్యగారు అంతకించుక పూర్వమే తాము చేస్తుండిన ఉద్యోగాన్ని కూడా కోల్పోయినారు. ఆనాడు సుబ్బరామయ్యగారు శాస్త్రి గారిని దర్శించి "మీరు వెలిగించిన దీపం ఈనాడు మా యింట ఆరిపోయింది" అని ఆర్తిని ప్రకటించి రట. అంతకు పూర్వం పంతులుగారితో చెప్పి సుబ్బ రామయ్యగారిని భారతిలో ప్రవేశ పెట్టింది శాస్త్రిగారే. ఆ ఉద్యోగమే ఆయన అప్పుడు కోల్పోయింది. అప్పటి ఈ సందర్భాలన్నిటినీ బులుసు వెంకటరమ ణయ్యగారు జ్ఞాపకం చేసుకొని వ్రాశారు. (చూ. మణి మంజరి ఆగష్టు సంచిక-పుట 193) ఈ రంగనాథ రామాయణ పరిష్కరణం నెపాన శాస్త్రిగారు సుబ్బ రామయ్యగారికి ఉపాధి కల్పించాలని తలపోశారు. వారి సంకల్పం ఫలించింది. శాస్త్రిగారు పెట్టిన షర తుకి అంగీకరించి విశ్వకళాపరిషత్తువారు సుబ్బ రామయ్యగారికి అల్పవేతనంమీదనైతేనేమి (నెలకి 30-40 రూపాయలు) ఉపాధి అవకాశం కలిగించారు. (చూ. అదే సంచిక పుటలు 192; 193) రంగనాథరామా యణ పరిష్కరణ కార్యానికి సవ్యంగానే ప్రాతిపదిక ఏర్పడ్డాయి. విశ్వకళాపరిషత్తువారు శాస్త్రిగారికి వ్రాసిన లేఖ యిది.

**Subject:- Editing of RANGANATHA RAMAYANAM**

Waltair
8-9-1938

"... I am desired by the Vice-Chancellor to request you kindly to begin the work of preparing a correct text of the poem, Ranganatharamayanamu. As desired by you, the assistance of a clerk will be given to you. For this purpose Mr. G. Subbaramayya, ex-editor of the 'Bharati', has been appointed (vide copy of his appointment order enclosed).

I am to inform you that the University expects you to prepare a masterly edition embodying portions omitted so that a scholarly edition may be made available

Kindly acknowledge receipt of this letter.

The manuscript is being sent by separate registered post" etc ;

అవిఘ్నమస్తు అని పని ఆరంభించేలోగానే విఘ్నా లెదురైనట్లున్నాయి. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం క్యూరేటరు శ్రీ P.P S. శాస్త్రిగారు కట్ట మంచి వారిని కలుసుకున్న దరిమిలా శాస్త్రిగారికి విశ్వ కళాపరిషత్తు నుండి వచ్చిన యీ లేఖ చూడండి

Waltair
7-10-1938

"... I am desired by Vice-Chancellor to write to you as follows ;

Mr. P.P.S. Sastry who came here the other day in connection with the University bussinss had a talk with the Vice-Chancellor on this subject. Mr. Sastri is of the opinion that there will be difficulty from Government if the University officially appoints you as the Editor of Ranganatha Ramayanamu. He therefore proposes that the whole thing should be done quietly and unofficially, that he (Mr. Sastry) whould give all assistance to Mr. G. Subbaramayya, the Pandit clerk appointed by the University, but that we must not officially call him a clerk appionted to assist you and that your name must not appear as the official editor. He further suggests that after the manuscripts are ready, you may require about fifteen days to one month to put it into a shape and that for this you may take leave then and complete the work. As the Vice-Chancellor will write the introduction he may mention you as one who has assisted and so forth.

The Vice-Chancellor hopes that you will kindly agree to the above proposals and do the work without having any official designation.

Kindly treat my letter No. 179-C-38 dated 8-9-38 as having been cancelled.

An early reply is requested." etc.

★ ★ ★

అనుకున్న ప్రకారం పని అయితే జరగాలి గాని చేసినవారిపని పైకి రాకూడదు, వారి పేరూ ఉండకూడదు. ఉపోద్ఘాతం ఉపాధ్యక్షులే వ్రాస్తారు. చేసే పని శాస్త్రిగారు పక్షంరోజులు సెలవుపెట్టి పూర్తిచేయాలి ఇదీవిషయం! అయినా రంగనాథరామాయణ పరిష్కరణ కార్యంపట్ల తమకు గల అభిరతి తానీ పనికి పూనుకోకపోతే సుబ్బరామయ్యగారికి కలిగిన ఉపాధి కాస్తా పోవచ్చునేమోనన్న భీతి శాస్త్రిగారిని ఇరకాటంలో పెట్టినట్లు కనిపిస్తుంది. వారిలా సమాధానం వ్రాశారు.

From : V. Prabhakara Sastri

4, Venkatarangam Pillai st.
Triplicane, Madras
30-10-1931

". . . I request you to assure the Vice - Chancellor that I am second to none in my eagerness to see the early publication of the critical edition of the 'Ranganatha Ramayanamu'. Mr. Subbarama Iyah whose services I have secured for this purpose is a competent and conscientious scholar. He has borrowed the necessary Mss. from the Library and is proceeding with the work. With the co-operation that I am always willing to give I have no doubt that a really useful edition will result. The introduction which the learned Vice- Chancellor intends to contribute will be a very welcome addition and a notable feature of value. I am really happy to know he will be co-operating in this work.

There are certain topics, however, which can be satisfactorily dealt with only by one who has put in considerable work specially on this book. These include critical consideration of the author's life, date, style etc., comparison of the treatment with those in Sanscrit and other Indian Languages and so on. Any remarks worth making on these will most suitably be made as a critical study

appended to the edition, not as an independent work. And the remarks should embody the results of continuous patient study and research. If any scholar is willing to give freely of the fruit of his labour in such a matter, I am sure the learned Vice-Chancellor will agree that he may expect in fairness to himself and to other scholars, the due recognition of his work as the author of the study. Without undue immodesty, I believe I can contribute a study of some value. If the distinguished Vice-Chancellor, who is himself no mean scholar, thinks my services worth commanding, I shall be happy to place them at his disposal. All that I request is that the labours should receive the barest justice by due recognition of my editorship and the authorship of the critical study. I also request that the necessary permission from the Government of Madras should be sought for and obtained before the book is given its final shape. I am sure you will realise that this permission is essential for me to do the work, irrespective of my name figuring anywhere I shall be graeteful if you will place this letter before the Vice-Chancellor and communicate his decision to me at an early date." etc.

  

తదుపరి విశ్వకళాపరిషత్తు నుండి ప్రభుత్వానికి లేఖ వెళ్లింది.

15-11-1938

Waltair

"... I have the honour to inform you that the Syndicate has invited Mr. V. Prabhakara Sastry of Government Oriental Manuscripts Library, Madras, to edit and prepare a masterly edition, embodying portions omitted of the above poem and to request that you will be so good as to permit him to undertake the work.

I may also add for your information that the University will not pay him any honorarium and that the work is one of guidence only.

I may further add that the Vice-Chancellor has appointed a Pandit Clerk to work under Mr. V. Prabhakara Sastri to do the writing and other work in the preparation of the above edition.

  

తరువాత ఏంజరిగిందీ ఎలాటి పరిస్థితుల్లో ఒప్పందం కుదిరిందీ శాస్త్రిగారి యీ సమాధానాలు విశదీకరిస్తాయి. ప్రభుత్వంవా రడిగిన ప్రశ్నల పరంపరకి శాస్త్రిగారిలాబదులు వ్రాశారు.

12-12-1938

From : Prabhakara Sastrri

"... The preliminary copying and and collation is entirely the work of Sri G. Subbaramayya, a competent scholar. As I have no hand in it, I can neither regulate nor accurately judge the speed with which it is done. From what I have come to hear about the need for consulting Mss. outside Madras and judging from general considerations, I believe it will be some nine or ten months before my help is needed for editing.

Even at this stage, the preparation of the press copy will be done only by the Pandit under my guidance, in the shape of directions given from time to time, say once a week. The period taken for the editing will thus depend largely on the quickness with which my instructions are given effect to. Hence there can be no accurate forecast here too. I believe about six moths will be an outside limit. During this period my work will be only for about half-an-hour once a week.

After the Ms. is made ready for the press, I shall require about a fornight to write out the Introduction. This may be done usefully even after the printing of the text is complete, which will be roughly two years or a little more from now. This fortnignt's writing will be the only continuous work required from me. That will be done only a a considerable time hence. And even that can be done without detriment to my office work,

I have given the information as fully as possible so that Government may have all the details needed and have no occasion to ask further questions before disposing of this matter.'etc.,

★ ★ ★

From V. Prabhakara Sastri
24-2-1932.

To

Dy. Director of Public Instruction
Madras.

"... In a letter sent last November to the Curator, Government Oriental Mss. Library, I had stated that a competent scholar employed by the Andhra University is doing the preliminary work, and that the editorial work involved just now would require about one hour every week, till the preparation of the press copy. This will take about a year. After that period an Introduction will have to be written, requiring about a fortnight's whole time work ; this work however, can be suitably spread out over a longer period so as not to interfere with my legitimate duties. I have nothing to add now to this information already supplied to the Curator, 'etc.,

★ ★ ★

ఇది పశ్చాద్భూమిగా 24-3-39 నాటికి అనుమతి ఉత్తరువులు జారీ అయినవి. పరిష్కరణ కార్యం వేగాన్ని పుంజుకొంది. ఆ తర్వాత శాస్త్రిగారు మద్రాసులో ఉద్యోగం నుండి విరమించడం, దేవస్థానంవారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని తిరుపతి చేరుకోవడం జరిగింది. సుబ్బరామయ్యగారు మద్రాసులో, శాస్త్రిగారు తిరుపతిలో, రంగనాథరామాయణం అచ్చుపని రాజమండ్రిలో, వ్యవహార నిర్వహణ కేంద్రం వాల్తేరులో ఇలా సాగింది పరిష్కరణ కార్యం ఒక దశలో. ఆ తరువాత జరిగిన సంగతులేమిటో శంకరశాస్త్రిగారి వ్యాసము (మ.మ.'82 ఆగస్టుసం॥ పు 182)కట్టమంచి వారికీ వేటూరి వారికీ నడుమ జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు; రంగనాథరామాయణంమీద శాస్త్రిగారు వ్రాసియుంచుకొన్న నోట్సులోని భాగాలు; రాళ్ళపల్లివారి విమర్శ వెలువడ్డ తర్వాత వేటూరివారు అక్షరబద్ధ మొనర్చిన అభిప్రాయాలు వాటికవే విశదీకరించగలవు అవి వేరే వ్యాఖ్యనపేక్షించవు. ఈ పూర్వాపరాల నడుమ చారిత్రక దృష్టితో వాటినొక క్రమంలో పొందుపరిస్తే చాలును,

1. తిరుపతి నుండి శాస్త్రిగారు 11-9-1941 న విశ్వకళాపరిషత్తునకు వ్రాసిన లేఖ యిది.

'...I am in receipt of your letter asking me to send my "Introduction" to the book. For the past three months I have been in bed, I have not been attending to the college work also, I am now on sick leave. I regret to say that I will not be able to sit up and write the Introduction until a month more to come. In this connection, I may also state that I will have no objection to V. C. writing the introduction as he originally planned. Further I will write the Editor's Prefaec. I am now very weak and unless I recover completely I will not be able to do any thing. That will be only a month or 6 weeks hence. I am very sorry that I am unable to write down and send the Introduction to you as soon as the printing of the text is finished.' etc.

★ ★ ★

వాల్తేరు నుండి C.R. రెడ్డిగారు శాస్త్రిగారికి వ్రాసిన లేఖలివి.

Waltair
28-9-1941

My dear Prabhakara Sastri,

Very sorry you are ill, on account of which I am told you want me to write the preface.

It is unnecessary to have both a preface and an introduction. Enough if there is one. In the introduction that I shall write, I shall make necessary references to you.

Please let me have some facts about your connection with this scheme and also an account of the life of Gona Budha Reddy, on which you are an authority. It is enough if you send me the bare notes either in your own hand or taken to your dictation, say within two or three days.

The Press is worrying us on account of our delays and started asking for revised terms for the paper.

Please let me have some brief notes on the textual improvements made in the present edition. I shall write the introduction in two parts, one based on the information supplied by you-and it will be practically your own-and the other the literary criticism, which will be mine mainly. Though if you send me your notes, I shall incorporate them giving credit of course to you.

Please treat this as most urgent.

Hope you will soon improve in health.

Yours Sincerely,
C. R. Reddy.

★ ★ ★

Waltair
7-10-1941

My dear friend,

Many thanks for sending me your notes for the Preface of Ranganatha Ramayanamu.

Till two days ago no fair copy of the book was sent to me ; and now that I have seen it, I must really congratulate you on the sumptuous and scholarly edition you have prepared. I shall try to hurry through the Preface, though I am hard pressed for time from every direction.

With best regards,

Yours sincerely,
C. R. Reddy (Sd/-)

★ ★ ★

Waltair
11-11-1941

My dear friend,

I would like to be enlightened on the following points as urgently as possible since it is required for purposes of my Preface to Ranganatha Ramayanamu.

What is the principle on which you have formed the main text and that on which you have relegated passages which appear in previous printed volumes to an Appendix, as also many passages which appear in the Manuscripts but which did not appear in the previous printed volume? For example, the episode of Sulochana in the Yuddakanda, which has appeared in previous printed volumes, is now relegated to the first Appendix. Other verses of Sulochana story which did not appear before are to be found in Appendix No. 2. I would like to Know the principles on which these judgements were made. Excuse trouble.

Yours very sincerely,
Sd/-
C. R. Reddy.

Waltair,
12-11-1941.

My dear friend,

Sub : Ranganatha Ramayanamu,

I forgot to add yesterday the omission, both from the text and from Appendix No. 1, of Ramalinga Pratishta in Rameshwaram, which appears in the old printed versions, at any rate, in the versions which I read as a youth and read about a dozen years ago once again at Chittoor. Please let me know the reason for this ; or if I am wrong in the very statement of the fact since I have not gone very closely through your fine edition.

I must say something on the principles which actuated you in your three-fold classification of the Main text, Appendix No. 1 and Appendix No. 2, or in other words, the principles of inclusion and exclusion that guided your judgement.

Please treat this as urgent.

With best regards, 'etc.,

★ ★ ★

తిరుపతి

19-11-41

ఆర్య! వందనములు

నేను మద్రాసు వెళ్ళి అక్కడ శ్రీ సుబ్బరామయ్య గారితో విచారించి యీక్రింది సందర్భములు మీ జబులను గూర్చి వ్రాయుచున్నాను.

I వ్రాత ప్రతులలో పెక్కింట ఉండుట; II రచన బాగుగా నుండుట; III సంస్కృత భాస్కర రామాయణముల తోడి సంగతి;- మూడు సాధవములబట్టి ప్రధాన పాఠములు గ్రహింపబడినవి.

1) సులోచన కథ:- తాళ పత్ర ప్రతులన్నింటి భిన్నభిన్న విధములతో నున్నది. ఇప్పుడు ప్రధాన పాఠముగా కయికొన్నది అధిక ప్రతులతో సంవాదము గలది, కొంత మంచి రచన గలది గాన - పూర్వముద్రణమున నున్నది ఇక్కడి వ్రాత ప్రతులలో లేదు రచనలో భాషా లక్షణాదికము పూర్వోత్తర రచనలలో సరిపోలనిది.

2) రామలింగ ప్రతిష్ఠ :- ఇది గ్రంథము సాపు వ్రాసేటప్పుడు శ్రీ సుబ్బరామయ్యగారు నోటు వ్రాసిరి. మూలములో లేనిది. కొన్ని వ్రాత ప్రతులలో భిన్న పాఠములతో నున్నది. అమూలకముగాన ప్రక్షిప్తముగా వేయదగినది అని. దాని రచన పుర్వోత్తర రచనలతో సరిపడుచునే ఉన్నది గాని ప్రక్షిప్త మనదగి నట్లు లేదు. అమూలకములు (సంస్కృత గ్రంథమున లేనివి) ఎన్నో కథా భాగములు మన రంగనాథ రామాయణమున నిప్పుడు చేరియేయున్నవి కాన యీ భాగము అమూలకము అన్న కారణమున పరిత్యజింప గూడదు. కొన్ని పరిత్యజించినను అది I అనుబంధమున జేరవలసినదే కాని, ఇప్పుడున్నట్లు II అనుబంధమున ఉండ గూడదు. మీ యాక్షేపము సరియయినది. అనారోగ్యాది కారణములచే యుద్ధ కాండ తుదిపట్టు ముద్రణ భారము నేను ఇతరుల మీద విడనాడితినని నేనిప్పుడు తప్పి కొనుట తప్పుకాన తత్ప్రాయశ్చిత్తము నేను పొందుచున్నాను. ఇట్లు చేయుదును

1. రామలింగ ప్రతిష్ఠ కథా భాగము మూలముతో చేర్చి మరల ఆ భాగము ముద్రింతును. దాని వ్యయము నేను భరింతును.

2. దానిని రెండవ అనుబంధము నుండి తొలగింతును. ఆ అనుబంధ ముద్రణ భాగపు మార్పు వ్యయమును కూడ నేను భరింతును. ఈ విధముగా గ్రంథ ముద్రణపు మార్పు వెంటనే చేయవలసినదిగా మీ సమ్మతి రాగానే శ్రీ సుబ్బరామయ్యగారికి వ్రాసి యట్లు చేయింతును.

[ఈ లేఖాంశము శ్రీ కట్టమంచి వారి లేఖకు సమాధానముగా శ్రీశాస్త్రిగారు వ్రాసిన దానికి ఉంచుకొన్న నకలు - సం॥]

  

1. ఎ) ఓరియంటల్ లైబ్రరిలో ఉండు రంగనాథ రామాయణం తాటాకు ప్రతులలో సమగ్రము లయినవి లేవనవలెను. ఒకటి రెండున్నను, అవి ఆదిమధ్యాంతములందు చాలభాగము శిథిలము లయినవే. అన్నింటిలోను వ్రాత తప్పులు దండిగ నున్నవి. అసమగ్ర ప్రతులలో కొన్ని రెండు కాండలు కలవి. కొన్ని ఒక కాండ మాత్రమ కలవి. కొన్ని మూడు కాండలు గలవి. కొన్ని తొలి అయిదు కాండలు కలవి. యుద్ధకాండము మాత్రము గలవి రెండున్నవి. వాని యందును నడుమనడుమ, ఆకులు శిథిలములయినవి. కొన్ని జారి పోయినవి.

బి) ఆ లైబ్రరిలోనే రెండు కాగితపు వ్రాతప్రతులున్నవి.

1. అక్కడనున్న తాటాకు ప్రతుల ననుసరించి, బ్రౌనుదొరగారు తయారు చేయించిన సమగ్ర ప్రతి. దానిలో తాటాకు ప్రతులలోని పాఠాంతరములు, అధిక భాగములు, న్యూన భాగములు, ప్రక్షిప్త భాగములు, బంతులనడుమను ఎదుటి పుటలలోను ఎక్కింపబడినవి.

2. పై ప్రతినిబట్టి బ్రౌనుదొరగారు పండితులచే పరిష్కరింపించి తయారుచేయించిన శుద్ధప్రతి.

ఈ ప్రతిలో పరిష్కర్తలకు యుక్తమని తోచిన పాఠము గ్రహింపబడినది. తక్కినవి త్యజింపబడినవి

2. ఎ) ఆంధ్ర యూనివర్సిటి వారు తొలుదొలుత పంపిన తాటాకు ప్రతి ఒకటి. చివర కొన్ని ఆకులు తప్ప తక్కిన గ్రంథమంతయుగలదు. ఇందు పాఠాంతరములు అధిక పాఠములు, ప్రక్షిప్త భాగములు చాల కలవు.

బి) ప్రకృత గ్రంథపు ప్రతి అచ్చుకు తయారయిన తరువాత పంపిన తాటాకు ప్రతి యొకటి. దాని ఆకులన్నియు నిలువున సగమునకు పైగా తినివేయబడినవి ఇది నిరుపయోగమనియే అనదగును.

3. అచ్చుపుస్తకము-ఓరియంటల్ లైబ్రరిలోనున్న మంచి తాటాకు ప్రతులతో సరిచూడబడినది. పాఠాంతరములు, అధిక పాఠములు ప్రక్షిప్త భాగములు సేకరింపబడినవి.

ఆంధ్ర యూనివర్సిటి వారు తొలుత పంపిన ప్రతితోను సరిచూడబడినది. అందలి పాఠాంతరాదులును సేకరింపబడినవి.

4. తంజావూరు లైబ్రరిలోని తాటాకు ప్రతులు మూడింటితో బాలకాండ మాత్రము సరిచూడబడినది. విశేషము లెందునను లభింపకపోవుటచేత నా పని తరువాతి కాండలకు మానుకొనబడినది.

5. మొత్తము మీద

బాలకాండ 8 తాటాకు ప్రతులతోను
అయోధ్యకాండ 5 తాటాకు ప్రతులతోను
అరణ్య కిష్కింధ సుందరకాండలు 3 తాటాకు ప్రతులతో
యుద్ధకాండ రెండు తాటాకు ప్రతులతోను

సరిచూడబడినవి. ఈ ప్రతులలో నే యొక్క రెండిటిలోనైనగాని గ్రంథము సరిగా ఒక్క తీరున నడవలేదు. అచ్చుదానిలోలేని పాఠాంతరాదులు వీనిలో ననేకము లుండినవి. అచ్చుదానిలోనుండు పాఠములు వీనిలో లేకుండినవి. (చూ. అనుబంధములు) ఇట్లు సరిచూచుటచే లభించిన పాఠాంతరాది సామగ్రిని, బ్రౌను దొరవారు తయారుచేయించిన రెండు కాగితపు ప్రతులను పరిశీలించి ప్రకృత గ్రంథము అచ్చుకు తయారు చేయబడినది. పెక్కు వ్రాత ప్రతులలోను, అచ్చు పుస్తకములోను ఇంచుమించు ఏకరూపమున నున్న పాఠము ప్రధానముగ గ్రహింపబడినది. అన్యము అప్రధానము. అందు ఇంచుక అర్థము గలది ఆ యా పుటల అడుగున కూర్చబడినది.

ప్రక్షిప్త భాగములు, కొన్ని అధిక న్యూన భాగములు అనుబంధములుగ గ్రంథము చివర చేర్చబడినవి. (అనుబంధముల ప్రారంభమున చూడదగును.)

[ ఇవి గ్రంథ ముద్రణ విషయమున పరిష్కర్తలు ప్రతులను పరిశీలించి గుర్తించిన అంశములు; ఏర్పరచుకొనిన నియమములు. ]

* * *

వైష్ణవ సంప్రదాయములు;- భాస్కర రామాయణపు పోలికలు;- సంస్కృత రామాయణమున లేని విషయము-ఆనంద రామాయణాదులలో నుండి, కొన్ని లోక కథలలో నుండి; - కంబ రామాయణ సంబంధము; - రంగనాథ రంగనాథోత్తర రామాయణ రచనములు సమరీతినే ఉన్నవి; - బూదపూరు బుద్ధారెడ్డి కాడనుకొంటాను;- ఈతడు ప్రతాపరుద్రుని సమకాలము వాఁడను ప్రతీతి విలువగలదై యుండవచ్చును; - రంగనాథుడు చక్రపాణి రంగనయేని కావచ్చును; - కోనబుద్ధ బుద్ధ భూవిభుఁ డని కలదు గాని అది 'గోన'

అనియే యుండఁదగును: - రామాయణమున బుద్ధభూవిభుఁడు 'రెడ్డి' యనుటకు సాధనములు గానరావు;-శూద్రుఁడనుటకును సాధనములు లేవు;-గ్రంథకర్త విశిష్టాద్వైత సంప్రదాయమువాఁడగుట పెక్కుచోట్ల గాననగును; - లక్షణ గ్రంథో దాహృతము; - కాండాదిని కృతిపతిని సంబోధించు సంప్రదాయమందు గానరాదు; - ద్విపదలో ప్రాసయతిఎక్కడా లేదు.

[రం.రా॥కు సంబంధించిన శాస్త్రిగారినోట్సు నుండి గ్రహించినది —సం॥]

* * *

నాలుగు ముక్కలే వ్రాయగోరిక. రంగనాథరామాయణ విమర్శమున రా॥ అనంతకృష్ణశర్మగారు ప్రసక్తులగుటచేతనే యిప్పుడిట్లు నేను వ్రాయబూనుట. నాతోపనిచేసిన శ్రీ సుబ్బరామయ్యగారి పరిశ్రమను వారుగ్గడించినారు. ఇట నా వక్తవ్యమించుక; ద్విపద రామాయణ సంస్కరణమున యత్కించిత్తు ఆదినుండి కూలిడబ్బు పడసినవారు సుబ్బరామయ్యగారు. వారు పడిన పరిశ్రమ అత్యధికము. అక్రమవ్యూహాదివిడుల తీర్పునుబట్టి చూడగా వారికూలిడబ్బు నిజముగా అత్యల్పము. ఓరియంటల్ లైబ్రరీలోని ప్రతులనెల్ల పరిశీలించి, పాఠభేదముల సేకరించి, అందు మేలురముల నేరి గ్రంథమును తయారు చేసినవారు ప్రధానముగా వారే. అట్లువారు సేకరించిన సామగ్రిని నేను ముద్రణావసరమున జాగ్రత్తగాఁ జక్కఁజూచుచుఁ బైపయి సవరణలు నిర్వహించుచు వచ్చితిని. గ్రంథముద్రణము జరుగుచుండు కాలమున నేను తిరుపతి రావలసియుండుటచే, అక్కడ నాకార్యాంతరమున కిది యడ్డంకి కాకుండుటకై యూనివర్సిటీవారు కొంత ముద్రణమయిన పిదప శ్రీ K. జోగయ్యశర్మగారిని నాకడకంపిరి. ముద్రణమున నాకు వారుకొంత తోడ్పడిరి. ఇందు ప్రధానపరిశ్రమ శ్రీ సుబ్బరామయ్యగారిదే. ఏతద్గ్రంథ ప్రకటనమున బరువుమోసిన సుబ్బరామయ్యగారి పేరును శ్రీ శర్మగారు వెలికి దెచ్చిరి. శ్రీశర్మగారిందు ప్రసక్తులుగానిచో నేనొకయక్షరమేని దీని గూర్చి వ్రాయఁబూనను గాన నాచేవారి పేరు తెలియబడదు.

శ్రీ శర్మగారు వ్రాసిన మూడవపేరా తుదివాక్యములు నా యనారోగ్యమును గూర్చి. గ్రంథముద్రణ ముగిసిన కాలమున నేను గొన్నాళ్ళు అనారోగ్యముగా నుంటిని. అయినను, తత్ప్రసక్తముగా పీఠికాగ్రంథమునుగొంత పడుకమీద నుండియే శ్రీరెడ్డిగారి కోరికపై వ్రాసిపంపితిని దాని ప్రత్యంతరము నాదగ్గఱలేదు. [7-10-1941 CRR to VPS.] అదివారు ప్రకటింపనులేదు. నాకు బంపనులేదు. ఇప్పుడు వారికి జాబు వ్రాయుచున్నాను త్రిప్పిపంపగోరి. పంపినచో దానిని ముగించి ప్రకటింపగలనేమో! ఇక నాకు శాశ్వతానారోగ్యమేదీలేదు. ఇప్పటినావయసున (55ఏండ్లు) ఉండదగిన యారోగ్యముతోనే నేఁ ప్పుడున్నాను.

ఇందుపయోగించినవి-ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో ప్రౌనుదొర సేకరించిన వ్రాఁత ప్రతులన్నియు;వారి పండితులు సేకరించిన పాఠములన్నియు; మఱియు, ఆంధ్ర యూనివర్సిటీవారు గ్రంథ పరిష్కరణారంభమున నొకతాటియాకు ప్రతిని పంపిరి. అది నైజామాంధ్రదేశపుది. శిథిలము. చాలప్రాఁతప్రతి. ముద్రణ జరుగుచుండగా నింకొక ప్రాచీనప్రతిని పంపిరి. తొలి ప్రతిని సమగ్రముగాను, రెండవప్రతిని ఎడనెడను (ముద్రణము జరుగుచుండగా వచ్చినది గాన) నుపయోగించుకొంటిమి. వారు పంపిన రెండవ తాటాకు ప్రతి పాఠములు చాలచోట్ల నీరసములు. అది మాకు లభించుటకుఁ బూర్వమే ముద్రితమయిన గ్రంథమునందలి పాఠములు చేర్పవీలుకాలేదు. అవి యెంత నీరసములో మాదిరి చూపుచున్నాను. [ఈ పట్టున అవి గుర్తింపబడలేదు, కాని పీఠికవ్రాసే ఉద్దేశ్యంతోపాఠాంతరాల్ని, రచనా విశేషాల్ని గుర్తించుకొన్న పద్ధెనిమిది పుటలనోట్సు శాస్త్రిగరువ్రాసుకొన్నదివిడిగా వున్నది]

ఒకటి రెండు ద్విపదములలోని పాఠభేదములు క్రిందచిన్నయచ్చులోఁజూపితిమి. చిన్నిచిన్ని యధికపాఠ భాగములుకూడ క్రిందఁజూపితిమి. కొన్ని ప్రతులలోనే కలవి మూలమునఁజేరఁదగినవనుకొన్నవి కుండలీకరణమున మూలమున జూపితిమి. ఈ పద్ధతి యెక్కడనేని తప్పియుండవచ్చును. గ్రంథముద్రణము రాజమండ్రిలో; సుబ్బరామయ్యగారు మద్రాసులో; నేను తిరుపతిలో. ప్రతిదినము ప్రూఫు మద్రాసు, ఆక్కడనుండి తిరుపతి సంతతముగా వచ్చుచుండుట, ఏనాటి దానాడు పంపవలసియుండుట, మేమొకచోటనుండి సరిదిద్దుకొన వీలులేకుండుట, మేమున్నచోట (మద్రాసులో) ముద్రణము సాగింపగోరినను అధికారులంగీకరింపకుండుట మొదలగు కారణములచే రాత్రి ఇంటికి వచ్చి 12 గంటల దాక ప్రూఫులుదిద్దుచు నేను పడిన పాట్లు భగవంతున కెరుక ! ఇందెన్నియేని తప్పులు దొరలి యుండవచ్చును. అయినను నా సర్వశక్తులను ధారవోసికొని ఇందు పరిశ్రమించితిని. ఏఫలమునర్థించి నేనిందు ప్రవర్తించితినో దానిని భగవంతుడెరుగును.

[ఇది రంగనాథరామాయణమునకు సంబంధించిన శాస్త్రిగారి నోట్సుకాగితాల నుండి గ్రహించినది-సం॥]

* * *

తుదకు పీఠికా సత్కారములు నాకు దక్కినవి!!

'పాఠములన్నియు, క్రింది పాఠాంతరములకన్న సరసములని చెప్పలేము' అనిశర్మగారు! నిజమే. శక్యమయినంత వఱకు, మేల్తరముల నేర్చి మీఁద జేర్చితిమి. ప్రమాదము లెన్నో! శ్రీ శర్మగారొక దానిని జూపిరి!

ద్విపద రామాయణపు పూర్వపూర్వతరముద్రణములందు నేను ప్రధానములుగాఁ జూపిన పాఠమే కలదు. క్రొత్తగాదొరకినదాని పాఠాంతరముగాఁ క్రింద నుంచితిమి. రాచవిభుల కర్ణాభరణములు 'మద్దికాయ'లెట్టివో యిప్పటికి నేనెఱుగను. 'మద్దికాయలు' బాలకులేతాల్చునవి యగుట మాత్రమే నేను గుర్తించినది. అందు ముత్యాలుండుట వానితోఁ బ్రాగెంపు లుండుటఁ వగైరాలు నేనెఱుఁగను. రాజుల కర్ణములందు వజ్రములు ముత్తెములు గలయ గూర్చిన కుండలము లుండుట చాళుక్యసోమేశ్వరుని యభిలషితార్థ చింతామణిలోఁ జూచితిని. దాని శ్రీ శర్మగారును చూడగలరు. ఉదాహరింపనేల ? రెండు పాఠములలో సారస్య వైరస్యముల నిప్పటికిని గ్రుద్ది చెప్పఞాలను అసలు 'మద్దికాయల' (బాలకర్ణాభరణము) నెఱుఁగను గాన!

[రంగనాథ రామాయణమునకు సంబంధించిన శాస్త్రిగారి నోట్సుకాగితాలనుండి గ్రహించినది. -సం॥]

  

చివరగా కట్టమంచి వారు శాస్త్రిగారికి వ్రాసిన మరొక లేఖ.

WALTAIR,
12th June, 1939.

C. R. Reddy, Hon. D. Litt.
Vice-chancellor.

My dear friend,

I have accepted the Presidentship of the Telugu Section of the Oriental Conference to be held in Hyderabad next December. And since accepting, I have been wondering whether I can discharge the responsibility creditably.

I have been thinking of some themes and a new idea has struck me, on which I would like to invite the opinions of authoritative scholars like you. And that is- the connection between Telugu Life and Literature, historically treated.

I would like to know what you think of this subject and whether you will enrich my poor stock of ideas by your own observations.

More especially in regard to contemporary Telugu literature with which you are so thoroughly conversant, I would like you to give me a classification under different heads and show how the different books are firstly a a representation of life and manners as they are, and secondly, afford a key to our future ambitions, religious, social and political and finally how a large number of them are only translations and adaptations, which reflect either the light of our ancient past are the mere artificial light of Western countries and Bengal.

In this connection, the plays of Yakshaganams and other village dramas and ballads like Bobbili and Balanagamma and the immortal Palnati-Viracharitra should be considered in addition to Kreedabhiramam, the classical book on life in Warangal.

I have given you a rough sketch of the theme. You can fill in and fill up as you please and send me whatever matter you can muster.

Please excuse trouble.

Yours sincerely,

Sd/—

C. R. Reddy

P. S. Could you kindly give me a short synopsis of the contributions to Religion and Philosohy of the Andhras whether in the Sanskrit or the Telugu languages or to social reform amongst the Hindus ?

Veturi Prabhakara Sastri Garu
Oriental Mss. Library
Egmore MADRAS.

* *

దీనికి సమాధానంగా శాస్త్రిగారు అనేక విషయాలను సమకూర్చి ఒక పెద్ద కట్టను కట్టమంచివారికి అందించారు. దానిని వారు కృతజ్ఞతతో అందుకున్నారు. కాని కారణాంతరములవల్ల అప్పుడు వారాసభలకు హాజరు కాలేకపోయారు. తరువాత ఆ విషయాన్ని ఉపయోగానికి తెచ్చినట్లూ కనపడదు శాస్త్రిగారికి త్రిప్పి పంపనూలేదు. ఆ కాగితాలేమైనవో. అవే వచ్చి వుంటే బహుశః శాస్త్రిగారు వాటిని ప్రతాపరెడ్డిగారికి పంపి, వారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'ను పెంపు చేసి పునర్ముద్రించే విషయంలో తోడ్పడుదామని తలచినట్లున్నారు ఈ క్రింది లేఖ ఆ విషయాన్ని స్ఫురింపజేస్తున్నది.

* * *

తిరుపతి

28-11-1949

మీ గ్రంథము - ఆంధ్రుల సాంఘికచరిత్ర- చాల ముచ్చట గొల్పినది. మీరీ గ్రంథము రచించుటకు ఎల్లతెలుగులను సమర్థులు. ఆదినుండి తుదిదాకా ఒకతూరి స్థూల దృష్టితో చదివి యిది వ్రాస్తున్నాను... చదివినంతలో మీరు ప్రామాణికులైన సత్యరతులైన పవిత్రహృదయులని గుర్తించినాను. నేను మీరీ గ్రంథమును నాల్గయిదు రెట్లు విషయ విశేషములతో ప్రపంచించి పునర్ముద్రణము చేయుటకు తోడ్పడ కుతూహల పడుచున్నాను.

వేటూరి ప్రభాకరశాస్త్రి



# నాటక కళ

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[తమ 'కళ' పత్రిక మూలంగా నాటక కళకు వేటూరివా రిచ్చిన చేయూతను గూర్చి పాకల వేంకట రాజమన్నారుగారు వ్రాసిన వ్యాసం ఈ సంచికలోనే అచ్చుపడింది. నాటకకళను గూర్చి శాస్త్రిగారు వ్రాసిన ఈ వ్యాసం 'కళ' రుధిరోద్గారి (1924) మార్గశిరములో సంపు. 2 - సంచిక 4లో ప్రకటింపబడినది. దాన్ని ఇక్కడ పునర్ముద్రిస్తున్నాము. సం॥]

శ్రీమైలవరము బాలభారతీ నాటక సంఘమువారు మదరాసుకు విచ్చేసి చేసిన నాటక ప్రయోగములను గొన్నింటిని జూచితిని. నాటకకళాభ్యుదయార్థినై యా నాటకముల రచనమును గూర్చియు నటులను గూర్చియుఁ గొన్నిమార్పులను గూర్చియు నించుక ప్రశంసించెదను.

## నాటక కృతులు

మూఁడు నాలుగు గంటలకు మించని కాలమునఁ బ్రయోగింప దగినవై భావభరితములై సముచిత కథా సంవిధానమును, ఉక్తిప్రత్యుక్తి చాతుర్యమును, ఉపక్రమ నిర్వాహనైపుణ్యమును, ప్రసన్నరచనమును, గలిగి యొప్పెడు నాటకములు, సహృదయరంజకము లగును. అనన్వితకథావస్తువును, పారసీ మట్లపాటలును, అస్థాన పద్యములును అప్రసక్తవర్ణనములును గలిగి కథాంశమునకుఁ బోషకము గాక యెక్కడి కక్కడికే విడి విడియైపోవు పాత్ర ప్రవేశ సంభాషణాదికము గలిగి పాత్రస్వభావోన్మీలనము లేక కలగవులగమై యుండునాటకములు సహృదయములను విసిగించును. అట్టినాటకములు సమర్థులగు నటుల ప్రయోగ చాతురిని గూడ భగ్నపఱుచునవిగా నుండును. పయిసమాజమువారు మదరాసులోఁ బ్రయోగించిన నాటకములలో నిట్టిదోషములకుఁ బాల్పడనివని చెప్పదగిన వానిలో శ్రీ పానుగంటి నరసింహారావు పంతులుగారు రచియించిన రాధాకృష్ణ పాదుకా పట్టాభిషేక నాటకములు ప్రధానములు. శ్రీ కృష్ణతులాభారము, చిత్రనళీయము హరిశ్చంద్రీయ మను నవి కూడఁ బ్రశంసార్హములే,

## ప్రహ్లాద నాటకము

ఇందువస్తువిన్యాసమందు చాతురిలేదు. అంకకల్పనమందు నేర్పులేదు. పారసీమట్ల పాటలున్నవి. ప్రహ్లాదుఁడు భగవద్ధ్యానము చేయునప్పుడుకూడ నట్టి పాటలుంచుట తెనుగును వికృతపఱచినట్టున్నది. భక్తి స్ఫూర్తికలుగలేదు. భాగవతమందలి పద్యములే మఱి నాల్గుచేర్చిన బాగుగానుండెడిది. ప్రహ్లాదుని హిరణ్యకశిపుఁడు శిక్షించునప్పుడు రంగమున లీలావతికూడ

నుండునుగాని, ఆమెకుఁదగినంత వాగ్వ్యాపారము లేకుండుట యరుచిని గూర్చెను.

## సారంగధర

ఈనాటకము జుగుప్సావహముగానున్నది. అందును చిత్రాంగి సారంగధర సమావేశముపట్టు మిక్కిలి రోఁతగానున్నది. కవియిందుఁ జిత్రాంగిని పాపమునకు దుష్కీర్తికి నేమాత్రమును జంకని పశ్చాత్తాపములేని మహాకాముకినిగాఁగల్పించెను. ఆమె సారంగధరుని వలచును. అతఁడు తన దగ్గఱకు వచ్చినపుడు తన దుర్వాంఛను గర్భితముగా పలుపలుకులలోఁదెలుపును. పరమపవిత్రుఁడగు సారంగధరుఁడు వానిని దెలిసికొనలేఁడు. వికృతిచెందలేఁడు. కామవికారము మీఱఁగాఁ జిత్రాంగి తనపాడుకోరికను స్పష్టముగా నాతనికిం దెలుపును. సచ్చరిత్రుఁడగు సారంగధరుఁడింతటితో నక్కడనుండి హరహరాయనుచు లేచిపోవలసినదే! కాని యటుతర్వాతఁగూడఁ దడవుకాల మక్కడ నాఱంకులాఁడి వంకరచేతల కగ్గ మగుచు నుండరాదు. చిత్రాంగి తన పట్టునువిడువక వెంబడించుట, మ్రొక్కుట, పయిఁపడిబట్టలు లాగుట, మొదలగు రోఁత పనులు చేయుటయు సారంగధరుడు ఇటువచ్చిననటు నటువచ్చిన నిటు తప్పించుకొని తిరుగుటయు,నేమేమో మాటాడుటయు, మిక్కిలి జుగుప్సితమయ్యెను. చెన్నపురి రసికులుకొందఱీయసభ్యాంశమును పయి సమాజమువారిచే నొకతూరి "చౌచౌ"లోఁ గూడఁ బ్రయోగింపఁజేసిరట! ఇస్సీ!

## ద్రౌపదీవస్త్రాపహరణము

ఇది యేదోయల్పుల పోరాటమనిపించినది గాని పాండవులకథగాఁగానరాలేదు. డాబుడీబు సమాసములు, అర్థములేని వర్ణనలు, తప్పువాక్యములు, దీనిలో శ్రుతికఠోరములుగా వినవచ్చెను. "పాదాహతంరజోత్థాయి మూర్ధానమధిరోహతి" అట! మాఘకవి గౌరవము తీఱెనుగదా! ద్రౌపదీశరణాగతి పట్టుననేని సద్రచనము కానరాలేదు.

## కృష్ణలీల

ఇందు గొల్లలహాస్యములు జాతీయములు ఔచితి తప్పక హృద్యముగా నున్నవి. ఇందలి గుణమిదియే.

## సావిత్రి

ఇది బాలభారతీనాటక సంఘము వారి ప్రఖ్యాతికిఁ గారణమయిన ప్రధాన నాటకమట! కవితారచనమందట్టి ప్రాధాన్యము కానరాదు. ప్రథమాంకమందు అప్రసక్తమును అప్రౌఢమునునగు శృంగారమున్నది అదియును శాకుంతలాదుల నుండి కొని తెచ్చుకొన్నది. పాతివ్రత్యప్రభావముచేఁ బతిప్రాణముల నిలువరించుకొన్న సావిత్రి ఈ నాటకమందు సామాన్యశృంగారిణి వలెఁగానవచ్చినది. జగజ్జ్యోతివలె వెలుగవలసినయామె పాతివ్రత్య ప్రభావమిందుఁ బ్రదర్శితముగాలేదు. సత్యవంతుఁడు సంవత్సరమునకుఁజచ్చిపోవునని నారదుఁడు హఠాత్తుగా వచ్చి బెట్టిదపు మాటను గండశిలవలెఁ బడవేసినపుడు సావిత్రీ మనస్సరస్సెంత యల్లకల్లోలము కావలెనో యెన్ని సంకల్ప వికల్పములు పుట్టవలెనో భర్త్రపాయ భీతికిని పాతివ్రత్య ప్రీతికిని నెంత స్పర్ధ పెరుఁగవలెనో కవి వివరించి దానిపై నాటకరచనను ప్రపంచించి యుండవలసినది. అదిగదా యా నాటకము కథా వస్తువును బెంపొందఁజేయు నాయువుపట్టు! భర్త్రపాయ భయము నడఁగఁద్రొక్కి సావిత్రీ సౌశీల్యము పాతివ్రత్యాభిరతిని బయికి రేఁప వలెను. భర్తృశుశ్రూష, శ్వశురశుశ్రూష మొదలగు పతివ్రతాధర్మము లామె నడివడిలో రంగమునఁబ్రదర్శితములు కావలెను. ఇందట్టిదేమియు కానరాలేదు. నారదుఁడే భర్తృమృతివార్తను జెప్పుటయు నాతఁడే సావిత్రీ మంత్ర ముపదేశించి వరములిచ్చి పోవుటయుఁ గడపట నాతఁడే సావిత్రి తల్లిదండ్రులఁ గొనివచ్చుటయు నిట్లు కార్యభారమెల్ల నారదుని మీఁదనే పెట్టుట హృద్యము కాదు. స్వప్రయత్నముచే ఘన సామర్థ్యము సావిత్రి బడసినట్లుండుట బాగు.

సత్యవంతునికి సప్రయోజకమగు శౌర్యోద్రేకము బెట్టుట నిరర్థకము.

భూలోకమునుండి యమలోకము దాఁక ప్రయాణము రంగమునఁ జూపుట బాగుకాదు. భర్తృవియోగముతఱిని సావిత్రీ దుఃఖ మామె మహోత్తమతకుఁ దగనట్లున్నది. సావిత్రీ పాతివ్రత్యప్రఖ్యాతికిఁ దోడ్పడని కథావిన్యాసమిందుఁదగదు. ప్రథమాంక మెల్ల నందుకుఁ బొందనిదే.

సావిత్రి యమునితో యమలోకమున కరుగునపుడు భర్తృశరీరమునకు రక్షకల్పింపవలెను. మీరు రక్షింపుకని వనదేవతలను సూర్య చంద్రులను బ్రార్థించుటతోఁ జాలదు. ఆమె ప్రార్థనమాదేవతల కవశ్యనిర్వర్త్యమయినట్టామెకు తెలియరావలెను. శక్తికలదిగా సావిత్రి మనకు గోచరింపవలెను. అట్టిదేమియులేదు. ఈ నాటకము ప్రయోగించునపుడు ప్రేక్షకులు పలువురు వత్తురు. సావిత్రి పాత్రముధరించు సంజీవురావుగారి కోకిలగానమును కులుకు బెళుకులును యమపాత్రధరించు నరసింహరావునాయుడుగారి యాకార గాంభీర్యమును ప్రయోగచాతుర్యమును, అడవులు కొండలు యమలోకము మొదలగువానిఁజూపు రంగాలంకారమును దానికి గారణము లనవచ్చును

## నటులు

ఈ నాటక సంఘమున సమర్థులయిన నటులు పలువురున్నారు ఇంత సర్వాంగ సమృద్ధి గలిగిన నాటకసంఘ మింకొకటి యాంధ్రదేశమున లేదేమో! కాని సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్ అన్నట్టు ధీరశాంత ధీరలలిత ధీరోదాత్త లక్షణములుగల యుత్తమ నాయక భూమికను ధరింపఁదగిన నటరత్నమిందు గానరాఁడు. ఇదివఱ కట్టివారొకరుండిరట. ఇప్పుడు లేకుండుట యీ సంఘమున కొత గొప్ప కొఱంతయే.

## సంజీవరావుగారు

ప్రధాన నాయికాభూమికలను వీరుధరింతురు. కులుకులు బెళుకులు కన్నులార్పులు సన్నని కంఠమునను స్త్రీలక్షణములు వీరికి సహజముగఁ గలవు. తీగవారుట, జవాడుట మొదలగు చదురాంధ్ర నేర్పులు వీరికి మెండుగనున్నవి. నతాంగితనమును వీరు చక్కఁగానవదరింపఁగలరు. రంగమందు నిలుచుటలోను నడచుటలోను గొన్ని మేలి మెలపులు వీరికడఁ గలవు.

పయి యసామాన్య స్త్రీస్వభావ సంపదచేఁగల్పితమయిన సమ్మోహపు వలను వీరు సామాజికులపై రంగమునకు రాగానే విసరివేయుదురు. విలాసినీ విభ్రమము లెవ్వరినువ్విళ్ళూరింపవు? వీరి ముఖమందుభావవికారములు బాగుగాఁదాండవింపవు. సౌశీల్య సౌభాగ్యముగల సత్కులాంగనా భూమికలను వీరు ధరింపఁగా నింపుపుట్టదని నా తలంపు. నేను చూచిన వానిలోఁ బాదుకా పట్టాభిషేకతులాభారసారంగధర నాటకములలో వీరినేర్పు సాటిలేని సౌరునించినది. వీరి జగజంతతన మక్కడఁజక్కఁగా సరిపడినది. సారంగధరలో చిత్రాంగియై రాజరాజు ముందర రత్నాంగిని గర్హించునప్పుడును తులాభారమున సత్యయై రుక్మిణిని దుటారించునపుడును, పాదుకలోఁగైకయై యసూయాహతహృదయతను దెలుపు పట్టునను వీరివిన్నాణము నిరుపమానమై నెగడెను. సావిత్రీ నాటకమున వీరిప్రయోగరీతి కొంత యాక్షేపార్హముగా నుండెను. విలాసినీ విభ్రమములనక్కడ వీరడంచుకొనుట బాగు. భర్తృప్రాణాపాయము నెఱిఁగి త్రిరాత్రవ్రతోపవాసకృశయై యరణ్యమునకు భర్తతోననుగమింప ననుజ్ఞకోరుచున్న సావిత్రి ముఖమున శృంగార వికారములు కన్నులార్పులు తగవు. సత్యవంతుని రొమ్ముపైవ్రాలి హారములు చిక్కుదీర్చుట సరికాదు. సావిత్రిముఖమున లోనిచింత కేలకవేయుచున్నట్టు కానరావలెను.

## సుబ్బారావుగారు

వీరు సంజీవరావుగారి కంటెఁ జిన్న వయసువారు. వీరును బ్రధాన నాయికా భూమికలను ధరించుదురు. నేర్పుచే స్త్రీత్వము నభినయింప వలసినదే కాని సహజ

ముగా నట్టి లక్షణములు వీరికి లేవు. వీరు ఒడ్డు పొడుగును గల సుపురుషాకృతి గలవారు. ధీరశాంత ధీరలలిత ధీరోదాత్త నాయక భూమికలను ధరించుటకు వీరు మిక్కిలి తగియుందురు. అట్టి భూమికలను ధరించి మెప్పించిరట కాని నేను చూడలేదు. రాధ, చంద్రమతి, దమయంతి, దేవకి భూమికలను ధరింపఁ జూచితిని. నతాంగితనము వీరి కలవడదు. తుటారములు, మిటారములు ప్రయత్న సాధ్యములు. కాని యుత్తమ సాధ్వీభూమికలను వీరు ధరించినపుడు సామాజికులు జోహారు లొనరింతురు. విశాల నేత్రములు నిండారిన నెమ్మొగము, మృదుమృదంగ ధ్వని గల కంఠము, హార్దమయిన భావమార్దవము వీరి సత్కుల కాంతా స్వభావ ప్రదర్శనమునకుఁ దగిన సంపదను సంపాదించును. చెక్కిళ్ళు, నుదురు, నేత్రములు, ప్రాయపు మిసిమిగలిగి నిండారి ప్రసన్నమై యుండుటచే కోపము, దుఃఖము, సంతోషము, సిగ్గు, మౌగ్ధ్యము మొదలగు భావభేదములు వీరి ముఖమునఁ దాండవించును. ముఖమునందే యిన్ని కళలను వెలయింపఁగల శక్తి వీరి కసాధారణమయినది. కౌటిల్యము లేని సత్కుల కాంతా లక్షణములను సవదరించి వీరు సౌరు నింతురుగాని జగజంతల భూమికలను ధరించుటకుఁ జాలరేమో! అట్టి భూమికల వీరు ధరింపఁగా నేను జూడ లేదు. హరిశ్చంద్రలో హరిశ్చంద్రు నెడబాసి పోవునపుడును కాలకంటకు నింట నూడిగము చేయునపుడును, లోహితాస్యుని చితి ముందు తానుండగ హరిశ్చంద్రుఁడు మంగళ సూత్రము నమ్మి సొమ్మిమ్మన్నపుడు హరిశ్చంద్రుని గుర్తించి పై ప్రాలునపుడును, నలకథలో కన్యాంతఃపురమున నలుడు దౌత్యము నెఱపి తానే నలుఁడనితెలిపినపుడును,సుబ్బారావుగారు ముఖమునందుఁ జూపిన భావావిర్భావమును నేనెన్నడునుమఱవజాలను. రాధాకృష్ణ నాటకమున రాధాభూమికను ధరించి వీరు చూపు కృష్ణైకతానత భక్తి శృంగార పారవశ్యములు నిస్సామాన్య మయినవి. కృష్ణ కృష్ణ యని పాడు నప్పటి పరమానందము సామాజికుల మనస్సు లందు ముద్రితమై నిలువవలసినదే గాని సంజీవిరావువలె వీరు సామాజిక సామాన్యముపై రంగమునకురాగానే వలపు వలను విసరివేయజాలరు. వీరి ప్రయోగనైపుణి కథా వస్తువు నెఱిగినవారు, పాత్ర గుణముల విమర్శింపదగిన వారు, ఔచితీ నిర్వాహము నపేక్షించు వారు చక్కఁగా సంభావింతురు.

## నరసింహారావునాయఁడుగారు

వీరు ధీరోద్ధత నాయకత్వమునకు మిక్కిలి తగియుందురు. ధీరశాంత, ధీరలలిత, ధీరోదాత్త భూమికలకు వీరు తగరు. దశరథుడు, భీముడు, రాజనరేంద్రుడు, యముడు, హిరణ్యకశిపుడుగా వీరు నటింపఁ జూచితిని. యముడుగా వీరు వచ్చినప్పటి రూపమునైపుణి మఱవరానిది. దశరథ, రాజనరేంద్ర భూమికల దాల్చి వీరు నిస్సామాన్యమయిన నేర్పు నెఱపిరి. వీరి ముఖమున భావ వికారములు దీవరముగఁ దాండవించును. కరుణము, వైక్లబ్యము మఱియు నుద్దీప్తముగాఁ గానవచ్చును.

## గోపాలముగారు

ఈయన ప్రధాన నాయక భూమికలకుఁ దగరు. స్వరూపపుష్టి లేదు, కాని యుచితజ్ఞత యీయనకు మిక్కిలి గలదు. తా నేపాత్రముగా నటించుచున్నాడో దాని కేవిధముగా వర్తించుటుచితమో యది గుర్తించి యీయన రంగమున నర్తించును, భావాభినయము వీరికి మెండు. భరత విదుర సుదేవ నక్షత్ర భూమికలను వీరు తాల్పఁగాఁ జూచితిని. సుదేవ విదుర భూమికలు నాకు మిక్కిలి నచ్చినవి. పద్య పఠనమందు వీరు మేలు బంతి. సంగీతమును వీరు చాల సంగ్రహింతురు. అది మెచ్చదగినది.

## జొ. శేషగిరిరావుగారు

శ్రీకృష్ణ సత్యవద్భూమికల వీరు దాల్చిరి. మహా నాయక లక్షణలక్షితమైన సౌరూప్యము వీరికిఁ గలదు.

గొప్ప సంగీతము గలదు. కాని ప్రయోగ పరమార్థమయిన భావాభినయము మిక్కిలి తక్కువ. వీరి యుచ్చారము అద్దుడు కాగితము మీఁద సిరా గీటు గీచినట్లుండును.

## మ. శేషగిరిరావుగారు

నలబాహుక భూమికల వీరు దాల్చిరి. తొలితూరి బాహుకభూమికను వీరు ప్రశస్తతరముగా నిర్వహించిరి. కరుణ విప్రలంభమును బాగుగాఁ గన్పఱిచిరి.

## రామనాథశాస్త్రిగారు

మృదుమధుర స్వరము గల కంఠము, హృద్యమయిన పద్య పఠన చాతురి, సముచితమయిన భావాభినయ శక్తి, వీరికిఁ గలదు. పాదుకలో శ్రీరామ భూమికను దాల్చి వీరు మంచి నేర్పు నెఱపిరి.

## వెంకటరామయ్యగారు

హరిశ్చంద్రీయమున వీరి విశ్వామిత్రత భ్రూకుటులు, గద్దింపులు గలిగి బొంగు కంఠము అబ్బురము గొల్పినది.

## గం. సత్యనారాయణ

రాధాకృష్ణలో సత్యాభూమిక వీరిది మెచ్చదగినది. ఈయన తీరు గడుసరితనము నెఱపుటకుఁ గడు సరిపడును.

## జొ. సత్యనారాయణగారు

విదూషక భూమికలను వీరు వింతగా నిర్వహింతురు. రాధాకృష్ణలోని శారద భూమికను దాల్చి వీరు తన భాషను వాడుకభాషగా మార్చుకొని మిక్కిలి హృద్యతఁ గూర్చిరి. తులాభారాదులందును మంచి నేర్పు నెఱపిరి.

## ఋ. సుబ్బారావు

చిఱునవ్వు చెంగలించు మొగముతో స్త్రీ చేష్టల నీ బాలుఁడు కడునిపుణముగా నెఱపును. రాధాకృష్ణలో నీతని తరళాత్వము మిక్కిలి మెచ్చఁదగినది.

## బాలనటులు

శ్రీకృష్ణలీలలో బాలకృష్ణ భూమికలను దాల్చిన బాలురు ముగ్గురు ముచ్చట గూర్చిరి.

## మఱికొందఱు

కృష్ణలీలలో గొల్లలుగా వచ్చినవారు నలుగురు జాతీయములను జక్కఁగాఁ బలికిరి. అందిర్వురు సునిపుణులు. వారి సంభాషణమును హాస్యభరితమై ముదుకగాక యింపు గూర్చినది. మఱియు అంజయ్య, కు. సుబ్బారావు, మొదలగువారును నాయా భూమికల నుచితరీతిని నిర్వర్తించిరి.

## మార్పులు

ఆంధ్రదేశమునకు నట్టనడిమి నగరమగు బెజవాడలో నీ నాటక సంఘము నెలకొని యున్నది. అసామాన్య చాతుర్యముగల నటులనేకు లిందుఁగలరు. శ్రీ మైలవరము జమీందారుగారు నాటక కళోద్ధరణార్థము బహుధనము వ్యయించుచు నీ సంఘమును బోషించుచున్నారు. ఈ సంఘము చిరస్థాయియై తక్కిన సంఘములకు మేలుబంతియై వెలయ దగును. అందుకుఁ బ్రధానముగాఁ గొన్ని సంస్కరణములు జరుగు టావశ్యకము.

## పారసీమట్లపాటలు

భాషలనుబట్టి సంగీత స్వభావము భేదించును. బ్యాండు సంగీతమునకు తెలుఁగు భాషయును, గన్నడ రాగముల కింగ్లీషు భాషయును, సరిపడవు గదా! పారసీ హిందూస్థానీ భాషల యుచ్చార స్వర ప్రస్తార ములు వేఱు, కర్ణాటకాంధ్ర ద్రావిడ భాషల యుచ్చార స్వర ప్రస్తారములు వేఱు. హిందూస్తానీ సంగీతము కర్ణాటాంధ్ర భాషలకు సరిపడదు. హిందూస్థానీ సంగీతమందు ఒడుదుడుకు గతులు హృద్యములై గొప్ప నేర్పును జూపుచుండదగును గాని యాంధ్ర సాహితికా గతి సరిపడదు. హిందూస్థానీ మట్లలోఁ బెట్టిన తెలుగు భాష వంకర టింకర విరుపులు గలిగి తపెలా దడబిడ మ్రోఁతలతో వికృతముగాఁ గానవచ్చును. సంగీతైక ప్రియులు దానిని ప్రేమింతురేమో కాని సాహితి యందు ప్రీతి గలవారి కది రోఁతగా నుండును. నాటకములు సాహితీ ప్రధానములు. సంగీతము సాహితికి దోడుపడునదిగా నుండవలెనుగాని వికృతి గలిగించునదిగా నుండరాదు. కొందఱు నాటకము లందు సంగీతమే యుండరా దనువా రున్నారు కాని దానిని సంపూర్ణముగాఁ బ్రతిషేధించుట సరికాదని నేను దలంచెదను. నాట్యశాస్త్రకర్త భరతముని సంగీతము కావలెనన్నాఁడు. పౌరాణికైతిహాసిక కథా ఘటితములయిన నాటకము లందు బద్యములు గేయములు నుండఁదగును. కాని యీనాటి కథలతోఁ గల్పితములగుచున్న నాటకము లందు (కన్యాశుల్కాదులు) అవి లేకున్నను గొఱతఁ లేదు.

వైదేశికమై వచ్చిన పారసీమట్ల పాటల సంప్రదాయము నీ సంఘమువారు పరిత్యజింపఁ దగుదురు. అర్థౌచిత్య భంజకముగా బద్యములందు సంగీతమును బాడువా రీసంఘమందెవ్వరును లేరుగాని ఈ పాటలు కొంత వైరస్యమును గల్పించుచున్నవి.

మఱియుఁ జవియు సారము లేని చప్పిడి నాటకములను గూడ వీడుటకు వీరిని గోరుచున్నాను. శ్రీ మైలవరము జమీందారుగారు నాటకకళోద్ధరణార్థము కంకణము కట్టుకొని రత్నములనఁదగిన నటులను జేర్చిరి. తదనుగుణముగా రసోత్తరములైన నాటకములనే ప్రయోగింపఁజేయుట బాగు. మరియును ఉత్తర రామచరిత్రము, శాకుంతలము, ముద్రారాక్షసము, మృచ్ఛకటికము, నాగానందము, ప్రియదర్శిక మొదలగు ప్రాచీన రూపకములను గూడఁ బ్రయోగింపజేసినచో నాంధ్రదేశము నాటకకళయం దద్భుత చాతుర్యముగలదను ప్రతిష్ఠ భారతదేశ మందెల్ల బ్రఖ్యాతము కాఁగలదని నా తలంపు. ప్రాజ్ఞులు నలుగురు బాగుగా నున్నవన్న నాటకములనే (యీనాటి వానిలో) ప్రయోగించుట యుక్తము. రసవంతములయిన నాటకములాడుటలో రసికులయిన నటులకును నుత్సాహము పెంపొందును. కవిత, గానము, శిల్పము, చిత్రరచన, అభినయము, మొదలగు లలితకళలు సద్విమర్శముతో సాగుచుండు చోట భగవద్విలాసములు పరిజ్ఞాతములగుచుండును. అట్టి భాగ్య మిపు డాంధ్ర దేశమునకు బట్టుచున్నది. పరితోష విషయముగదా!

బహుధనము వ్యయపరచి నాటకకళ నుద్ధరించుచున్న శ్రీమైలవరము జమీందారుగారు సూరానేని పాపయ్యరావు బహద్దురు గారికిని బాలభారతీ సమాజము వారికిని పరమేశ్వరుఁడు సర్వసౌఖ్యములను సమకూర్చుగాక! ఆంధ్రదేశమందు నాటక కళ అభివృద్ధి నందుగాత.



# కూర్మాష్టకము

—వేటూరి ప్రభాకరశాస్త్రి



శ్రీ లక్ష్మీ రమణీ మనోహరకరా సీమంతినీ కామినీ
యీలాగిప్పుడు తల్పు వేయఁదగునా యీ వేళ లక్ష్మీ సతీ !
మేలా యర్ధపురాత్రివేళ ధరలో మీరిందు రాఁ జెల్లునా
స్త్రీల న్నెచ్చట నుంచివచ్చితివిరా శ్రీ కూర్మరాయాధిపా !

లలనా ! స్త్రీలను జూచుటే యెఱుఁగనే లావణ్య బింబాధరీ
యిలలో భక్తులఁజూడ నే నరిగితి న్నీ వేళ లక్ష్మీ సతీ !
కలదో భక్తుల రాత్రియందుఁ గను టే కంజాక్షి బోధించె నీ
చెలువున్నాటక మాట విన్న నగరా శ్రీ కూర్మరాయాధిపా !

రామా నే నపరాధిగాను వినవే రమ్మంచు మన్నించవే
యేమే కామునిబారి కోర్వఁ గలనా యీ వేళ లక్ష్మీ సతీ !
స్వామీ మిక్కిలి మక్కువైన పొలతుల్ సాధ్యంబుగా నుండఁగా
శ్రీమంతుండవు నాదుజోలి కలదా శ్రీ కూర్మరాయాధిపా !

మఱి యేకాంత నెఱుంగ నమ్మనగు సఖి మారాడకే వేడెదన్
తరుణీ ! శేషునినైనఁ బట్టెదను వింతా ! చాలు ! నేకాంతమున్
మరగే వంచును శేషశాయి వనుచున్ నారుల్ నినున్ మెచ్చరా
ఒరులీ మాటల నేర్పు విన్న నగరా యోకూర్మరాయాధిపా !

నే నీవాఁడనటంచు నెంచవుగదా నీలాలకాభాలకా !
నీనా పొం దెడసేయవచ్చి రెవరో నికర్కంబు లక్ష్మి సతీ !
కానీ టక్కులకేమి పోవెడలు నీ కార్యంబు లిందేమిరా
శ్రీ నారాయణమూర్తి వంచుఁ దెలిసెన్ శ్రీకూర్మరాయాధిపా !

బాలా నిన్నెడబాసి తాళఁగలనా భావించిమేలెంచవే
శీలుండంచును నన్నెఱుంగ వటవే శ్రీ లక్ష్మిదేవీ సతీ ।
మేలే యింతులు నిన్నుఁబాయఁగలరా మేమెందురా చాలునీ
శీలం బిక్కడఁ జెల్లునా తగదుపో శ్రీకూర్మరాయాధిపా ।

మ్రొక్కేనిప్పుడు తల్పుతీయఁ గదవే మోమిచ్చి వీక్షింపవే
దక్కేనంచుఁ బెనంగ జేయుటయు శ్రీ ధర్మంబు లక్ష్మి సతీ ।
దక్కేనంచుఁ బెనంగ జేసికొనుటే ధర్మంబు నేనేలరా
మొక్కేదాని వశీకరంబుగని రమ్మో కూర్మరాయాధిపా ।

ఏరీ నీసరికాంత లీ జగములో యిందివరాక్షీమణీ
జేరీ నీమరురాజ్యమేలు టరుచే శ్రీ ముద్దు లక్ష్మి సతీ ।
రారా మాటల సొక్కనేని రతులం రంజిల్ల నన్నేలరా
శ్రీ రామేశ్వర ప్రీతుడైన సుగుణా శ్రీకూర్మరాయాధిపా ।



[మైలవరం బాలభారతీసమాజం వారి నాటక ప్రయోగాలను తిలకించిన పిమ్మట ప్రశంసాపూర్వకంగా ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన పద్యావళి నిక్కడ పునర్ముద్రిస్తున్నాము. ఈ నాటక ప్రయోగాలు ఎప్పుడెప్పుడెలా జరిగినవో, అందందు పాల్గొన్న నటులెవరో, నాటక ప్రయోగానంతరం వేటూరి వారి పద్యావళి నెవరు సభలో చదివి వినిపించారో మొదలైన వివరాలు కూడా నాటి దినపత్రికలలో గుర్తింపబడినవి. ఆ విశేషాలను కూడా ఇక్కడ పొందు పరుస్తున్నాము.—సం॥]

# రాధాకృష్ణ నాటక ప్రయోగ ప్రశంస

(మైలవరం బాలభారతీ సమాజము)

—వేటూరి ప్రభాకరశాస్త్రి

శా. రాధావృత్తమునందు భక్తిపరమార్థంబున్ నిరూపించి దు
ర్గాథన్ బాపెను బానుగంటికవి యౌరా! నాటకస్ఫూర్తిచే;
రాధావృత్తమునందు భక్తిపరమార్థంబున్ నిరూపించి దు
ర్గాథన్ బాపెను బారుపల్లినటుఁ డౌరా! నాటకస్ఫూర్తిచేన్.

సీ. పతిదేవతాప్రాభవమ్ము నెమ్మోముపై సంపూర్ణముగఁ దాండవింపఁ గంటి
చూడ్కిలో బొమపంచుమాడ్కిలో భక్తి శృంగారమ్ముతీరు చెన్నారఁ గంటి
సత్యావివాద ప్రసంగమ్ము నఃస్నిగ్ధమధురమౌ ప్రేమసంపత్తిఁ గంటి
సర్వత్రబాలకృష్ణస్వరూపముఁ గాంచు తఱియందుఁ దన్మయత్వమ్ముఁ గంటి

గీ కంటిఁ బానుగంటికవిరాధికాకృష్ణ, నాటకమున రాధ వౌటఁ బారు
పల్లి సుబ్బరాయ! బల్లే! బలే!! నీదు, నైపుణమ్ము రసికతాఽపణమ్ము.

ఆ. హార్దమయిన భావమార్దవమునఁ బద్య, గానమునను వాగ్విధానమునను
అభినయమున నెల్ల సభకు సముత్సాహ, ముబ్బఁజేసినావు! సుబ్బరావు!

ఆ. పానుగంటికవియుఁ బారుపల్లినటుండు, పెద్దదుప్రవృత్తి దిద్దినారు
రాధవృత్తమందు మాధుర్యమును నెల, కొల్పినారు, ముదము కొల్పినారు,

శా. సంగీతమ్మున వింతవింతలచవుల్ సాధించె, సౌరూప్యమం
దుం గల్పించెఁ బ్రమోదమున్, బ్రణయమాధుర్యంబు చూపించి హా
యిం గూర్చెన్, దగఁ గృష్ణభూమిక కితండే యర్హుఁడౌనంట స
ర్వాంగీకారముగాఁగ శేషగిరిరాయం డొప్పె నిప్పట్టునన్.

ఉ. హాయియనంగఁజేసెఁ బరిహాసము శారదుఁ డిందు సత్యనా
రాయణరావు, సత్యయయి రక్తిఘటించెను గంగినేని నా
రాయణ, మింక నామెచెలియై బలునేరుపుచూపె సుబ్బరా,
వీయెడ నాటకంబునను నెల్లరు బల్లిదులైన నట్టువుల్.

చెన్నపురి
1-8-24



# చిత్రనళీయ నాటక ప్రయోగ ప్రశంస

(మైలవరం బాలభారతీ సమాజము)

—వేటూరి ప్రభాకరశాస్త్రి

శా. శ్రీవిస్ఫూర్తులు, విభ్రమంబులను, దృష్టిక్షేపముల్, నిస్సమ
ప్రావీణ్యంబునఁజూపె, నాట్యకళకుం బ్రాణంబుగల్పించి యు
జ్జీవింపించెను, మించె; నాటకములన్ జిత్రాంగి, సత్యాంగనన్,
సావిత్రిన్, దమయంతిఁ, గేకయసుతన్, సంజీవరా, వద్దిరా!

సీ. హాయిగాఁ జదివెఁ బద్యము, గద్యము, పసిండి తీగ కమ్మచ్చులో లాగులాగు,
గుత్తగై కొనె సభ్యచిత్తమ్ము లొక్క తుటారమ్మునకు నో మిటారమునకొ
నవరించె జగజంత నవలావిలాసముల్, జవరాండ్రు నిటుచూపఁజాల రనఁగ
శృంగారరసము వర్షించెను గరుణరసంబు కన్నీరు రాఁ జాలువార్చె

గీ. ఆంధ్ర దేశనటకు లసమానచాతురి, నాటకాభినయ మొనర్తు రనెడు
సద్యశంబునించెఁ జవులూరి సంజీవ, రావు మేటి నటక రత్నమగుచు.

గీ. ఉప్పులూరి యనుట యొప్పక యిఁకఁ జవు లూరి యనుచు నింటిపేరు మారుఁ
గాక! లోకరంజకమ్ముగా సంజీవ, రావు!నీవు! నాట్యరసము లొలుక!

గీ. ఈలవైచినయట్టు, కోయిలయుఁ గ్రోలినట్టు, సన్నని శ్రీకంఠ ముట్టిపడఁగఁ!
పద్యములు నీవు చదువుచో భావవిదుల, కుప్పతిల్లు ప్రమోదమ్ము చెప్పఁదరమె?

సీ. రసభావములలోఁగరఁగి గాన మానంద,మొదవింపఁ బద్యముల్ చదివినావు;
క్షణమేని యుచితలక్షణములు గోల్పోక, నిండుపాండిత్యంబు నెఱపినావు;
రంగౌచితీప్రకారము చక్కఁగ నెఱింగి, పాత్రగౌరవము కాపాడినావు;
కడునేర్పుతో వాచికము కాయికమునగు, నభినయంబు నొనర్చి యలరినావు;

గీ. భరత విదుర సుదేవాదిపాత్రములను, దాల్చి సభ్యుల మోదాబ్ధిఁ దేల్చినావు;
ఆంధ్రనటలోకమందు ముందంజవేసి, ప్రాకె నీ కీర్తి! దయిత గోపాలమూర్తి!

సీ. నల భూమికధరించి తొలుదొల్త దగుమాడ్కి, శృంగారచాతురీభంగి నెఱపె
ఆమీఁద బాహుకభూమిక ధరియించి, నిస్సమానంబైన నేర్పునెఱపె
విప్రలంభజ్వాల వెలుగఁగాఁ గరుణ శృం,గారమ్మ మనసులు కరగ నెఱపె
ఉత్తమదాంపత్యయోగమ్మునకు భంగ,పాటు దుస్సహ మన్నమాట నెఱపె

గీ. పద్యగద్యముల్ చదువుచోఁ బ్రౌఢినెఱపె, సముచితంబుగ సంగీతసరణి నెఱపె
చతురుఁ డగుచు మద్దాలి శేషగిరిరావు, హాయి యనిపించెఁ జిత్రనళీయమందు.

చెన్నపురి
5-3-24



# మైలవరం బాలభారతీ నాటక సమాజ ప్రశంస

-వేటూరి ప్రభాకరశాస్త్రి

శ్రీరమ్యంబగు నాంధ్రదేశమున లక్ష్మీపుత్రుఁడై యొప్పు పా
పారాయప్రభుమౌళి మైలవర భూపాలుండు దీవ్యత్కళా
సారస్యజ్ఞుఁడు నాటకాభినయవిజ్ఞానంబు పెంపొందఁగా
నారాధించెడు బాలభారతికి నిత్యశ్రేయముల్ కల్గుతన్.

సీ. కలవు వేనకువేలు విలువచేయఁగఁజాలు వస్తువుల్ రంగప్రశస్తికొఱకు-
కల రెందరో నూత్నకళ లొల్క నటరత్నములు సత్ప్రయోగంబు సలుపుకొఱకు
కల దాంధ్రదేశముఖ్యస్థాన మాస్థాన, మెల్లప్పు డభివృద్ధి యొసఁగుకొఱకు

కలవు తొల్లిటి నేఁటి కవులుకూర్చిననాటకములు రసస్ఫూర్తి యమరుకొఱకు
మఱియుఁ గలదు నీకు మైలవరక్షమా! వల్లభేంద్రు చేతి చల్లఁదనము
ప్రాపు చాల బాలభారతీ! కలకాల, మాంధ్రభూమి నాట్య మాడుమమ్మ !

శా. ఆహా ! మైలవరక్షమాధిపుఁడు మీ కాలంబమై నిల్చె మీ
రూహాపోహవిధిజ్ఞు లుత్తమకళాఢ్యుల్ సద్యశస్సాధనో
త్సాహుల్ నాఁటికి నాఁటి కింకను సముద్యచ్చాతురీప్యోతులై
సౌహార్దంబున నాటకాభినయమున్ సాగింపుఁడీ నాటకుల్ !

సీ. సావిత్రికథలోన సాక్షాత్కృతాంతుఁడో, యనిపించె రూపచేష్టానుకృతిని
పాదుకలోఁ గైక భర్తయై యార్త సంతాపానులాపముల్ చూపె మివుల
సారంగధరలో నసాధ్యచాతురి ముమ్మరముగానెఱపె రాజరాజుతనము
ప్రహ్లాదలోఁ బ్రతిస్పర్ధినాయకుఁడయి, ధీరోద్ధతత్వ ముద్దీప్తపఱిచె
హావభావముల్ ముఖమందుఁ దీవరముగ, జూపెఁ బద్యముల్ తిన్నగా నాపి చదివె
మేటివిఖ్యాతిగల గూడపాటినార, సింహనాయఁడు తగు రంగసింహ మనఁగ.

శా. శంకాతంకము లేని పూనికి హరిశ్చంద్ర ప్రయోగమ్మునన్
జంకించెన్ గుళికాత్మజత్వమున వేషస్ఫూర్తిచే మూర్తిచే
హుంకారమ్ములచేత భ్రూకుటులచే నోహోహో! గోవిందరా
ద్వేంకట్రామయనేర్పు సభ్యులకు నిర్వేలంబుగాఁ గన్పడెన్.

చ. ప్రకటముగా రసార్ద్రముగఁ బద్యములం బఠియించె భావ తీ
తికిఁ దగినట్లు మోముకళ తీర్చెను శ్రీ రఘురామచంద్రమూ
ర్తికిఁ దగఁ బట్టభంగసుకృతిన్ సరివచ్చిన రామనాథ శా
స్త్రికి నొకపద్య మే నొసఁగితిన్ గృతిగా నిఁక నేమిచేయుదున్.

గీ. దయిత గోపాలమూర్తి, యీతండు, సుబ్బరావు, వేంకటరామ నారాయణులును
స్వర్ణబిరుదముల్ గొనకుండ సాగరాదు, చెన్నపురినుండి యని నాదువిన్నపంబు.

శా. సంగీతమ్మున భావవిభ్రమమునన్ సౌరూప్యమందుం బ్రశం
సం గావింపఁగఁ దగ్గవార్ మఱియు నీసంఘమ్మునన్ బెక్కురుం
టం గన్గొంటిని వింటి నట్లయిన నింతంగొంతయే చెప్పుటల్
శృంగగ్రాహికగాఁ దలంపవలెఁ జుండీ! సత్స్వభావమ్మునన్.

మ. సరసార్థం బగు రాధగాథయు హరిశ్చంద్రీయమున్ బాదుకా
హరణమ్మున్ దులసీప్రభావకథ, కావ్యార్థంబునన్ మీర లీ
పురమం దాడినయట్టినాటకములన్ ముఖ్యంబు, లిట్లింక ను
త్తరరామ ప్రియదర్శ మృచ్ఛకటికాద్యంబుల్ ప్రయోగింపరో!

చ. పాటలతోడ నిండి రసభావవిహీనములై కథార్థపుం
బాటవ మింతలేనివి యపాత్రపు నాటకముల్ క్రమంబుగా
మాటుమణంగునట్లు రసమాధురిగల్గిన నాటకంబు లీ
పాటికినైన నాడెదవు భద్రము నీకగు బాలభారతీ!

సీ. పారసీమట్లతోఁ బాట లుండుట బాగుగాదు, కన్నడరీతి మోద మిడును
వంకరటింకర కొంకిరి గజిబిజి నడకలపాటలు విడువఁదగును
అల్లరిపరిహాస మడఁచిపుచ్చుట మేల్, ప్రధాన ప్రయోగముల్ మానరాదు
వస్తువు కవిత, ప్రశస్తమ్ముగానున్న యట్టినాటకములే యభినయింపఁ
గోరెదను దానిచే నాటకులకు సంఘమునకు దేశమ్మునకు శ్రేయ మనువుపడును
చక్కఁగా నుద్ధరింపుఁడీ సరసకళను నన్ను మన్నింపుఁ డీ చిన్నవిన్నపమున.

శా. రారాజద్వెలమాన్వయ ప్రముఖసూరానేన్యపాభిఖ్య పా
పారాయప్రభు మౌళికిన్ శుభము లాపాదిల్లుగాఁ! కేతదు
ద్ధారంబై తగు బాలభారతికి నిత్యశ్రేయముల్ గల్గుఁగా!
కారోగ్యాభ్యుదయమ్ము లీనటులకుం బ్రాప్తించుఁగా కెల్లెడన్.

చెన్నపురి
11-3-1924

[ఆంధ్రపత్రిక రుధిరోద్గారి సం॥ ఫాల్గున శు॥ ౧ గురువారం (1924 మార్చి 6 వ తేదీ గురువారం) పత్రికలో ఈ దిగువ సమాచారం పేర్కొనబడినది. ప్రకటన వార్త- సం.]

శ్రీమైలవరం బాలభారతీ సమాజం

ఈ నెల 1వ తేదీ శనివారం — రాధాకృష్ణ నాటకము

2వ తేదీ ఆదివారం — సావిత్రి నాటకము-శ్రీనాగేశ్వరరావు గారు ప్రసంగిస్తూ ఉపన్యసించిరి.

నిన్న 5వ తేదీ — చిత్రనళీయ నాటకం

పాత్రిలు - పాత్రిధారులు

రాధా-పారేపల్లి సుబ్బారావు — చెలికత్తె-సుబ్బారావు

కృష్ణ-జొన్నవిత్తుల శేషగిరిరావు — దమయంతి-ఉప్పులూరి సంజీవరావు

శారద-సత్యనారాయణరావు — నళ, బాహుక-మద్దాలి శేషగిరిరావు

సత్య-గంగినేని నారాయణ — సుదేవ-దయిత గోపాలం

9వ తేదీ — కడపటి నాటక ముండును.

[రాధాకృష్ణ నాటకమును ప్రశంసిస్తూ వేటూరి పి్రభాకరశాస్త్రిగారు వాి్రసిన పద్యాలను సభలో గద్దె రంగయ్య నాయుడుగారు చదివిరి (1-3-24).

చిత్రినళీయ నాటకమును పి్రశంసిస్తూ వేటూరి వారు వ్రాసిన పద్యములను వెదురుమూడి సుబ్బారావుగారు చదివిరి (5-3-24) సం॥].



# తాండవ కేళి



ప్రభాకరశాస్త్రిగారి జనకులు
వేటూరి సుందరశాస్త్రిగారి
కృతులు

పరమేశ్వరూడూ - తాండావకేళి సల్పెనే ॥

కుండలా కాంతూలు మెరయ
దండిగా అందెలూ మ్రోయ
దండిగా టాకీ చేబూని
థళాంథళాం యని థణినాదముతో ॥తాండా॥

శిరామూన మమ్మేలు కన్యా
ముఖామూన మూడో కన్ను
సొగసూగ స్ఫటికాలహారము
నిగాల్ నిగాల్ మని నిగనిగ మెరయుచు ॥తాండా॥

సరస్వతీ వీణామీటాగా
పురందరుడు తాళం వేయగ
హరి మృదంగం వాయించగను
ఝరీఝరీ పరి పరి పరి విధముల ॥తాండా॥

రమామణీ గీతము పాడాగా
కమాలజుడు తాళం వేయగ
ఉమాదేవి కొలువూన హరుడు
తథిమిత కుంతరి తకుఝుణ తక థిమి ॥తాండా॥

శశికళా మస్తాకమున
భసితాంగ విభూతి రేఖ
విషామూ గళామున
మిసాల్ మిసాల్ మని మిసమిస మెరయుచు ॥తాండా॥

దేవాది దేవేంద్ర వరులు
దేవతా గంధర్వ స్త్రీలు
భావమూనా ప్రణుతింపఁగను
భళిభళి భళి భళిభళి యనుచును ॥తాండా॥

వేంకటా రాజాఖ్య హృదయ
పంకజాపరియంక నిలయ
శంకరు డదుగో ప్రదోష కాలము
ఝణాంఝణాం యని ఝణినాదముతో ॥తాండా॥



# మాతృశ్రీ మహాలక్ష్మమ్మగారు

—చాగంటి కల్పవల్లి


(మాతృశ్రీ మహాలక్ష్మమ్మగారు)

గురుపత్ని మహాలక్ష్మమ్మగారి అమృత ప్రేమను చవిచూడని వారు వారి శిష్యబృందము లో లేరనే చెప్పాలి. ఆ శాంతమూర్తి మమతల తల్లి. అనురాగ దేవత. అమ్మయొక్క ఆత్మీయతను, ఆ చల్లని చూపులోని ప్రశాంతతను వర్ణించనలవికాదు. ఆ మాతృమూర్తితో నాకున్న అనుబంధమును నాశక్తి కొలది ఏదో వ్రాయు చున్నాను.

అప్పటికి నావయసు 16, 17 సంవత్సరములు అనుకుంటాను. నేను చిన్నతనముననే మాతృవిహీనను 'అమ్మ' అనే పదమే తెలియదని చెప్పాలి. నా అనారోగ్యరీత్యా శ్రీ గురుదేవులు ప్రభాకర శాస్త్రిగారి వద్దకు తరచు ట్రీట్‌మెంట్‌కు వెళ్ళుచుండేదానిని. అప్పటికి నాశరీరము శుష్కించి జీర్ణావస్థలో నున్నది మెదడులోని కురుపుకు అనేకమంది పెద్ద డాక్టర్ల చేత ఆపరేషనులు చేయించినారు. డాక్టర్లు ఆశలేదని తెలుపగా. వృద్ధులైన మాతాతగారు. చాలా భయపడినారు అదృష్టవశాత్తూ, కొందరు మిత్రులద్వారా శ్రీవారి యోగా ట్రీట్‌మెంట్ గురించి విన్న మా పెద్దలు. శ్రీవారి ప్రార్థనసమావేశానికి నన్ను తీసుకుని వెళ్ళిరి. అప్పటినుంచి శ్రీవారి ఆదరపూర్వకమైన ట్రీట్‌మెంట్ నాకు లభించింది.

అప్పటిలో నేను విపరీతమైన తలబాధ, జ్వరము, అన్నద్వేషముతో బాధ పడెడిదానను. తట్టుకోలేని బాధ కలిగినప్పుడు 'అమ్మా!' అని తలచుకొనుట అలవాటుగానుండెడిది ఒకనాడు ప్రార్థనలో విపరీతమైన బాధకలిగి భయాందోళనలతో అశాంతితో 'అమ్మా'

అని కనుల నీరుకార రోదించసాగాను. చిన్నతనం నుంచీ అమ్మలేనిలోటు పెద్దగా బాధించని నన్ను ఆరోజు అమ్మలేనిదాననసే భావం పీడించసాగింది. అందరిలాగా నాకూ తల్లి వుంటే నా కష్టాలనూ, బాధలనూ ఆమె ఆదరణలో మరువగలిగేదానిని కదా!' అనే ఆలోచనతో సతమతమైనాను. ఈ ఆలోచనలో, ప్రార్థనకి భంగం కలిగింది. ఆరోజు నాజీవితం అనుకోని మలుపుతిరిగింది.

ప్రార్థననుంచి కనులు తెరవగానే శ్రీ గురుదేవులకు మంచినీరు యిస్తూ 'అమ్మ' కనిపించినారు. అందరినీ పరామర్శించి వారివారి అనారోగ్యములకు తగురీతిని సలహాలిచ్చి, శ్రీ శాస్త్రిగారు నావద్దకు వచ్చినారు. "ఏమ్మా! అలావున్నావు? ఏమి జరిగింది? ఎందుకా కన్నీరు?" అని ఆప్యాయతతో ప్రశ్నించినారు. నేనేమీ చెప్పలేకపోయినాను. 'అమ్మాయీ! అన్ని చికాకులూ సర్దుకోవాలని నమస్కారము చేసికొందాము' అన్నారు. నమస్కారము చేసికొన్నకొంత సేపటికి నాలో ఉపశమనము కలిగినది. గురుదేవులు 'సుఖముగా వున్నదా?' అని ప్రశ్నించగా నన్ను దహించి వేస్తున్న వేదనను, తల్లిలేనిలోటు వలన నాలో పెరుగుతున్న అశాంతిని వారికి తెలియజేసాను. "నా తల్లి వుంటే, ఈ అనారోగ్యములో నాకు ఆదరణ లభించేది కదా! ఇప్పుడు ప్రతిదానికీ ఇతరులను, బాధపెట్టవలసి వస్తున్నది" అని తిరిగి కంటనీరు పెట్టుకున్నాను. "అదాసంగతి, సరే, బాగున్నది!" అని గురుదేవులు అమ్మగారిని పిలిచారు. "కొంచెము వేడిగా ఏదైనా ఇవ్వు అమ్మాయికి" అన్నారు. అమ్మ హార్లిక్సుతెచ్చి నాచేత తాగించారు. ఆదే అమ్మతమై ఈ నాటికీ ప్రవహిస్తున్నది నాలో. ఆనాటినుంచీ అనేక సందర్భాలలో మాతృప్రేమను నాకు చవి చూపించారు మహలక్ష్మమ్మగారు. ఆ దంపతుల ఆదరణలో నాకు స్వస్థత చేకూరింది.

1947 సం॥లో శ్రీగురుదేవులు మా ఇంటికి వచ్చినారు. "ఎప్పుడూ పిల్లలకి అనారోగ్యాలు నాన్నగారూ మీకు జాబు వ్రాసి సమాధానం వచ్చేవరకూ, వాళ్ళకి స్వస్థతచిక్కదు" అన్నాను. శ్రీ వారు నవ్వి "అంత గాభరా ఎందుకమ్మా! వారిని కూర్చోపెట్టుకుని ప్రార్థన చేసికోకూడదూ" అన్నారు. వారి ఆశీర్వాదంతో ఏ అనారోగ్యమైనా తిరుగుముఖం పట్టాల్సిందే.

మరోసారి జ్వరముతో కర్నూలు నుంచి హైదరాబాదులో నున్న అమ్మవద్దకు వచ్చాను. నమస్కారము చేసికొన్న కొంతసేపటికి జ్వర తీవ్రత తగ్గింది. అమ్మ "అన్నం తిందువుగానిర"మ్మని పిలిచినారు. "జ్వరము కదా! కాఫీ తాగుతా"నని అన్నాను. "కొద్దిగాతిను ఏమీ అవదు. పడనివే తినమని నాన్నగారు చెప్పేవారు కదా," అని, అన్నము తినిపించినారు. రాత్రికి జ్వరము పూర్తిగా తగ్గి స్వస్థత చేకూరినది. నేను ఆమెను తెలిసీ తెలియని ప్రశ్నలతో వేధించే దానిని. అమ్మ అనాడు ఇచ్చిన జవాబులలో ఎంతో అంతరార్థం ఇమిడి వుందేది.

మరొక అనుభవం. మేము భీమవరంలో వుండగా అక్కడి హెడ్‌మిస్ట్రెస్ శ్రీమతి సుందరమ్మ గారితో పరిచయం కలిగింది. ఆమె భర్తకు మతి చలించి ఎన్నోరకాల వైద్యాలు చేయించినారు బాధలలో నున్న సుందరమ్మగారు, "మీతో పాటు నేను ప్రార్థన చేసికోవచ్చా?" అని అడిగారు. "సరే, శ్రీ సి. వి. వి. పి. ఎస్. గార్లకి నమస్కారము చేసికోండి. ఈ ప్రార్థనలలో చాలా మందికి ఆనారోగ్యాలు కుదుట పడుతాయి. దానికి నేనే నిదర్శనము. అయినా హైద్రాబాదులో మా అమ్మగారు వున్నారు. ఆమె వద్దకు నేను వెళ్ళేటప్పుడు మీరు కూడా రండి" అని చెప్పి కొంచెము విభూదిని ఇచ్చాను. ఆమె భక్తి శ్రద్ధలతో ప్రార్థన చేసికోసాగారు. క్రమేపీ ఆయనలో మార్పు రావడం గమనించాము. హైదరాబాదుకు నేను వెళ్తూ సుందరమ్మగారిని తీసుకుని వెళ్ళాను. అమ్మకు పరిస్థితి వివరించి, "అమ్మా! ఆవిడ పదే పదే అడగగా సి. వి. వి. ఫి. ఎస్. గార్లకు నమస్కరించి విభూది

ఇచ్చా. మన్నించండి" అన్నాను. అమ్మ దానికి సమాధానంగా "దీనిలో ఏముంది? అందరి అశాంతులు తొలగాలని, సర్వజనులు సుఖంగా వుండాలని నమస్కరించుకొందాము" అన్నారు. అప్పుడు నేను, "అమ్మా, అందరి బాధలు తొలుగునట్లు నమస్కారము చేయగల మహత్తరశక్తి మీకున్నది. మరి నాకు నాదే తొలగించుకొనుశక్తిలేదు, అనుభవములేదు కదా" అన్నాను. అమ్మ చిరునవ్వుతో "అందరికీ శ్రీ సి. వి. వి. గారి అద్భుతశక్తి తప్ప వేరేమి కలదు? భక్తి ప్రపత్తుల బట్టి వారి వారికి ఉపశమనం కలుగుతూ వుంటుంది" అన్నారు. శ్రీవారి ఆశీర్వాదంతో సుందరమ్మగారి భర్త పూర్తి ఆరోగ్యాన్ని పొందారు. ఈనాడు ఆయన లాయరుగా ప్రాక్టీసు చేసికొంటున్నారు. ఆనాటినుండీ, అమ్మ అనుజ్ఞ ప్రకారం, ఆపదలో నున్న వారెవరైనా, నా నీ భేదం లేకుండా, వారి ఆరోగ్యంకోసం ప్రార్థనచేయడం, శ్రీ వారికి నమస్కరించి విభూది నివ్వడం అలవరచుకున్నాను. వారిలో ఏమి జరిగేదో, శ్రీ గురుదేవులకే ఎరుక. తిరిగి వచ్చి కులాసాగా వున్నామని అంటే నాకే నమ్మశక్యమయేది కాదు. కాలక్రమేణా ఆత్మవిశ్వాసము కలిగింది. అందరి క్షేమం మనము కోరితే మనక్షేమం శ్రీ C V V P S దంపతులే చూస్తారనే నమ్మకం ఏర్పడింది.

1974 సం॥లో సెప్టెంబరు నెలలో నాకు క్యాన్సర్ వ్యాధి వచ్చినది. డాక్టర్లు ఆపరేషను చేయ నిర్ణయించినారు. ఆపరేషను రోజు శ్రీ ప్రభాకర శాస్త్రిగారికి నమస్కరించి, శ్రీ సి. వి. వి. గారికి నమస్కరించి, మాతృమూర్తిని స్మరించి కనులు మూసికొన్నాను. తరువాత ఏమి జరిగిందీ తెలియదు. సాయంత్రము ప్రార్థన సమయానికి కొద్దిగా స్పృహ వస్తున్నది. అమ్మ వడిలో తలపెట్టుకుని పడుకొన్నట్లు ప్రక్కనే గురుదేవులు నిలబడినట్లు తోచినది. శ్రీ సి. వి. వి. గారి చిత్రపటము కనుల ముందు నిలచినది. చేయెత్తి నమస్కరించినాను. అంతే. ఆ పిదప నా ఆరోగ్యము చక్కబడినది.

1978 ఏప్రిల్ నెలలో బందరులో అనుకోకుండా పై డాబా మీద నుంచి కిందకు పడి పోయినాను. "అమ్మా!" అని అరచి స్పృహ కోల్పోయాను. కొంత సేపటికి నాతం అమ్మఒడిలో ఆనినట్లు కాళ్ళు నేలతాకినట్లు అనిపించినది. నాతలకుగానీ నడుముకుగానీ ఎట్టి దెబ్బతగలలేదు. నేల తాకిన కాలుకి నుటుకు ప్రాక్చర్ అయినది. 16 అడుగుల పైగా నున్న మేడ మీద నుంచి పడి బయటపడుట అదృష్టమని అందరూ అనిరి. శ్రీ గురుదేవుల అనుగ్రహము వల్ల తల మీద కొట్టేది చెంప మీద చిటిక వేసిందనినట్లు గండము తప్పించుకొన్నాను.

ఇలా అనేక పర్యాయములు మాతృమూర్తిగారి ప్రేమలో అమిత శాంతిని అనుభవించాను. అమ్మ ఆశీస్సులు గురుకటాక్షమూ ఎల్లరినీ కాపాడవలెనని ప్రార్థిస్తున్నాను.

మాస్టర్ సి. వి. వి. నమస్కారము.



## గురుదేవుల డైరీనుండి ఒకపుట

1. బుధవారము, 4 జనవరి, 1950. సి. వి. వి. నేడు సాయంకాలము తిరుపతి నుండి గుంటూరు ప్రయాణము నేనూ, సీసా; కాళహస్తిలో చి॥ శెట్టి గారు పాలు, దోసెలు పంపినారు. రాత్రి గూడురులో మెయిలు ఎక్కుట.

2. గురువారము, 5 జనవరి : '50. ఉదయం గుంటూరు. చి॥ వేంకటేశ్వరరావు, మేము, గుంటూరులో భోంచేసి, బెజవాడ, అక్కడ నుండి వెంటనే ముక్త్యాల, జగ్గయ్యపేట వెళ్ళితిమి. రాత్రి ముక్త్యాలలో

3. ఆదివారము, 8 జనవరి, '50. ఉదయం మధ్యాహ్నం అనకాపల్లిలో మీటింగు. శ్రీ గణపతి శాస్త్రిగారు, అవధాని, జోగయ్య శర్మ వగైరాలను కలసికొంటిని రాత్రి అక్కడే ఉన్నాను.

4. మంగళవారము, 17 జనవరి, '50. నేడు సాయంకాలం మద్రాసు వెళ్ళితిని.

5. బుధవారము, 18 జనవరి, '50. సోమ. శర్మగారి కుటుంబము, విశ్వనాథం, ముని వగైరాలు వచ్చిరి. లైబ్రరీకి వెళ్ళితిని. రామకృష్ణారెడ్డి గారితో లైబ్రరి పని. సీతాపతి గారితో సంభాషణ జరిగినది. నేడు రాత్రి ఆంధ్ర ప్రభ ఎడిటరు గారిని చూచితిని.

6. గురువారము, 19 జనవరి, '50. ఉదయం అందరూ వచ్చిరి. 12 గం॥ తిరుపతి పయనము.

7. గురువారము, 26 జనవరి, '50. ఇండిపెండెన్సుడే [రిపబ్లిక్ డే] రాత్రి అన్నారావుగారు ప్రభృతులకు విందు. ఉదయం శివశంకరరావు గారింటను, మధ్యాహ్నం దేవస్థానం అసోసియేషనులోను, బజారు వర్తకుల సంఘంలోను ఉపన్యాసములు.



# గాంధి రామాయణసంకలనం

(గత సంచిక తరువాయి)

[ "గాంధి రామాయణమును గూర్చి విన్నాను. వేలకొలది భారతీయులకి సదవకాశమిచ్చి నందులకు మేమెంతయో ధన్యులము."

—రత్నాకర వెంకట సుబ్బరాజు (14-1-50)

ఇట్టి లేఖలెన్నో 1950 లో వేటూరి వారు ప్రకటించిన గాంధి రామాయణ సంకలనోద్యోగసంకల్పమునకు బలమునిస్తూ వచ్చినవి. పెద్దల నుండీ పిన్నల నుండీ రచనలూ వచ్చినవి. అవే మణిమంజరిలో మేమిప్పుడు వరుసగా ప్రచురిస్తున్నవి. —సం॥ ]

## 9

గాంధీ బాపూజీ 12 సం. వయస్సు వచ్చినప్పటి నుండి శ్రావణపితృభక్తియను నాటకము లేత వయస్సునందే హత్తుకొనిపోయెను.

పితృభక్తి, అహింసా తత్వము ఆయన జీవితమున అవుడే అంకురించినవనియు చెప్పవచ్చును ఇట్టి తత్వమును అందరకును మాదిరి చూపించిరని నేను తలంచుచున్నాను. పితృభక్తి మొదలగు వాటికి ఆయన ఆదర్శప్రాయుడని నేను చెప్పుచున్నాను.

బైబిలు సిద్ధాంతాలు: ఒక చెంప కొట్టిన రెండవ చెంప చూపుమనుట ఆయన నెరవేర్చెను.

దక్షిణ ఆఫ్రికాలో అచటి బోయర్లు చాల కష్టములు పెట్టిరి. అట్టి కష్టములు సహించెను. ఇట్టివి జరిగిన మనము కూడ అట్టిరీతిగా నుండవలయునని కోరి మార్గదర్శియాయెను అనుట కేయడ్డులేదని నేననుకొంటు న్నాను.

రాజకీయ జీవితము : జలియన్‌వాలాబాగు సందు ఆంగ్ల ప్రభుత్వము జరిపిన హత్యలు ప్రజలకు రోషము పుట్టించెను. అట్టి సమయమున అఖిల భారత కిలాఫత్ సభలో సహాయ నిరాకరణ తీర్మానమునుబెట్టి నెగ్గింపగలిగెను. 1920 లో కలకత్తాలో స్వరాజ్య సాధన తీర్మానము పెట్టెను. బొంబాయిలో విదేశీ వస్త్ర దహన యజ్ఞమును సాధించెను. తదుపరి రెండస్త్రములు దేశమునకు బహూకరించెను. 1. ఖద్దరు, 2. రాట్నము. ఇటువంటి వనేకములు. ప్రజలకు ఆయన ఆదర్శముగా నుండెను. వారిని బట్టి మనమందరము మన దేశముకొరకు పాటుపడిన గాంధి బాపూజి వుద్దేశము నెరవేర్చగలము. అట్లు నెరవేర్చుటకు భగవంతుడు మనకు మంచి మనస్సు, శాంతి, దయ, విశ్వాసము, పట్టుదల ననుగ్రహించు గాక.

ఇట్లు

పి. ఆదాము లూథరన్

స్కూలు హెడ్మాష్టరు

ఆలపాడు పోస్టు

తెనాలి తాలూకా

## 10

మహా పురుషులు మరణించిననాడు లోకం చీకటి గొంటుందంటారు.

మహాత్ముడు గుండు దెబ్బకు గురియైనాడన్న దుర్వార్తను విన్నమరు క్షణం నుంచి, లోకం చీకటి గొనడమేమిటో నాకు తెలిసింది. కన్న తండ్రి గతించిననాడును ఇంతటి మనోవ్యథను నేను పొందలేదు. అనాటి నా అంతులేని దుఃఖాన్ని, ప్రజ్ఞలేని ప్రవర్తనను ఇక్కడ వెళ్ళబోసుకోడం ఎందుకు? మరొకటేమీ చేతగాక గుండె నిబ్బరంచేసుకొని, నోరునొక్కుకొని, దుఃఖాన్ని దిగమింగి, కళ్లుమూసుకు కూర్చున్నాను. ఎవరితో నా ఆవేదన చెప్పుకోను! దేశానికే కలిగిన ఈ ఆపదలో నన్నాదరించే వారెవరు ?

అప్పటి నామనోవ్యథను మాత్రం ఇక్కడ వెళ్ళబోసుకుంటాను

మానవ మాత్రులకు జరామరణములు సహజమైనా, పురుషోత్తముడైన గాంధి మహాత్మునకు లోక సహజమైన జరామరణములు లేవని నేను అనుకొంటూ ఉండే వాణ్ణి.

ఎందుచేత నంటే, ముసలి తనం వల్ల మహాత్ముడు ఏ విధమైన ఆయాసమును అనుభవించి యెరుగడు. 'తుదినిశ్వాసం వరకు ప్రజాసేవ జేయడమే నా జీవిత లక్ష్యం' అని చెప్పాడు. ఆలా చేసి చూపించాడు.

ఇక మరణమా ! 120, ఏండ్లు తాను బ్రతకాలని కోరుకొంటున్నాడు గనుక, అందాకా బ్రతికి 121, ఏట మాత్రం మరణాన్ని కోరుకొంటాడా, పొందుతాడా యేమని, నా ఆశ !

కాని ఎన్నడూ అనుకోని, ఊహింపనైనా ఊహింపరాని, ఇంతటి మహాపచారము ఆ మహనీయుని యెడల జరిగింది. ఎందుచేత ఈ మహా విపత్తు జరిగింది ?

ప్రపంచ మానవకోటి ఈ మహాత్ముని ఉనికిని ఆపేక్షిస్తు ఉండగా, తానును మానవ జీవిత పరమావధిని తుదముట్ట జూడవలెనని కోరుతూ ఉండగా, గాంధి మహాత్ముని క్షేమమే లోక కల్యాణ కారణమని ప్రజలు వేనోళ్ల ప్రార్థిస్తు ఉండగా ఒక దుర్మార్గుడెవడో, మహాత్ముని యెడల అపచారం తలుస్తే, ఆ కోర్కె కొనసాగడమేనా? అజాత శత్రువు, అహింసా స్వరూపుడు అయిన ఈ పురుషోత్తముని స్థితియే, ఈ విధంగా పరిణమిస్తే ఇక లోకంలో ధర్మమెక్కడ, సత్యమెక్కడ, అహింస యెక్కడ ?

పది మంది కూడి మనసారా ఇది కావలెనని ప్రార్థిస్తే భగవంతుడు ఆ కోర్కెను నెరవేరుస్తాడంటారే—గాంధి మహాత్ముడు క్షేమంగా ఉండాలనే కోర్కె లోకానికి లేదంటారా ? ఇక ప్రార్థనలవల్ల ఫలితమేమిటి ?

అధర్మము, హింస, దౌష్ట్యము ఇవేగా నీ అపమృత్యువువల్ల జయమొందినవి ?

ఈ విధంగా ఆనాడు నా మనస్సు మధనపడ్డది. నాకు ఈ ప్రశ్నలకు సరియైన సమాధానం గోచరించ లేదు. మర్నాడే నా ఈ భావాలన్నీ, అంతరాత్మావబోధముల నందుకోగల, యోగ విద్యా సంపన్నులైన నా ఆప్తులకు, జాబు ద్వారా నివేదించుకొన్నాను. బదులు చూచుకొని కొంత ఊరడిల్లినాను.

"బాంబుకు గురియై ప్రయోగించిన వానిపై ఎట్టి ద్వేషమూ లేక మందస్మిత వదనంతో మరణించి వుంటే అప్పుడు ఈ ప్రశంసలకు నేను అర్హుణి అయ్యే వాడిని".

అని మహాత్ముడు తన అవతార పరిసమాప్తికి ముందు వారంరోజుల క్రిందట ఒకడు బాంబు విసరగా చెప్పిన మాటలకు, అలాగే తాను మరణించుటకు, అర్థం ఇప్పుడు అవగతమైనది.

ఉత్తమ పురుషులు మానవకోటి శ్రేయస్సునుగోరి, భగవంతునికి ఉపహారం సమర్పించాలంటే, తన్ను

తానే బలిదానంగా అర్పించుకొనియైనా, లోక శ్రేయస్సును సమకూరుస్తారనీ, గాంధి మహాత్ముడు కూడా తానుగాకోరి, తన యాత్మను ఈ విధంగా సమర్పించాడనీ, నేల మీద వాలే వరకూ ప్రజాసేవా తత్పరుడై జీవితమును సార్థకమైన దానినిగా చేసుకొన్నాడనీ, ఇప్పుడు అర్థమవుతోంది.

మహాత్ముడు పయి విధముగా కోరకుండా, పరుల హింస నన్నేమీ చేయజాలదని సంకల్పించి ఉంటే, ఇట్టి దుర్మార్గుల హింస కూడా ఆయననేమీ చేయజాలక పోయేదేమో అనిపిస్తుంది.

ఈ విధంగా కోరకుండా, పరుల కష్టాలు, దుఃఖాలు, అన్నీ తనపైన వేసుకొని ఆత్మ త్యాగానికి కూడా వెనుదీయని, స్వార్థ రహితమైన, మహాత్ముని త్యాగ మహిమనే, మనమిక్కడ గుర్తించవలసిన గొప్ప విషయముగా నాకు తోచుచున్నది.

"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకేన అమృతత్వమానశుః"

మహాత్ముడు గుండు దెబ్బకు గురియై మరణించినాడంటే అదేదో తప్పు మాటగాను, నమ్మరాని మాటగాను నాకు అప్పటికి, ఇప్పటికీ కూడా తోస్తుంది. ఆయన మరణ వార్తను నా మనస్సు నమ్మడంలేదు. కాని పది మంది పెద్దలే, ఆయన చనిపోయినాడని, ఆయన సమాధి మీద పుష్పమాలు అర్పిస్తుంటే నేను మాత్రం నమ్మక ఏమి చేసేది!

నీ సమకాలికుడనైనందుకు, నిన్ను దర్శించి, భక్తితోనే బోధనల నాలకిస్తు, ఆచరణలేని మూఢ భక్తితో నేను విఱ్ఱవీగి పోయినానేగాని, అవతార మూర్తిని కాలదన్నుకొన్న పాపిష్టి మానవ జాతికి జెందిన పశువును నేనని, ఈ మహా పాపమునకు ప్రాయశ్చిత్తము లేదని ఇప్పుడు అనుకొని దుఃఖిస్తున్నాను.

నీ ప్రబోధముల సారాంశముగా నాహితోపదేశకులు ఒకప్పుడు రచించి పంపిన ఈ క్రింది పద్యముల లోని హితము, నా నిత్య ప్రవర్తనలోపదుర్కొనునట్లు శ్రీ గురు దేవుని నిత్యమూ ప్రార్థిస్తు, కార్య రూపమున ఏ మాత్రము చేయగలిగినా, అదే నా నిత్య పూజగా నీకు సమర్పించు కొనుచుందును.

'తలపులు విశుద్ధములుగా
తలపింపుము పలుకు లమృతధార లనంగా
పలికింపుము కార్యమ్ములు
సలిపింపుము పరహిత ప్రశస్తమ్ములుగన్

ఇతరుల నవమానించెడు
మతిమాన్పుమి పరుల చెడ్డ మాటలు సైపన్
ధృతిగూర్పుమి సంతోషా
మృతరసమిడి సేదదేర్పుమీ నా స్వామీ!

నేను కారణముగ నెవ్వడేని సంకటంపడని రీతి నన్ను వర్తింపజేయు
మాగ్రహ మసూయ గర్వమిత్యాదులయిన
చెడుగు లుడిగింపు మిక నన్ను జెందకుండ.

వేటూరి శంకరశాస్త్రి



# పుణ్యవతి - భాగ్యవతి

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[చరిత్ర, కల్పన, సంగీతము, సంప్రదాయము, ఆరోగ్యము, హాస్యము, నీతి, సౌశీల్యము మొదలైన విషయాల నెన్నిటినో ఆధారపరచుకొని వేటూరివారు- అడపాదడపా వ్రాస్తుండిన అనేక కథానికలలో ఈ 'పుణ్యవతి-భాగ్యవతి' అన్న దొకటి. 'గౌతముడు' అన్న కలం పేరుతో వారు వ్రాసిన ఈ కథానిక - కేదా రేశ్వర వ్రతమాహాత్మ్య కథ - ఆనంద వాహిని (1930-అక్టోబరు 1వ తేదీ సంపు. 1-సంచిక 7-10)లో అచ్చుపడింది. ఈ పత్రికా నిర్వహణలో శాస్త్రిగారి హస్తం పరోక్షమైనా ప్రముఖంగా ఉండేది. 'ఆనంద వాహిని' ఆరంభ పద్యమిది వేటూరి వారిదే.

'ఉత్తమ జ్ఞానంబు నొదవించుకొన గలను
చిత్త మీశ్వరు నందు చెలగించుకొన గలము
సౌందర్య సంపదలు సాధించుకొన గలము
ఇందె యానందవాహిని మునుకలిడి మనము'

పత్రికా నిర్వహణ యందువలెనే కథా రచనయందును శాస్త్రిగారిది అందె వేసిన చేయి అని నేటి ఆంధ్ర పాఠక లోకానికి అధికంగా తెలిసి ఉండక పోవచ్చును.

ఇక ముందు మణిమంజరి సంచికలలో శ్రీవారి కథానిక లిట్టిని కొన్ని క్రమంగా ప్రకటింపబడగలవు. సం॥]

కైలాస పర్వతం మీద పార్వతీ పరమేశ్వరులు, ఏకాంత స్థలమందు, యేక శయ్యపై, కూర్చుండి వుండిరి. ఉత్తమమైన వ్రతం ఒకటి ప్రసాదించమని పార్వతీదేవి, పరమేశ్వరుణ్ణి వేడుకొనెను. "రహస్య మైనది, ఒక వ్రతమున్నది. దాని మహిమ చెప్పు తున్నాను విను"మని పరమేశ్వరుడు చెప్ప మొదలు పెట్టెను.

భూలోకమందు పుణ్యపురంలో శంకరభట్లనే బ్రాహ్మణుడుండేవాడు. మహా దరిద్రుడు. అయనకు నలుగురైదుగురు కొమాళ్ళు. ఇద్దరు కొమార్తెలు.

పాపం! ఆ బ్రాహ్మడు ఉపాదానం చేస్తూ సంసారం పోషించుకుంటూ ఉండేవాడు. ఒక కాలాన దేశక్షామం వచ్చింది. అప్పుడు కడుపు గడుపుకోలేక అనేక జనం హతమైనారు. ఆ బ్రాహ్మడి కొమాళ్ళు కూడా అంతరించిపోయినారు. అంతట, కన్న దుఃఖం, కడుపు దుఃఖం సహించలేక, ఆ బ్రాహ్మడు పుణ్యవతి, భాగ్యవతి, అనే కొమార్తెలతో, కాశీదేశం పోదామని ప్రయాణమైనాడు. బైలుదేరివస్తూ, అడవినిబడి దోవ తప్పి ఊరు నాడు గానక తిరిగి తిరిగి, విసిగి వేసారి, ఒక మర్రిచెట్టు నీడకు చేరెను. కుమార్తెలను కింద కూర్చోబెట్టి తను చెట్టెక్కి చూచేటప్పటికి చిన్న పల్లె ఒకటి కోసెడు కోసెణ్ణర దూరంలో కాన వచ్చింది. సంతోషించి కిందకు దిగివచ్చి 'అమ్మలారా చేరువనే ఊరు కనిపించింది. అక్కడకుపోయి ఉపా దానం యెత్తుకొని యింతలోనే తిరిగివస్తాను. మీరు జాగ్రత్తగా యిక్కడనే ఉండండి. మీరిక నడవలేరు.' అని చెప్పి ఒప్పించి తాను ఉపాదానం కోసం వెళ్ళెను.

అంతట పుణ్యవతి ఉత్తరపువైపు కేసి చూడగా అక్కడ ఒక బావిన్నీ పువ్వుల వనమున్నూ కనిపించెను. చూచివద్దామని అక్క చెల్లెళ్ళిద్దరు అక్కడకు వెళ్ళారు. పోయి చూచేటప్పటికి, ఆ బావి దగ్గర నలుగురు కన్యలు చేరి, పందిరి వేయించి, పాలవెల్లి గట్టించి దీపం పెట్టి దేవుణ్ణి నిలిపి, దేవుడి ముందర యిరవై యొక్క పోకలు, యిరవై యొక్క ఆకులు, యిరవై యొక్క పసుపు గొమ్ములు, యిరవై యొక్క అరటి పళ్ళు, యిరవై యొక్క ముళ్ళు వేసిన తోరాలు ఉంచి స్వామికి ధూపదీప నైవేద్యాలతో పూజ చేస్తూ ఉండిరి. పూజయిన తర్వాత ఒక బ్రాహ్మడికి పాదాలు కడిగి పండు ఫలం వాయనమిచ్చి తగిన దక్షిణతో తాంబూలమిచ్చిరి. ఇదంతా చూచి పుణ్యవతి, భాగ్యవతి, చేరబోయి "అమ్మలారా! మీరు యెవరు? నోస్తున్న నోమేమిటి?" అని అడిగిరి.

'మేము ఋషికన్యలము; నోము నోచుకుంటున్నాము. నోము మహిమ చాలా గొప్పది.' అని చెప్పి వారు, "మీరెవరు? ఇక్కడికెట్లా వచ్చినారు?" అని బదులడిగిరి. అడిగితే, మేము బ్రాహ్మణ కన్యలము. నాపేరు పుణ్యవతి, యీ చిన్నదాని పేరు భాగ్యవతి. మా కథ యిది అని వెనుకటి సంగతి అంతా తెలియజెప్పి, మాకు మిమ్ము చూడడంచేత పుణ్యం కలిగింది. ఈ నోము మేము కూడా నోచుకుంటాము. మాకు కొంచెం గొప్ప సహాయం చెయ్యండి అని వేడగా, ఆ ఋషి కన్యలు జాలి తలచి, 'సహాయానికేమి, అట్లాగే, నోచుకోండి అమ్మలారా' అని చెప్పిరి.

పుణ్యవతి భాగ్యవతి, ఆ బావిలో స్నానం చేసి, అక్కడనే చిన్న అరుగు వేసుకొని, పిండితో దేవుణ్ణి నిలిపి, దీపం పెట్టుకొని, భక్తిపూర్వకంగా పత్రం పుష్పం సమర్పించిరి. మర్రాకులు తమలపాకులుగాను మర్రికాయలు పోక చెక్కలుగాను, మర్రి వూడలు తోరాలు గాను, చేసుకొని కొలిచి, ఋషికన్యల దయ వల్ల లబ్ధమైనది బ్రాహ్మడికి వాయనమిచ్చి నోము నోచుకొని తోరాలు గట్టుకొని మర్రిచెట్టు కిందికి మళ్ళీ వచ్చి చేరిరి.

వచ్చేటప్పటికి మర్రిచెట్టు గొప్ప మాడి అయింది. అడవి అఖండ పట్నమయింది. ఎటుచూసినా వరహాల రాసులు మొహరీల రాసులు అయినవి. పుణ్యవతికి భాగ్యవతికి మహాభాగ్యం పట్టింది. ఊడిగాలు చేసే వారు, ఒదిగొదిగి ఉండేవారు, ఎందరో ఏర్పడ్డారు. అక్కడ బ్రాహ్మడు ఊరంతా తిరిగి ఉపాదానమెత్తి బియ్యం మూటగట్టుకొని అతాన వచ్చి అడవి గానక, అడలుతూ ఉండేటప్పటికి, పుణ్యవతి. భాగ్యవతి, పంపిన దాసి ఒకతె పోల్చి కనుక్కొని దివాణం లోకి తీసుకొనిపోయెను. వారిద్దరు నమస్కారం చేసి కౌగిలించుకొన్నారు. బాహ్మడు అద్భుతపడి 'అమ్మలారా! మనకీ భాగ్యం యెట్లా కలిగిం'దని అడిగెను. "ఋషి కన్యలు కేదారేశ్వరుడి నోస్తూ వుంటే మేము వెళ్ళి చూచినాము. మేమూ నోచుకున్నాము. మర్రాకులు

తమలపాకులాయెను. మర్రికాయలు పోక్కాయలాయెను. మర్రివూడలు తోరాలాయెను. మర్రి మాడి అయెను. అడివి అఖండ పట్నమాయెను మేము నోచిన నోము ఫలమిట్లా ఆయెను " అని చెప్పిరి.

పుణ్యవతి, భాగ్యవతి, బ్రాహ్మడు, భోగభోగ్యాలనుభవిస్తూ ఉండిరి.

పిల్లలకిద్దరికి పెళ్ళియీడు వచ్చెను. ఆ బ్రాహ్మడు పుణ్యవతిని పొరుగూరి బ్రాహ్మణ పుత్రుడికి, భాగ్యవతిని పరదేశపు బ్రాహ్మణ పుత్రుడికి, యిచ్చి వివాహము చేసెను. పెద్ద పిల్లను అత్తవారింటికి పంపి, చిన్నపిల్లను చిన్నల్లుణ్ణీ యిల్లరికముంచుకొనెను. పుణ్యవతి పుణ్యాన భర్తకు మహైశ్వర్యం కలిగింది. వారక్కడ సిరిసంపదలతో తులదూగుతూ ఉండిరి. భాగ్యవతి, భర్త, యిక్కడ భాగ్యభోగ్యాలతో బహు సంతోషిస్తూ ఉండిరి. తర్వాత కొన్నాళ్ళకు తండ్రి దైవగతి పొందెను.

ఒకానొకనాడు స్నానానికి నీళ్ళిస్తూ ఉండగా భాగ్యవతి చేతనున్న తోరపుదారం చూచి యిదెందుకు కట్టివావని పెనిమిటి అడిగెను. ఆమె "కేదారేశ్వర వ్రతం నోచుకొని తోరం కట్టుకొన్నా ననెను. తులలేని బంగారునగలుండగా తోరాలు దారాలు కట్టుకోవడమేమిటని, ఆతడు కొరకరాని కోపంతో ఆ తోరం తెంచి దగ్గిరనున్న కాకరపాదు మీద విసరివేసెను. ఎండిపోయివున్న ఆ కాకరపాదు యేకంగా చిగిర్చి పూవులతో పిందెలతో అంతలో అభివృద్ధికి వచ్చెను. ఆనాడే ఇల్లు కొల్లగొట్టి దొంగలు దోచుకొని పోయిరి. కొన్నాళ్ళకు పట్నమున్నూ పరరాజుల పరమయ్యెను. భాగ్యవతికి పెనిమిటికి పట్టెడన్నానికి కూడా లేకపోయెను. అప్పటికి వొక కుమారుడు కూడా వారికి వుండెను. తినన్నం కట్టగుడ్డాకూడాలేక ఆ ప్రాంతాలనే వారు, పూవులమ్మిన అంగళ్ళనే పుల్లలమ్మినట్టు ఉపాదానం చేత జీవిస్తూ వుండిరి.

ఒకనాడు భాగ్యవతి తన బాలుణ్ణి పిలిచి నాయనా! అన్నానికి లేక అవస్థపడుతున్నాము. మా అక్కఫలాని పట్నంలో భాగ్యవంతురాలై వున్నది. నీవైనా అక్కడకుపోయి సుఖాన జీవించమనెను. ఆ కుర్రవాడు అట్లాగే బైల్దేరి కొన్నాళ్ళ కావూరు చేరెను. ఎట్లాగో కష్టపడి పెత్తల్లి యిల్లు చేరి తన సంగతి తెలియజేసెను. పుణ్యవతి వచ్చి పుత్రుణ్ణి తోడుకుపోయి యిదేమి కర్మం నాయనా! అని అడిగెను.

పుత్రుడు చెప్పిన వైనం :— "అమ్మా మా పట్నం పరరాజుల పాలైంది. సొమ్మంతా దొంగలు దోచుకున్నారు. మా నాయన వుపాదానం యెత్తుతున్నాడు. ఆ పూటకు చాలిచాలక అవస్థపడుతున్నాము. మా అమ్మ మీమాట చెప్పి యిక్కడకు పొమ్మంటే వచ్చినాను." అనగా పుణ్యవతి చాలా దుఃఖించి కొమారుడికి తలంటి నీళ్ళు పోయించి, పనువైన బట్టలిచ్చి, పంచభక్ష్య పరమాన్నాలు పెట్టి ఆదరించెను. నాలుగైదు రోజులు గడచిన తర్వాత "నాయనా! మీ అమ్మ మీ నాయన యేమి అవస్థ పడుతున్నారో యీ సొమ్ము యిచ్చిరా" అని యిన్నూరు వరహాలు మూటగట్టి, అడుగున అరిసెలు గట్టి ఆకలైనప్పుడు తినుమని చెప్పి అంపించెను. ఆ కుర్రవాడు వస్తూ వుండగా దోవలో చెరువు కనిపించెను. కొంచెం నిలిచి ఆకలి తీర్చుకుందామని, మూట చెట్టుకొమ్మకు తగిల్చి చెరువులో కాళ్ళు ముఖం కడుగుకు రాబోయెను. ఇంతలో గద్ద వచ్చి ఆ మూట కాస్తా యెగదన్నుకుపోయింది. అయ్యో అని అడలుతూ కుర్రవాడు తిరిగి పెత్తల్లి దగ్గిరకు వచ్చి జరిగిన సంగతి చెప్పెను.

పుణ్యవతి చింతించి 'అయ్యో కేదార వ్రతం ఉల్లంఘన చేసిందేమో మా చెల్లెలు! లేకపోతే యిదేమి గతి!' అనుకొని పల్లకి మీద తానూ ప్రయాణమయ్యెను. పిల్లవాణ్ణికూడా పిలుచుకు పోయెను. ఊరిబైట ఒక తోటలో దిగి చెల్లెలిని చూడబోయెను. పిల్లవాడు వెళ్ళి

తల్లితో చెప్పెను. అప్పుడు అప్పా చెల్లెళ్ళు, ఆలింగనము చేసుకొని దుఃఖపడిరి.

'నీకిట్లా పేదరికం రావడానికి కారణమేమిటి? మనము నోచిన నోము మహిమ అలాంటిదికదా! నీవేమయినా ఆ నోమును ఉల్లంఘన చేసినావా?' అని అక్క అడిగేటప్పటికి చెల్లెలు జరిగింది జరిగినట్టు చెప్పెను. అప్ప 'అయ్యో ఆ కాకరపాదు చూప'మ్మని అడిగెను. అప్పా చెల్లెళ్ళిద్దరూ ఆ కాకరపాదు దగ్గరకు వెళ్ళిరి. శోధించి చూచేటప్పటికి తోరము దొరికెను. ఆ తోరమును పాలగడిగి నేతిగడిగి, తోటలోనే పందిళ్ళు వేయించి పాలవెల్లి గట్టించి అప్పచెల్లెళ్ళు అఖండంగా నోము నోచుకున్నారు. పుణ్యవతి పుణ్యాన భాగ్యవతి మళ్ళీ భాగ్యవతి అయింది. పోయిన రాజ్యమున్నూ పొందుపడింది!

పరమేశ్వరు డిట్లా కథ చెప్పేటప్పటికి పార్వతీదేవి పరమానందభరితురాలై తానూ యీ నోము నోచెను. అఖండమయిన అయిదువ తనం పొందెను. ఋషికన్యలు నోచగా పుణ్యవతి భాగ్యవతి నోచిరి. పరమేశ్వరుడివల్ల కథవిని పార్వతి నోచింది. పార్వతి నోచగా ప్రపంచమంతా నోస్తున్నారు. ఈ నోము నోచినవారికి చెడని పదవి వచ్చును. పాడిపంటలు గలుగును. ఇష్టసంపదలు గలుగును. అష్టయిశ్వర్యములు గలుగును.

కథ చెప్పి ఆశీర్వదించి అక్షంతలు వేసేది.



# ఆంధ్రాభిమానం

( గంటసాల-ముక్త్యాల )

-వేటూరి ప్రభాకరశాస్త్రి

దివ్య కృష్ణా స్రవంతీ సౌమ్యవృష్టిజ
లాభివర్ధిత సస్యశోభితంబు
ఆహ్లాదజనక బౌద్ధారామక స్తూప
చిత్ర శిలాశిల్ప చిహ్నితంబు
ప్రజ్ఞాబలారోగ్య భాగ్య వైభవశాలి
వివిధవర్ణ ప్రజా విలసితంబు
మధ్యాంధ్ర దేశ సంపన్నాగరకతాది
సంస్కార సార లక్షణ విశిష్ట
మతి పురాతన పురరూప మతినవీన
భావ మానవ నిక్షేప, మేవమాది
గుణగణ విశిష్టమై చాల గణుతి కెక్కు
గంటసాల పురమ్ము సౌఖ్యముల కిమ్ము ॥

ఇమ్ము లెటింగి రాజ్యముల నేలిరి వాలిరి కృష్ణవేణి తీ
రమ్ములఁ, గర్సనంబున ధురంధురులై రి, యనేక సత్కృతుల్
నెమ్మినొనర్చి పేర్చిరి, గణించిరి యంచిత భోగ్యభాగ్యముల్
కమ్మదొరల్ చతుర్థకుల గౌరవవర్ధను లిద్ద కీర్తనుల్,
వ॥ అందు

గంటసాల, దేవరకోట, గంటసాల
పాలె, మనునూళ్లలోఁ జాల ప్రబలియుండి
రాఱు నూఱైన ధర్మంబు మీఱనట్టి
వారు పెక్కిండ్లవారు, వేమూరి వారు.

వ॥ అందు

వర్ణనీయుండు, కీర్తి ధౌరేయుండు-

సీ॥ మహాలక్ష్మమ్మా భర్త మహనీయ సత్కీర్తి
శాలి రామయ్య యే సరసు తాత
సీతాంబికా ప్రియుం డాతతవిభవుండు
వెంకయ్య యేదానవీరు తండ్రి
విపులతరైశ్వర్య వితరణ సత్కార్య
గణ్య సీతాంబ యేపుణ్య భార్య
కీర్తికి, లక్ష్మికి, నార్తరక్షణమున
కాప్తత, కీవి, కేయార్యుఁ డిరవు

అట్టి వేమూరి రామయాహ్వయుఁడు సదను
రక్తుఁ బిసిపాటి వెంకటరత్న నామ
ధేయ సిద్ధాంతి నర్థించి చేయఁజేసె
సర్వధారి పంచాంగమ్ము సక్రమమ్ము ॥

తిరుపతి, 16-10-47

చిరంజీవ, ఉభయకుశలోపరి—

ఈనడుమ నీవు పేళ్లతో వ్రాసినజాబు కనపడక వెతకడంలో ఆలస్యమయినది. నేడే ఆఫీసులో దొరకగా పద్యాలు వ్రాసిపంపుతున్నాను. అపతల వారిని ఎఱుగని వాడను నేను, వ్రాయడం గదా! సరిగా ఉన్నవేమో చూచుకొని మార్చ వలసి ఉంటే తెలుపుము. మార్చి పంపుతాను. ఇక్కడ అందరు క్షేమము. మీయందఱ క్షేమారోగ్యములు తెలుపుము. వీలుకలిగినపుడు ఒకసారివస్తే అన్నీ తెలుసుకోగలవు. అందుకై తొందర పడనక్కరలేదు. చి॥సీతారామయ్య సరిగా చదువుకొంటున్నాడు.

గ్రహించవలెను.

(సం॥) వే. ప్రభాకరశాస్త్రి.

చి॥ పిసిపాటి వెంకటరత్న సిద్ధాంతి
గంటసాల.

[గురుదేవుల రచన లిట్టివి, మాకు లభ్యము కాబో వనుకొన్నవి చాలా ఇటీవల మాకు లభించి, మా యీ వాఙ్మయ సేవకు చేయూత నిచ్చుచున్నవి. ఇట్టి రచనలను అభిమానముతో జాగ్రత్త పెట్టి, ఇంతకాలము పరిరక్షించి, నేడు వాటిని మా కందించుచున్న సహృదయు లందరికిని కృతజ్ఞతాభివాదము లొనర్చుచున్నాము. ఇవి అడపాదడపా శాస్త్రిగారు వారి వారికి వ్రాసి యుండిన లేఖల మూలమున వెల్లడె నట్టివి.

వేటూరివారికి బాల్య మిత్రులైన చల్లా సూర్యనారాయణశాస్త్రిగారి కడ ఇట్టివి పెక్కులుండెడివని వినికి. కాని అవేవీ ఇంతదనుక మా కందుబాటులోకి రాక నే పోయినవి. ఇటీవలనే వారి కుమారులు డా॥ చల్లా రామచంద్రశాస్త్రిగారు, పోయినవి పోగా, మిగిలిన వాటిని ఒక పాతిక లేఖలను మా కందించిరి. 1911-1950 ల నడుమ శాస్త్రిగారు చ. సూ. శాస్త్రిగారికి వ్రాసియుండిన ఆ లేఖావళిలో వారి వ్యక్తిత్వము, చెలిమి, ఆంధ్రాభిమానము, కవితా చమత్కృతి, పత్రికా నిర్వహణ పాటవము, బహుముఖప్రతిభ అపూర్వముగా వెల్లడియగు చున్నవి. వాటినికొన్నిటి నీ సంచికలో ప్రకటించినాము. దిగువ పద్య మందొకటి. సం॥]

శ్రీ గురుచరణం శరణమ్.

సీ. మరల నెన్నఁడు మాకు దొరకునో మోఁగడ
పాలక్రొవ్వెన్నలుఁగు ముక్త్యాలపెరుగు,
మరల నెన్నఁడు మాకు దొరకునో రాజర్షి
చంద్రమౌళిస్వహాలు సమ్ముఖమ్ము
మరల నెన్నఁడు మాకు దొరకునో బాలునవ్వు
వెన్నారు యువరాజు వెన్నెకల్ని
మరల నెన్నఁడు మాకు దొరకు మోరాజసౌ
ఖ్యమ్ము సంగీతాది దర్శనమ్ము
గీ. మొక్కవలితుఁడు నీకు ముక్త్యాలస్వామి!
వేలు వేల్పు నీకుఁ గృష్ణవేణి!
మరల వత్తు మిమ్ము దరిసింప, ముక్త్యాల
పత్తనమ్మ! పోయి వత్తునమ్మ!

వేటూరి-ప్రభాకరశాస్త్రి
2-10-25

# నాచన సోమనాథుని ఉత్తర హరివంశము - సవ్యాఖ్యానము

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[బహుకాలముగా ఆంధ్రపాఠకలోకము ప్రభాకరుల ఉత్తరహరివంశ వ్యాఖానమునకై ఉత్కంఠతో ఎదురు చూచుచున్నది. నాచన సోముని ఉత్తరహరివంశమును సంపూర్ణముగా పరిష్కరించి, అందు నాలుగు ఆశ్వాసములకు వారు వ్యాఖ్య వ్రాసియుండిరి. నాలుగైదు వందల పుటల మేరకున్న శాస్త్రిగారి యీ వ్యాఖ్యారచనను, పాఠ పరిష్కారమందిన సోముని మూలముతోను పరిశిష్టాదులతోను గ్రంథరూపమున తేవలెనని పూర్వము ప్రయత్నించితిమిగాని ఆర్థిక కారణముల వలన అప్పుడది సాధ్యపడలేదు.

ఇక ముందైన మీ అందరి సహకారమున అది సాధ్యమగునని, ప్రభాకరుల శతజయంతి (1988) నాటికైన ఆగ్రంథమును ప్రకటింప గల్గుదుముగాకని కోరుదుము. ఈలోగా వాచవిగా మా యీ "మణి మంజరి" మీకారచనలోని రుచిని చూపించు చున్నది. క్రింది పద్యములు శాస్త్రిగా రెన్నడో తమ నోట్సులో వ్రాసుకొన్నవి.—సం॥]

## ఉత్తర హరివంశ విశేషాలు

క. [illegible]
[illegible]
[illegible]
[illegible]

వేటూరి ప్రభాకరశాస్త్రి
చెన్నపురి 1915

క॥ [illegible]
[illegible]
[illegible]
[illegible]

# ఉత్తర హరివంశము

## ప్రథమాశ్వాసము

క. శ్రీ సర్వ మంగళాకుచ
వాసంతీ వకుళ గంధవద్వనమాలా
వాసుకి విలాస ! వేద
వ్యాసమునిమనోనివాస ! హరి హర నాథా !! 1.

వ్యాఖ్య :- శ్రీ యాంధ్రకవిత్రయిలో మధ్యముఁడు తిక్కన సోమయాజి హరిహర నాథునకు నర్పితముగాఁ బదునెనుపర్వముల మహాభారతము తెలిఁగించినాఁడు. తదనంతరము భారతశేషమనఁబడు హరివంశమును నాచన సోమనాథుఁడు, తన రచనము తిక్కన రచనముతోఁ గలయునని తలఁచి కాఁబోలును, తిక్కన తీరుననే హరిహరనాథాంకితముగానే తెలిఁగించినాఁడు. ఈ యర్థమునకు గా ఆశ్వాసావసాన గద్యములందు 'తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున' అనియు 'సోమనాథ ప్రణీతంబైన' అనియుఁ జెప్పుకొన్నాఁడు. ఇట్లు హరిహరనాథాంకితముగాఁ దెలుగునఁగవిత రచించినవారిలో బైచరాజు, వేంకటనాథకవి కూడ ముఖ్యుఁడు. అతఁడు తన పంచతంత్రిలో :

క. ఏచనవుగలదు హరిహర
సాచివ్యము నొంద నన్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు
నాచనసోమనకు నింక నాకుం దక్కన్.

అని చెప్పినాఁడు. హరిహరనాథుఁడని నెల్లూర నొకయర్చామూర్తి యుండెనని, హరిహరనాథాలయమని యక్కడ కోవెల కలదని జన శ్రుతికలదుగాని, యది ప్రత్యయితవ్యము కాదని శ్రీ వెంకటరాయశాస్త్రిగారు నిరూపించినారు. తిక్కన ప్రస్తుతించిన హరిహరనాథుఁడర్చామూర్తిగాక, తిక్కన తన హృదయమున సన్నిధానము కల్పించుకొనిన భావనామూర్తియే; తిక్కనసోమయాజి, యెఱ్ఱాప్రెగ్గడ, నాచన సోమనాథుఁడు ప్రబలముగా హరిహరాభేదవాదమును సమర్థించుటచేతఁగాబోలును ఆ కాలమునఁ గర్ణాటమున వెలసి చాలఁ బ్రబలిన ద్వైతమత మప్పుడు తెలుఁగునాఁట వెలయఁజాలక పోయెను. వారు ద్వైతవాదమును బ్రతిఘటించుటను, తిక్కన భారతావతారికాశ్వాసాద్యంత పద్యములందును, సోమనయుత్తర హరివంశ ద్వితీయాశ్వాసమునను, ఎఱ్ఱాప్రెగ్గడ, నృసింహపురాణ, హరివంశములందును చూడఁదగును. పాల్కురికి సోమనాథుఁడీ హరిహరాద్వైతవాదమును జాలఁ దెగడినాఁడు. (చూ. పరిశిష్టము 1-అ)

సోమనాథకవి పురాణగ్రంథమయిన యీ హరివంశమును నన్నయ వోలెఁ బ్రసన్నార్థమగు పురాణ శయ్యతోఁగాక తిక్కనతీరున నంతకంటె నింకనధిక మర్మకవితారచనా సంవిధానముగల ప్రబంధ శయ్యతో రచించినాఁడు. అట్లనుట కిందలి యాశ్వాసాద్యపద్యములొక ప్రధానోదాహరణము. కంద పద్యములే యయినను నివి గూఢార్థ విశేషములుగల యినుప గుగ్గిళ్ళు ఈ కందపద్యమున కర్థమిది :

శ్రీ, సర్వమంగళా, దేవుల కుచములమీఁద బండిగురివెంద, పొగడ పూలవాసనలుగల వనమాల మూలమునను, వాసుకి సర్పము మూలమునను విలాసములనుభవించువాఁడా ! వేదవ్యాసమహర్షి హృదయమున వర్తిల్లినవాఁడా ! హరిహరాభేదాత్మకుఁడ వగు నో యీశ్వరా ! అని సంబోధనము.

## విశేషాంశములు

శ్రీ, సర్వమంగళా, పదము లారంభమునఁ గూర్చుట రచయితృ, పఠితృ, శ్రోతృ ప్రముఖులకు శుభాభ్యుదయార్థము. "ఆపాదలంబినీమాలా వనమాలేతి భణ్యతే" అనియు, "తులసీ కుందమందార పారిజాతైశ్చ చంపకైః పంచభీరచితామాలా వనమాలేతి కథ్యతే" అనియు వనమాలా లక్షణోక్తులు కలవు గాని యిక్కడ వాసంతీ కుసుమ ప్రచురమగు నాపాదలంబిని మాలికయే గ్రాహ్యము. జాతిసర్పము (నాగుబాము) వకుళ, దమన, కపిత్థఫల, సుగంధముల వెలార్చుచుండుననుట లోకప్రసిద్ధము. కనుకనే యిక్కడ వాసుకి వకుళగంధి యనుట; వాసంతీవకుళ గంధములు రెండును వనమాలా వాసుకులకు రెంటికిఁ గూడఁ జెప్పవచ్చును. వేదవ్యాసమహర్షి హృదయమున 'హరిహరనాథుడు' వసించియున్నాఁ డనుటలో నావ్యాసులవారు రచించిన బ్రహ్మసూత్రముల పరమార్థ మద్వైతసిద్ధాంతపరమే యగునని. సోమనాథుని హృదయము. ( ఈతఁడు పూర్వ హరివంశమును దెలిఁగించెనా ? హరివంశ పూర్వోత్తర విభాగము లెట్టివి ? ఇత్యాదివిషయములు పరిశిష్టమునఁ జూచునది.) (చూ. పరిశిష్టము 1-అ)

[సశేషము]

---

[పరిశిష్టము1-అ]

మ॥ పరివాదాస్పదవాదమోదమదిరాపానంబునన్ మత్తులై
హరిమేలంచు హరుండ మే లనుచు నాహా కొందఱీ పొందెఱుం
గరు కైలాసనగంబునందు మును లేకత్వంబు భావించి రా
మురవైరిం బురవైరిఁ బాపుట మహామోహంబు ద్రోహంబగున్.

క॥ పదనాలుగు లోకంబులుఁ
బొదలింపం ద్రుంపవలసి పొడవులు రెండై
తుదిఁ దారొక్కటి యగుదురు
వదరలఁ జేయుదురు భేదవాదుల నెల్లన్. ఉత్తర హరివంశము. 2ఆశ్వా. 68,69

శా॥ ద్వైతభ్రాంతినివృత్తిఁ బొందఁగ నభేదబ్రహ్మబోధంబు సం
భూతంబైన నశేషబంధనములం బోఁద్రోచు సిద్ధాత్మున
ట్లాతం డమ్మెయి నాత్మతత్త్వ విదుఁడై యప్పాప చుట్టల్విని
ర్ధూతిం బొందఁగ నీల్గి బిట్టు నెగసెన్ దోయౌఘ మధ్యంబునన్

హరివంశము - పూర్వభాగము
ఆ 7-ప 46.

క॥ నీ పేళ్ళన్నియు యన్నియు
నా పేళ్ళను నో ముకుంద నాకు న్నీకున్
రూపింప లేదు భేదం
బే పగిదిని నిన్నుఁ గనుట యెఱుఁగుట నన్నున్.

క॥ నిను నొల్లక ననుఁ జేరుట
నను మెచ్చక నిన్నుఁ గొలుచు నరునకు నరకా
యనములుగఁ దెలిసి హరిహర
వినిరూపణతుల్య మతులు విభులేయెడలన్.

వ॥ అని పలికి పరమేశ్వరుండు......

హరివంశము - ఉత్తర భాగము 6. ఆ॥

శా॥ ద్వైతభ్రాంతి వికల్పితం బఖిలమున్ స్వప్నేంద్ర జాలోపమం
బై తూలన్ బ్రభు రజ్జు సర్ప సదృశ వ్యామోహ విచ్ఛేదనం
బై తత్త్వజ్ఞత యావహిల్లి యపరోక్షా భేద విఖ్యాత్న్య వి
ఖ్యాతుం గాంతురు నిన్ను నౌపనిషదుల్ కల్యాణ నారాయణా.

ఇక్కడ త్రైవిద్యులు (కర్మవాదులు), సాంఖ్యులు, యోగులు, శైవులు, పాంచరాత్రులు (శ్రీవైష్ణవులు), ఔపనిషదులు (అద్వైతులు), మాంత్రికులు ప్రస్తుతులైరి. ద్వైతుల విషయము ప్రస్తుతము గాలేదు. విద్యారణ్యుల ప్రాభవము ద్వైతమతోత్పత్తి, తత్ప్రాతికూల్యము తెలుగునాట నాటఁ జెల్లినది.

"హరి గుహాసురుఁ జంపె నది యాదిగాఁగ
హరి హరుఁ డన నొప్పె నంతియ కాక
హరుఁడగునే హరి యట్లయ్యెనేని...
కుంపక హరిహరుగుళ్ళ మీఁదటను
బంది యు నందియుఁ బరగంగ వలదె?
హరి హరుఁ డను మాత్ర హరియును హరుఁడు
సరి యని కొలుచు దాసరుల ఫాలమున
దిలకంబు నిడుబొట్టు దిరుమన్ను భూతి
వలదె వారికి..........
హరిహరనాథ శబ్దార్థ ప్రయుక్తి
హరి హరుఁడన నొక్కఁడనియెదేన్ వినుము.

* * *

కావున హరి హరాంగము లేకమగునె
యే వెంటఁ బొందుగా దున్నట్లుఁ గాక
విష్ణుండు శివుఁడు నా వేఱె శివాయ

విష్ణు రూపాయ నా వెండియు నంద
విను విష్ణురూపాయ విష్ణవే యనఁగ
మును మ్రోయుఁ దత్సూక్తి వినవె యంటేని
తలఁపఁ బ్రక్షిప్త సూక్తము గాక శ్రుతులు
పలుకునె శివుని రూపము విష్ణువనుచు.

పండితారాధ్య చరిత్ర-వాద ప్రకరణము.

ఉ॥ శ్రీయన గౌరినాఁబరగు చెల్వకుఁ జిత్తముపల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణు రూ
పాయ నమశ్శివాయయని వల్కెడు భక్త జనకంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

అన్న తిక్కన పద్యమును దలఁపున నుంచుకొని చేసిన ఖండనమాయనిపించుచున్నది పై సోమనాథుని రచన.

[పరిశిష్టము 1-ఆ]

హరివంశ పూర్వ భాగమును సోమనాథుఁడు తెలిఁగించి యుండునని కొందఱు తలఁతురు. తిక్కన సోమయాజి భారతమును హరిహరనాథాంకితముగాఁ దెలిఁగించిన తర్వాత భారత శేషమయిన హరివంశమును దాను దెలిఁగించి భారత గ్రంథ పూరణమును సోమన కావింపఁ దలంపుగొన్నాఁడు గాన భారతమునకుఁ దర్వాతఁ బూర్వహరివంశము విడచి యుత్తరహరివంశమును మాత్రమే యాతఁడు రచించియుండు ననఁగాదు. భారత రచనానంతరము తిక్కనయే హరివంశమును గూడ రచింప నారంభించి పూర్వభాగము మాత్రమే హరిహరనాథాంకితముగానే రచించి చనిపోగా, నెఱ్ఱాప్రెగ్గడ భారతారణ్య పర్వశేషము పూరించినట్టు సోమన హరి వంశోత్తర భాగమును బూరించెనని తలఁపఁదగును. కాని తిక్కన హరివంశమును దెలిఁగించుట, తిక్కన తర్వాతి లాక్షణికులుగాని కవులుగాని స్మరించినవారు గారు. కాన దానిఁ దిక్కనయే రచించి యుండు ననఁగాదు. పోనీ తిక్కన గాక తచ్ఛిష్యుఁడయిన మారనయో మిత్రుఁడయిన కేతనయో మఱొకరో రచించినా రనఁగూడదా యనఁగా నట్లును ననుట న్యాయ్యముగాఁ దోపదు. ఏలనఁగా, హరిహరనాథాంకితముగా గ్రంథముల రచించినవారు తిక్కన, నాచన సోమన, తర్వాతఁ దాను మాత్రమే యని బైచరాజు వేంకటనాథుఁడు చెప్పినాఁడు. కాఁగా సోమనాథుఁడే పూర్వ హరివంశమును గూడ రచించి యుండవచ్చు ననవలెను. అట్లనుటకు సాధన మొక్కటే యున్నది. దానిని శ్రీ నడకుదుటి వీరరాజుగారు వెల్లడించినారు. అది యిది.

..."సోముఁడు పూర్వ హరివంశమును రచించిన ట్లొండు రెండు నిదర్శనములు గానవచ్చు చున్నవి. శ్రీ మదోగిరాల జగన్నాథ కవిరాజు గారు తమ సుమనోభిరంజన కావ్యము వ్యాఖ్యానమున నాచన సోమనాథుని యీ క్రింది ప్రయోగము నుదాహరించినారు." శతతాళదఘ్న హ్రదమున నుఱికెన్ "-సుమ, ద్వి 48 వ్యాఖ్య"- ఈ పాదముగల పద్య ముత్తర హరివంశమున లేదు. ఇది శ్రీ కృష్ణుఁడు యమునానది యందలి కాళియనాగరాజు హ్రదమున నుఱికిన ఘట్టములోనిదని తోఁచుచున్నది. నలువదిమూఁడేండ్ల క్రిందటఁ గవియే ముద్రింపించుకొన్న గ్రంథములోని దీ యుదాహరణము. ప్రక్షిప్త మనుటకుఁగాని, లేఖకప్రమాద మనుటకుఁగాని వలనుపడునదిగాదు. కాళియుని మడువున శ్రీ కృష్ణుఁ డుఱికినది పూర్వహరివంశములోని కథయై యున్నది." -పదమూడక్షరముల

యీ చిన్న పలుకును బట్టియే ఇదమిత్థ మనఁగా దనుకొందును. ఎఱ్ఱాప్రెగ్గడ పూర్వ హరివంశకథలో కాళియుని మడుగులో శ్రీ కృష్ణుఁ డుఱుకుట చెప్పుటలో "శతతాళ దఘ్న హ్రద" పదములేదు. సంస్కృతముననులేదు. అంతేకాక 'శతతాళ దఘ్న'మను పేరుగల హ్రదము కథ పింగళి సూరన కళాపూర్ణోదయములో నున్నది. అందు 'శతతాళ దఘ్నహ్రద' పదమే ఉన్నది. జగన్నాథ కవిగారు. అప్పకవ్యాదులు కవుల పేళ్లను రచనములను దార్మాఱుగా నుదాహరించిన ట్లిదియు ప్రమాదపతిత మేమో! ఇట్లు నే ననుటకుఁగారణ మేమనఁగా లక్షణ గ్రంథము లలో నాచనసోముని యుత్తరహరివంశ పద్యము లనేకము లుదాహృతములయి యున్నవిగాని పూర్వ హరి వంశములోనిదిగా నొక్క పద్యమును గానరాదు. సోమనాథునిదిగానే 'ఆపాద శిరోలంకారాపాదితే' త్యాది పద్య మొకటి లక్షణ గ్రంథములలో నున్నది. అది ప్రథమాశ్వాసాంత పద్యములలోనిది కాఁదగును. ఆశ్వాసాది పద్య ములలోఁ దప్పక హరిహరనాథ నామ సంబోధనము గలదు. హరివంశములోనివని, యుత్తర హరివంశములోని వని యుదాహృతములయిన పద్యము లెల్ల నిని తక్క నుత్తర హరివంశములోనే ఉన్నవి. అప్పకవి యుదాహరిం చిన పద్యమొక్కటి మాత్ర ముత్తర హరివంశమునఁగానరాదు. అదియిది.

శా॥ నాతో మార్కొనలేరు నిర్జర పురీ నాగేంద్ర బృందారకా
రాతుల్ మున్నుగ దేవ సంఘములు పోర స్థిర సంగ్రామకుం
డీ త్రైలోక్యమునందుఁగల్గఁడు రణం బెచ్చోట లేకుండఁగా
జేతుల్ వేయు వృథా భరం బగుచు వచ్చెన్ దేవ యిమ్మేనికిన్

ఈ పద్య ముత్తర హరివంశ పంచమాశ్వాసమున బాణాసురుని కథలో నుండఁదగినది. దీని కదే స్థానము. కాని యితరత్రగాదు. కాని యుత్తర హరివంశపు వ్రాతప్రతులలో నీ పద్యము గానరాదు. వ్రాత ప్రతుల నుండి తొలఁగి పోయినదో, ప్రక్షిప్తమో అయి యుండును. కొందఱు లాక్షణికులు తమకు సమ్మతము లయిన లక్షణముల కనుగుణముగా ప్రసిద్ధ ప్రాచీన కవుల కృతుల పేర స్వయము కల్పించిన పద్యముల నుదా హరించుట కలదు. ఇది యట్టిదియేని కాఁదగును.

సోమన యుత్తర హరివంశమును మాత్రమే రచించియుండెనేని దానికిఁ గృత్యవతరణికాదులను రచించి యుండఁడాయని యొక యాక్షేపము. ఎఱ్ఱన భారతారణ్య పర్వశేష పూరణమునకుఁ గృత్యవతరణిక రచింపలేదుగదా! అట్లే యీతడును రచించి యుండక పోవచ్చును. ఎఱ్ఱాప్రెగ్గడయు నీతఁడును సమకాలమువారును, సమీప దేశవాసులును గాన (ఎఱ్ఱన యద్దంకివాఁడు. సోమన గుత్తిదుర్గ ప్రాంతపుఁ బెంచుకలదిన్నె వాఁడు) కొంత పెద్దవాఁడును, ముందు భారత శేషమును బూరించినవాఁడును, నగునెఱ్ఱన హరివంశ రచనోప క్రమమును విని,యాతఁడు పూర్వహరివంశము రచించు చుండఁగా నీతఁ డుత్తరహరివంశమును బూరించి యుండవచ్చును. ఎఱ్ఱన యారణ్య పర్వశేషముంబోలె హరివంశమును దిక్కన రచనతోఁగలిపి హరిహరనాథాంకితముగానే రచించు నని యీతఁడిట్లు చేసి యుండవచ్చును. ఎఱ్ఱనకు రెడ్డిరాజుల యాశ్రయము హరివంశమును హరిహర నాథాంకి తముఁగావింప వీలు కల్పింపక పోవచ్చును. సోమననేలిన రాజు హరిహరుఁడగుట హరిహరనాథాంకితముగానే తత్పూరణమున కుత్సాహము గొల్పి యుండవచ్చును. ఇవియెల్ల నూహములే-ఎఱ్ఱాప్రెగ్గడ పద్యములకంటె మెఱుఁ గుగా నుండగలవని, తచ్ఛాయలతోఁ గొన్ని పద్యములు రచించినాఁ డనినేఁ దలఁతును. ఆయా పద్యముల నాయా ప్రకరణములలో జూపితిని.

# నా ఎరుకలో....

-డా॥ వేటూరి సుందరమూర్తి

మా నాయనమ్మ పిశుపాటివారి ఆడపడుచు. ఆవిడ వచ్చిన తరువాతనే మాఇల్లు వృద్ధి కావడంమొదలైందిట. అందుచేతనే పిశుపాటివారి సంబంధం అచ్చి వచ్చిందని మానాయనగారికి తిరిగి పిశుపాటివారి ఆడపడుచునే ఇచ్చి వివాహం చేశారని మా మేనత్త చెపుతూవుండేది. అదీగాకుండా మా అమ్మగారి సవతి అన్నగారైన పిశుపాటి వెంకటరామశాస్త్రిగారూ, మా నాన్నగారూ సహాధ్యాయులు చిన్నతనంలో వీరిద్దరు కలిసి కవిత్వం గూడా కొంత చెప్పినట్టు వినికిడి. వెంకటరామశాస్త్రిగారు చిన్నతనంలోనే చనిపోయినారు. వారు మంచిప్రతిభావంతులని మానాయనగారు అనడం నేను విన్నాను. మానాయనగారు ఈసంబంధం చేసుకోవడానికి వారి ప్రోద్బలం గూడా కొంత కారణము.

నగారు మాత్రం ఆమెను అన్నివిధాల ఇష్టపడే గాఢంగా ప్రేమించి చేసుకున్నట్టు అనేవారు. అప్పటికే నాయనగారు ఉద్యోగరీత్యా మద్రాసు వచ్చేశారు. అప్పుడప్పుడు ఆయన ఒక విషయం అనడం నాకు గుర్తు. కాపరానికి వచ్చిన క్రొత్తలో మాఅమ్మగారిని ఒకసారి కొట్టడానికి చెయ్యెత్తగా ఆమె ''నన్ను పెళ్ళి చేసుకుని ఇంతదూరం తీసుకురావడం కొట్టడానికా?' అని అడిగిందట. అంతే ఆతర్వాత ఆమెను పల్లెత్తుమాట గూడా అనేవారు గారట. మాఅమ్మగారి మొదటి పురుడు పుట్టింట్లో(ఘంటసాల) పోశారు. అది అచ్చిరాలేదు. తర్వాత నేను, మాచెల్లెలు పెదకళ్ళేపల్లిలోని మాస్వంత ఇంట్లోనే పుట్టాము. ఆతర్వాత మాపెద్ద తమ్ముడు ఘంటసాలలోనే పుట్టాడు. తర్వాత వారంతా మద్రాసు



మానాయనగారి వివాహం అయిన తరువాత మానసిక, శారీరక అస్వస్థతలకు గురి అయినారు. మా యింటిలోనివారు మొదట్లో ఆచీకాకులన్నిటికీ ఈవివాహమే కారణమని విమర్శించే వారని వినికి. మానాయ

లోనే జన్మించారు. ఇవి ఎందుకు చెప్పానంటే మాఅమ్మగారు వివాహం అయిన తర్వాత నాయనగారిని విడిచి పుట్టింటికి వెళ్ళిన సమయాలు వేళ్ళమీద లెక్కించుకోవచ్చు.

మాఅమ్మగారు పరమసాధ్వి. ఆమె నాయనగారిని అనువర్తిస్తూ ఆయనకు, ఇతరులకు, ఇంటికి వచ్చిన వారికి సకల పరిచర్యలు చేస్తూవుండేది. అందరినీ ప్రేమతో చూచేది. ఇంట్లో వారంతా ఆమెతో చాలా చనువుగా వుండేవారు. ఎటువంటి క్లిష్ట సమయాల్లో నైనా ఆమె చాలా నిగ్రహంతో ప్రవర్తించేది. అనేక సమయాల్లో కుటుంబ పరిస్థితులను చాలా చాక చక్యంతో నిర్వహిస్తూవుండేది. నా బుద్ధి తెలిసిన తరువాత అనేక సందర్భాలు నా మట్టుకు నాకే తెలుసు. వాటిని ఇక్కడ వెల్లడి చేయడం అంత సమంజసంగా తోచక వ్రాయడం లేదు.

నా చిన్న తనంలో మా నాయనగారు కోస్తా జిల్లాలలో తాళపత్ర గ్రంథ సంపాదనార్థం పర్యటన చేశారు. మా అమ్మగారు గూడా ఆయనతోనే వుండేది. నాకు రెండేళ్ళ ప్రాయంలో బంక విరేచనాలతో బాధపడ్డానుట, అప్పుడు నన్ను మా తాతగారి దగ్గర విడిచిపెట్టారు. అప్పటికి మా పెద్ద చెల్లెలు పుట్టింది. తర్వాత నాకు 7,8 ఏళ్ళు వచ్చేదాక మా ఊళ్ళోనే వుండేవాడిని. నాకు 5,6 ఏళ్ళు వచ్చేటప్పటికే మా తాతగారు చనిపోయేరు. తర్వాత మా మేనత్త, నాయనమ్మల పోషణలో కొంత కాలమున్నాను. మా చినతాత బాలకృష్ణశాస్త్రిగారు నా ప్రాథమిక విద్యాభ్యాసం, మంచి చెడ్డలు చూస్తూ వుండే వారు.

1926 లో మా పెద తండ్రి వెంకట శివశాస్త్రిగారు, పిన తండ్రి చంద్రశేఖరశాస్త్రిగారు జగ్గయ్యపేటలో ఉండేవారు. ఆక్కడికి 5 మైళ్ళ దూరంలో వున్న ముక్త్యాలలో మా చివరి పిన తండ్రి శంకర శాస్త్రిగారు ఉండేవారు. నన్ను చదువు కోసం మా నాయనగారి కోరిక మీద జగ్గయ్యపేటకు మా మేనత్త గారు తీసుకువెళ్ళి విడిచిపెట్టారు. అక్కడ మా పెద తండ్రిగారింట్లో ఉండి చదువుకోవడం మొదలు పెట్టాను. వీలైనప్పుడు కొంతకాలం మా పెద్ద పిన తండ్రిగారింట్లో వుండేవాడిని. అప్పుడప్పుడు ముక్త్యాల గూడా వెళ్ళి వస్తూవుండేవాణ్ణి. 1927 కాంగ్రెస్‌కి మా పిన తండ్రుల కుటుంబాలతో నేనూ మద్రాసు, వెళ్ళాను. ఆ తర్వాత 1928-30 మధ్య మద్రాసు లోనే చదువు ప్రారంభమయింది. మా నాయనగారు మొట్టమొదటి సారిగానన్ను వారు తొలుత తెలుగు పండితుడుగాపనిచేసిన 'కెల్లెట్ హైస్కూలు'లో తీసుకు వెళ్ళి చేర్చారు. 5 వ క్లాసు, 1 ఫారం అక్కడ చదువుకొని, మళ్ళీ అప్పటికి గుడివాడ ట్రాన్స్‌ఫర్ అయిన మా పెద తండ్రిగారి వద్దకు వెళ్ళి II ఫారం చదువుకున్నాను. ఆ తర్వాత 1931 నుండి మద్రాసు వెళ్ళి మళ్ళీ కెల్లెట్ హైస్కూలులో చదువుకోవడం మొదలు పెట్టాను. అప్పటినుంచి మా నాయనగారు పోయేంతవరకు దాదాపు ఆయన దగ్గరే వుంటూ వచ్చాను. ఈ కాలంలో ఆయన సాహిత్య వ్యాసంగం నుంచి విరమించుకుని యోగసాధనలో అనేక అపూర్వ అనుభవాలను గడించారు. నాకు జ్ఞాపకమున్న కొన్నిటిని గురించి ఇక్కడ వివరిస్తాను.

మద్రాసులో మా నాయనగారి యోగ మిత్రులు చాలా మంది వుండేవారు. వారంతా మాష్టరుగారి జన్మనక్షత్రం 'ధనిష్ట'కి ప్రతి నెలా ప్రణతార్తి హర అయ్యంగార్ (వారిని 'తాతి' అని పిలిచేవారు) ఇంట్లో సాయంత్రం ప్రార్థనకు కలుసుకుంటూ వుండేవాళ్ళు. ఆ సమావేశాలకు మేమంతా గూడా వెళ్ళేవాళ్ళం. అక్కడ వారివారి యోగానుభవాలను గురించి ముచ్చటించుకుంటూ వుండేవాళ్ళు. ఆ విధంగా మేము మద్రాసులో వున్నన్ని నాళ్ళు ప్రతినెలా ధనిష్టకి వారి ఇంట్లో కలుసుకోవడం పరిపాటి అయింది. నాకు బాగా గుర్తు 1928 లోనో 1929 లోనో మేము 15 నెం॥ వెంకట్రటంగంపిళ్లై వీధి ఇంట్లో వుండగా మా అమ్మగారు ఎత్తుగావున్న బల్లమీద నుండి విస్తరాకులు తీసుకుంటూవుంటే వాటిమీద బరువు కోసం పెట్టిన తిరగలిరాయి క్రిందకి జారి ఆమె బొటన వ్రేలు చితికి పోయింది. ఆమె స్పృహతప్పి పడిపోయింది. వెం

టనే ప్రణతార్తి హర అయ్యంగారు ఇంటికి కబురు పంపి పిలిపించారు వార్ని. ఆమెకు కొంతసేపు ట్రీట్ చేసిన తర్వాత తేరుకున్నది. అతర్వాత ఆమెను దగ్గరలో వున్న కార్పరేషన్ ఆసుపత్రికి రిక్షాలో తీసుకు వెళ్ళారు. వారు ఏదో కట్టుకట్టారు. రోజూ కట్టు కోసం వెళ్ళివస్తూ వుండేది కొంతకాలం. దెబ్బకన్నా వీళ్ళు కట్టే విధానం చాలా బాధగా వుండేదని అంటూ వుండేది. అది సర్దుకుపోయిన తర్వాత గూడా చాలా కాలం వరకు ఆ బొటనవ్రేలు ఏ తాకిడికి ఓర్చేది కాదు. అది మొదటిసారిగా మా ఇంట్లో ప్రమాదం జరగడం మా నాయనగారు, తాతగారు, ట్రీట్‌చేయడం నాకు గుర్తు. (ట్రీట్మెంటు అంటే యోగమార్గాన ఇతరుల శ్రేయస్సుని ఆరోగ్యాన్ని కాంక్షించి ప్రార్థన చెయ్యడం) తర్వాత మా పెద్ద చెల్లెలికి టైఫాయిడ్ వచ్చింది. దాదాపు నెలరోజులు పడకలో వున్నది. డా॥ నారాయణస్వామి రోజూ వచ్చి చూసి వెడుతూ వుండేవాడు. ఆ రోజుల్లో టైఫాయిడ్‌కి ఇదిమిత్థమని మందు ఏదీ వుండేది కాదు. ఆ 21 రోజులు గడిచి బయట పడాల్సిందే! రోజూ తాతిగారు, నాయనగారు ట్రీట్‌చేస్తూ వుండేవారు. ఇవన్నీ వెంకటరంగం పిళ్ళె వీధి 115 నెం. ఇంట్లో వుండగా జరిగినవి. తర్వాత అదే వీధిలో 15 నెం. ఇంటికి మారాము. మా నాయనగారు ప్రతి సంవత్సరం మేలోను, డిసెంబరు లోను కుంభకోణం వెళ్ళి వస్తూ వుండేవారు. వివిధ ప్రాంతాలనుండి యోగమిత్రులంతా కుంభకోణంలో సమావేశమై వారి వారి అనుభవాలను సమీక్షించుకొంటూ వుండేవారు. 1930 అక్టోబర్‌లో మా చిన్న తమ్ముడు ఈ ఇంట్లోనే పుట్టాడు. మా తాతగారు జన్మ తీసుకున్నట్టు మా నాయనగారి అనుభవంలో తెలిసిందట. ఈ విషయం అందరికి వెల్లడించి అప్పటినుంచి మా తాతగారి తద్దినాలు పెట్టడం మానేశారు. దీనిని గురించి అనేకమంది విమర్శించాడు. కాని ఆయన విశ్వసించిం దానిని నిర్భయంగా ఆచరించేవారు. ఆయనకి గోచరించింది అవునా? కాదా? అనే దానికి ఆయన అంతరాత్మే సాక్షి. ఆ తర్వాత అదే వీధిలో 117 నెం ఇంటికి మారాము. ఈ ఇంట్లో వున్నప్పుడే అనేక విచిత్రములయిన యోగానుభవాలు మా నాయన గారికి కలగడం, ఇతరులకు ట్రీట్‌మెంటు చేయడం విరివిగా మొదలయింది.

ఒకనాడు సాయంత్రం 5 గం॥ వేళ మా నాయన గారు ఆఫీసు నుండి ఇంటికి తిరిగివచ్చారు. మేమున్నది మేడ మీద. రావడంతోనే కాళ్ళూ చేతులు కడుక్కుని కాఫీ తీసుకోవడానికి కూచున్నారు. వాకిట్లో ఏదో కలవరం. మా పెద్ద తమ్ముడు అప్పటికి 7 ఏళ్ళ వాడనుకుంటాను. పిల్లలతో ఆడుకుంటూ వాకిట్లో వున్న బియ్యపు బస్తాల బండి వెనకాల వేళ్ళాడుతుండగా బండి వెనక్కి ఒరిగింది. ఆ బస్తాల క్రింద వాడు పడి నలిగిపోయాడు. ఇది చూచిన క్రింది ఇంట్లో వున్న నాయుడుగారు, వాడిని బస్తాల క్రింది నుంచి తప్పించి ఇంట్లోకి గోలపెడుతూ తీసుకు వచ్చారు. రొమ్ము ఎముకలు అప్పడానికి మల్లే అదుముకు పోయివున్నాయి. ఊపిరి పీల్చడం గూడా కష్టంగా వున్నది. వెంటనే వాడిని పైకి తీసుకు వచ్చి ట్రీట్ చేయడం మొదలు పెట్టారు. ఈలోగా సాయంకాలం ప్రేయరుకి వచ్చే మిత్రులంతా చేరారు. ఆ తర్వాత కొన్ని గంటలు వాడు నిద్రపోయాడు. ఆ పరిస్థితి ఎముకలన్నీ నుగ్గయిపోయాయేమో! అని అనుమానించాల్సిన పరిస్థితి. ఏ ఒడుదుడుకులు లేకుండా మర్నాటికి మెల్లిగా తేరుకుని ఆడుకోవడం మొదలుపెట్టాడు. ఆ తర్వాత ఏ చికాకులు లేకుండా కులాసాగా వున్నాడు.

ఒకరోజు సాయంత్రం నేను స్కూలు నుంచి ఇంటికి వచ్చాను. మా నాయనగారు ఆఫీసు నుండి తనతో కూడా మరొక వ్యక్తిని ఇంటికి తీసుకు వచ్చారు. ఆయన రొప్పుతున్నాడు. నీరసించి వున్నాడు. ఆయాసంతో కూర్చో లేడు, నుంచోలేడు. మా నాయనగారు సాధారణంగా కూర్చునే పడక

కుర్చీలో ఆయన్ని కూర్చో పెట్టారు. అప్పటికి కొన్ని రోజులనుండి ఆయనకు నిద్ర, ఆహారం లేదట. ఏమి తిన్నా అరగదు. డాక్టర్లు ఎక్కువ కాలం బతకడం కష్టం అన్నారట. ఉద్యోగం చేయడానికి శక్తి లేదు. రెండు రోజులు హాజరైతే మూడు రోజులు శెలవు. తర్వాత ఆయన పేరు T. N. రామచంద్రన్ అని తెలిసింది. రావడంతోనే ఏదో కాఫీ ఇచ్చి పడక కుర్చీలో కూర్చున్న వారికి ఆరోగ్యం కోసం ట్రీట్ చేయడం మొదలు పెట్టారు సాయంకాలం 6 గంటలైంది, ప్రార్థనకు మిత్రులందరూ వచ్చారు. పడక కుర్చీలో కూర్చున్న రామచంద్రన్‌కి నిద్ర పట్టింది ఆ రాత్రి మా ఇంట్లోనే భోజనం పడక. రాత్రి సుఖంగా నిద్రపోయారు. ఆ తర్వాత కొన్నాళ్ళపాటు మా ఇంట్లోనే మకాం. ఆరోగ్యం చక్కబడి ఆయన మళ్ళీ ఉద్యోగంలో చేరాడు రోజూ సాయంత్రం ప్రార్థనకు తదాదిగా మద్రాసులో వున్నన్ని నాళ్ళు వస్తూ వుండేవాడు. ప్రార్థన సమయాల్లో ఆయనకు కలుగు అనుభవాలు బోలెడు ! తర్వాత ఆయన ఆరోగ్యవంతుడై ఉద్యోగంలో అభివృద్ధి చెంది చివరకు జాయింట్ డైరెక్టరు ఆర్కియాలజీగా రిటైరైనాడు. ఈమధ్యనే ఆయన చనిపోయినట్టు తెలిసింది.

రోజూ ఇంటికి రావడం తోనే మా నాయనగారు వచ్చిన ఉత్తరాలు చూచి వెంటనే బదులు వ్రాయవలసిన వాటికి బదులు వ్రాసి నా చేతికిచ్చి పోస్టు చేయడానికి పంపించేవారు. ట్రిప్లికేన్ పోస్టాఫీసులో చివరి క్లియరెన్సు 6.15కి వుండేది. నేను పోస్టాఫీసుకి సరాసరి పరిగెత్తు కుంటూ వెళ్ళిపోస్టు చేస్తూ వుండేవాడిని. ఆసాయంత్రం మా పిన తండ్రిగారి వద్ద నుండి ఒక ఉత్తరం వచ్చింది. అందులో మాసన్నిహిత బంధువులలో ఒకరికి 'జలోదర'మని డాక్టర్లు ఏమీ లాభంలేదన్నారని, ఎక్కువ కాలం బతకడన్నారని, మా నాయనగారికి వ్రాశారు. ఆయనను ఏదో విధంగా మద్రాసు తీసుకు రావలసిందిగా వెంటనే బదులు వ్రాశారు. ఆ తర్వాత వారం రోజులకి ఆయన మద్రాసు వస్తున్నట్టు ఉత్తరం వచ్చింది. నాయనగారు స్టేషన్‌కి వెళ్ళి ఆయనను ఇంటికి రిక్షాలో తీసుకు వచ్చారు, రిక్షాలో ప్రయాణం ఆయనకి యమయాతన అయింది. ఇంటికి రావడంతోనే మనిషిని చూస్తే ఒక పెద్దబానకు చేతులు కాళ్ళు పుడకలు లాగా అతికించినట్టు మనిషి వున్నాడు. అప్పటికి ఆయనకు దాదాపు 30 సం॥రాలు వుండివుండవచ్చు. ఇంటికి రావటంతోనే మంచం వేసి మంచం మీద పడక ఏర్పాటు చేశాము. ఉదయం, సాయంత్రం, 2, 3, రోజులు నాయనగారు ట్రీట్ చేశారు. ఆకలి లేదు, ఆహారం తినే స్థితిలోలెడు. అటువంటివాడు 3వరోజు రాత్రి అంతా అల్పాచమానానికి లేస్తూనే తెల్లవారిందాకా కాలక్షేపం చేశాడు, నిద్ర లేదు. తెల్లారేటప్పటికి కొంత తేరుకున్నాడు. మళ్ళీ సాయంకాలానికి కాళ్ళూ, చేతులు, మొఖం నీరు కమ్మటం మొదలు పెట్టింది. రాత్రి అంతా అల్పాచమానం అవడం; ఇట్లా రెండు మూడు రోజులలో పొట్టలోని నీరంతా గుంజేసుకు పోయి పొట్ట తగ్గడం మొదలు పెట్టింది. దీనితో విపరీతమైన ఆకలి కావడం మొదలైంది. ఆహారం హితవుగా తినడం మొదలు పెట్టాడు. మెల్లిగా కొన్నాళ్ళకు తనంతటతానే బజారుకు వెళ్ళి కావలసిన కూరలు తెచ్చుకుని కోరి చేయించుకుని తినడం ఆరభించాడు. ఒక 40 రోజులకి మామూలు మనిషి అయినాడు. ఆతర్వాత ఒక 40 సంవత్సరాలు బతికాడు. రోజూ ప్రార్థనకు వచ్చేవారి కందరకు ఇది చాలా విడ్డూరంగా కనపడేది. దీని వెనకగల పూర్వజన్మ వృత్తాంతమేదో నాయనగారికి గోచరించినది. చెప్పారుగాని నాకు గుర్తులేదు. ట్రీట్మెంట్ వల్ల ఆయన ఆరోగ్యం చక్కబడడమన్న అంశం మాత్రమే నా మనస్సు మీద ముద్రగొన్నది.

మేము 117 నెం॥ ఇంటినుండి 4 నెం॥ ఇంటికి మారాము. T. N. రామచంద్రన్ ఆరోగ్యవంతుడైన తర్వాత ఆయన సోదరికి క్షయరోగమని డాక్టర్లు నిర్ణయించారనీ, చాలా క్షీణదశలో వున్నదనీ తెలిసింది. అయన బావమరిది సోమదేవశర్మ నాయనగారి వద్దకు

వచ్చి ట్రీట్ చేయవలసిందిగా అర్థించాడు. సోమదేవ శర్మగారు పుర్వాచార పరాయణుడు, వేదం బాగా చదువుకున్న వాడు. భార్య మంచంలో నుండి కదలలేని స్థితిలో వుండటంవల్ల నాయన గారు, తాతిగారు 45 రోజులు రోజూ వారింటికి వెళ్ళి ట్రీట్ చేసి వచ్చేవారు. ఈ కాలంతో ఆమె శరీరంలో విపరీతమైన యాక్షన్ జరిగేదిట. క్రమేణ ఆరోగ్యం మామూలు స్థితికి వచ్చి లేచి తిరగటం, ఇంటిపనులు చేసుకోవటం మొదలు పెట్టింది. తర్వాత ఆరోగ్యాభివృద్ధితో పాటు సంతానాభివృద్ధి కూడా కలిగింది. దంపతులు సుఖంగా వున్నారు.

114వ నెం. ఇంట్లో వుండగా తరుచుగా విస్సా అప్పారావు పంతులుగారు వస్తూ ట్రీట్‌మెంటుకు సంబంధించి జరిగే వింతలన్నీ అతి సూక్ష్మంగా గుర్తిస్తూ నోట్ చేసుకొంటూ వుండేవారు. ఒకనాడు అప్పారావుగారు నాయనగారితో మోచర్ల రామచంద్ర రావుగారు ఒకసారి మిమ్మల్ని చూడాలనుకుంటున్నారని చెప్పారు. అప్పుడు వారికేదో అస్వస్థతగా వుండేది. సరే! రమ్మనండి అన్నారు. మర్నాడు అప్పారావుగారు వారిని వెంట పెట్టుకొని తీసుకు వచ్చారు. మొదట వారి అస్వస్థత ఏమిటో వివరించారు. నాయనగారు "అయ్యా మీరు బహువ్యాపకులు. రోజూ ఉదయం, సాయంత్రం మా ఇంటికి ప్రార్థనకు రావటానికి వీలు వుంటుందో వుండదో! అందుకని మీరు మూడు రోజులు వరసగా ప్రార్థనకు రండి. ఈ మూడు రోజులలోనే మీ ఆరోగ్యం చక్కబడుతుంది" అని చెప్పారు. వారు సరే నన్నారు. కాని వారు మర్నాడు అనివార్య కారణాలవల్ల ప్రార్థనకు రాలేకపోయారు. మూడవరోజు వచ్చి ఈ విషయం చెప్పారు. మళ్ళీ నాయనగారు "నేను మిమల్ని మూడు రోజులు వరుసగా రమ్మన్నాను, రాలేక పోయారు. ఈ రోజు నుండి అయినా మరో మూడు రోజులు రండి"అని అన్నారు. ఈ మాట అని అంతా ప్రార్థనకు కూర్చున్నారు. ప్రార్థనానంతరం రామచంద్రరావుగారితో "ప్రార్థనలో మీకు ఏమి జరిగింది? ఏమి ఏమి ఆలోచనలు వచ్చాయి?" అని అడిగారు. వారు బదులు చెపుతూ "నాకు కాలేజీ రోజులలో జరిగిన వృత్తాంతం జ్ఞాపకం వచ్చిం"దని చెప్పారు. అది ఏమిటంటే- ఆ రోజుల్లో కాలేజీలో వారి తెలుగు పండితులు శలవు మీద వారి వూరు వెడుతుండగా త్రోవలో దొంగలు తన్ని వారి వద్ద వున్నదంతా లాక్కున్నారట వారు తిరిగి కాలేజీకి రావడంతో కుర్రాళ్ళందరు దీనిని గురించే అనుకున్నారుట — ఈ వృత్తాంతం జ్ఞాపకం వచ్చిందని చెప్పారు. వెంటనే నాయనగారు "అయ్యా నేను ఒక తెలుగు పండితుడిని. అంతరాంతరాలలో నా మీద కూడా ఇటువంటి అభిప్రాయమే మీలో పని చేస్తున్నది. నా వల్ల మీకు ఏ విధంగా ఉపకృతి జరుగుతుంది?" అని అన్నారు. ఆ తర్వాత ఆయన మళ్ళీ రాలేదు.

మేము 4వ నెం॥ ఇంటికి వచ్చింతరువాత ట్రీట్‌మెంటు తీవత హెచ్చుగా వుండేది. ఇదివరలో ఒక్కొక్కరికి విడివిడిగా ట్రీట్ చేస్తూ వుండేవారు. ఇప్పుడు సామూహికంగా ప్రార్థన వేళ అందరికీ ట్రీట్‌మెంట్ జరపడం ప్రారంభమైంది. C.V.V. దివ్యానుగ్రహము ఒక్కసారి Thought ఇవ్వడంతోనే అందరిలోనూ పనిచెయ్యాలనే సంకల్పం మీద ఈచికిత్స జరుగుతూ ఉండేది. అలా ట్రీట్మెంటు గోరి వచ్చేవారి పూర్వజన్మ వృత్తాంతాలు T N.రామచంద్రన్ ప్రభృతులకు 'ఫినామినా'రూపంలో ప్రార్థన సమయములలో గోచరిస్తూ ఉండేవి. అవి వారు వివరించి చెపుతూ వుండేవారు. వారివారి బాధలకు నాయనగారు పరిష్కారం సూచిస్తూ వుండేవారు. తదభిముఖంగా వారి వైఖరులు మారితే సర్దుకు పోతూ వుండేది. అలా మారనివారు యథాపూర్వం బాధలననుభవిస్తూనే వుండేవారు. అటువంటి ఒకటి రెండు సంఘటనలు ఇక్కడ వివరిస్తాను, ఒక రిటైరైన డిప్యూటి ఎకౌంటెంట్

జనరల్ గారి కుమార్తె సంగతి చాలా వింత అయినది. మొదటి ఇద్దరు భార్యలు చనిపోగా సచ్చిదానందం గారు మూడవసారి మరల వివాహం చేసుకున్నారు. రెండవ భార్యకు ఒక కూతురు. రెండవ భార్య చనిపోతూ "నా నగలన్నీ నా కూతురికే పెట్టం" దని చెప్పి చనిపోయింది. ఆ తర్వాత వివాహం చేసుకుని రెండవ భార్య కోరికకు విరుద్ధంగా ఆమె నగలన్నీ మూడవభార్యకు పెట్టారు. కూతురునిబందరులో మ.శి. గారికుమారుడు మ. సీ. గారికిచ్చి వివాహంచేశారు. వివాహమైన కొంత కాలానికే ఆమెకు ఫిట్సు రావటం మొదలైందిట. అన్ని వైద్యాలు చేయించి చివరకు ఇక్కడకు తీసుకువచ్చారు. కొన్నాళ్ళు ట్రీట్‌మెంట్ చేసినా ఏమీ లాభం కనపడలేదు. ఆమె ప్రార్థనలో కూర్చొని "అదిగో అక్కడ భూమిలో చూడండి, బంగారపు ముక్క వున్నది" అనేది. పై మన్ను తీసి చూస్తే అక్కడ ఆ బంగారపు ముక్క వుండేది. ఇట్లా రెండు మూడు రోజులు జరిగింది. తర్వాత ఒక రోజు అర్ధరాత్రి నాయనగారికి ఈ క్రింది విధంగా గోచరించింది— ఈ అమ్మాయి తల్లి సూక్ష్మ శరీరంతో ఈమెను వేధిస్తున్నట్టు, దీనికి కారణం తండ్రి ఆమె బంగారు నగలన్నీ మార్చి ప్రస్తుతపు భార్య పెట్టుకోవడము అని తెలియవచ్చింది ఇది తెలియడంతోనే ఆ అమ్మాయి తండ్రిని పిలిపించి ఈ వివరమంతా తెలిపి దీని యాథార్థ్యాన్ని గురించి తెలియజేయమన్నారు. ఆయన ముఖంలో నెత్తురు చుక్క లేదు. ఈ విషయం ఎవరికీ తెలియదు గదా అని ఆయన ధీమా. చేసిన తప్పు ఒప్పుకోవడానికి మనస్సు సంకోచిస్తోంది. ఈయన ఒప్పుకున్నా భార్య ఒప్పుకోదాయె. ఆ సందిగ్ధావస్థలో వారు నిస్సహాయ స్థితిలో పడ్డారు. ఆ అమ్మాయి అస్వస్థత ఏదో తాత్కాలికంగా తగ్గినా పూర్తిగా నయం కాలేదు.

మరో సంఘటన; తిరుపతి దేవస్థానంలో ఉద్యోగిగా ఉన్న ఓ పెద్ద మనిషిని గురించి. ఆయన శరీర అస్వస్థత తొలగించుకోవడానికి మద్రాసు వచ్చారు. ఎవరో చెప్పగా నాయనగారి వద్దకు ట్రీట్‌మెంట్ కోసం వచ్చారు. ప్రార్థనలో కూర్చోగానే శరీరంలో విపరీతమైన సంచలనం ప్రారంభమయ్యేది. మధ్యలో గొర్రెల కాపరికి మల్లే కూతలు వేస్తూ ఏవేవో మాట్లాడటం మొదలుపెట్టేవాడు. "మీకొక గొర్రె కావలసివస్తే ఇస్తా నన్ను విడిచి పెట్టం" డంటూ ఉండేవాడు. ఈయన గురించిన పూర్వజన్మ వృత్తాంతం T N.R. నకు గోచరించింది. "అతను పూర్వజన్మలో 'గొంపల్లె' అన్న ఊళ్ళో ఒక 'కాపు' అని. ఇతను ఒక గొర్రెలకాపరిని తగాదాల్లో చంపాడని. తదనంతరం ఈ జన్మలో ఆ గొల్ల దెయ్యం పట్టి బాధిస్తోందనీను. ఈ వృత్తాంతాన్ని ఆ పెద్ద మనిషికి వివరించి దాని పరిష్కార మార్గమేదో సూచించారు. దానితో ఆయన బాధలు తగ్గినాయి. తర్వాత సుఖంగా ఇంటికి వెళ్ళి తన పని చూసుకుంటూ వచ్చాడు.

(సశేషము)



C.V.V

Namaskaram

వెఱవ వలదు. నెమ్మదితో,
కుదురుకొని-సాయంకాల
ము 6½ కు- త్రిప్రాంటును
రిసీవు చేసికొనవలెను. తె
పు ఉదయము 7½ ఘం॥ రి
8½ లోగా-తిరిగి-
ప్రతి దినము, రెండు వేళల
నిర్మల చిత్తము తో ప్రాక్టీ
సు చేయవలెను. మనసా
ర మా క్షేమము కై నేను కో

2

రుకొర్కి, ఇది. నా మా
ట అమాయకమయినది,
విశుద్ధమయినది, అనిమీ
రు నమ్మకే పోరని ఇది
వ్రాసినాను. సరిగా ఇ
ట్లే నన్ను విశ్వసించి C.V.V
అనుగ్రహమున మీ
రు పదిగా మంచి ఆరో
గ్యము పరయుదురుగాక
అని. C.V.V దివ్యానుగ్రహ
ము ఇట్లే నెగడుగాక యని
కోరుచున్నాను. ఇట్లు
మిమ్ము గాఢముగా ప్రేమించు మిత్రుడు. శేషు

(చల్లా సూర్యనారాయణశాస్త్రి గారికి ఒక సారి ఏక్సిడెంటు అయిందని తెలిసినపుడు వారి క్షేమారోగ్యాలను కోరి శాస్త్రిగారు వ్రాసిన లేఖయిది— సం॥)

# వేటూరి వారి వంశవృక్షము

అవనిగడ్డ తహశీలుదారువద్ద దాఖలు
20-7-1900

నాగన్న

సుబ్బన్న    భోగేశ (చినసుబ్బన్న)

నాగన్న    వెంకటభొట్లు    రామన్న    సుబ్బన్న

వెంటకభొట్లు    మూర్తి    శాస్త్రుల్లు (దత్తు-వెం॥భొ.కు)    నాగన్న    శాస్త్రుల్లు (దత్తు)    నాగలింగం    చలమన్న    బాపన్న    శేషాద్రి

నాగన్న    పద్మనాభుడు    సుబ్బన్న    అప్పన్న    జోగన్న    సుబ్బన్న    లక్ష్మన్న    పున్నయ్య    యానాది    గురుమూర్తి

వెంకట్రాయుడు    సుందరం    రామన్న    శాస్త్రుల్లు    చినసుందరం

వెంకటశివుడు    ప్రభాకరం    చంద్రశేఖరం    శంకరం    గురుమూర్తి    సుబ్బారావు    వెంకటేశ్వరరావు (దత్తు)

ఆంజనేయులు/    సుందరమూర్తి    గురుప్రసాదం    ఆనందమూర్తి/    వెంకటసుందరరామమూర్తి    సదానందమూర్తి/    సుందరశాస్త్రి    యోగానందు

Copied from the original and noted on 17-2-1952 - వే॥శం॥ 24 జులై, 1900 తేదీ వేటూరి సుందరశాస్త్రిగారు వ్రాసిన దానికిది నకలు - వే॥శం॥ అరజా నరసింహంగారు మునసబు సర్టిఫై చేయడమైనది. 4-6-1907 కొడాలి రామబ్రహ్మం కులకర్ణి వ్రాలు అని ఉన్నది.

# దక్షిణాంధ్ర బాలకుఁడా!

-వేటూరి ప్రభాకరశాస్త్రి

[ఈ క్రింది పద్యములు 1927 మే 'దక్షిణ ఆంధ్ర పత్రిక' అనే ద్విభాషా పత్రికలో అచ్చుపడినవి. ఆనాడు ప్రవాసాంధ్రబాలకుని సంబోధించి ప్రభాకరు లొసగిన సందేశము నేడు స్వరాష్ట్రమునందలి ఆంధ్రుడును పాటింపవలసినట్లుగా ఉన్నది. —సం॥]

గీ. తెల్గువాఁడవునాయనా! తెల్గువారు
చోళపాండ్య దేశమ్ముల నేలినారు;
మూఁడువందల యేండ్లకు ముందు, ద్రవిడ
రాజ్యమది యాంధ్రనాయక రాజ్యమ సుమి.

గీ. నాఁడువిచ్చేసి రా తెల్గునాటనుండి
కవులు వేశ్యలు పండితుల్ గాయకులును
క్షత్రియులు కోమటులు మంత్రి సత్తములును
రాతు లుద్యోగు లెల్ల తెలుఁగులవారు.

గీ. పెక్కురున్నారు మీయిండ్ల పేళ్లవారు
ఆంధ్రదేశమ్మునందిప్పు డందునందు
జ్ఞాతులేసుమి మీకు నిశ్చయముగాను
రక్తసంబంధముండె వారలకు మీకు.

గీ. తెల్గువాఁడవునాయనా తెల్గువాఁడ!
వేమిలాభము, నీ పేర్మి హెచ్చులేక
సగ్గుచున్నది ద్రవిడ దేశంబునందు
కారణంబేమియో యెఱుఁగవు గదన్న!

గీ. తేట తేనియవంటిది తెల్గుభాష!
మఱచిపోవుచునున్నావు మాతృభాష!
తల్లి చల్లఁగలేకున్నఁ బిల్లలకును
క్షేమమబ్బదు, పరికింప వేమి తండ్రి!

గీ. ఆంధ్రభాష యమృత మాంధ్రాక్షరంబులు
ముద్దులొల్కు గుండ్రముత్తియములు
ఆంధ్రదేశ మాయు రారోగ్యవర్ధకం
బాంధ్రజాతి, నీతి నభిలషించు.

గీ. అఱవ దేశమ్మునందుఁ గాపురముచేయు
చుంటి వైనను నీకున్న తొంటి కీర్తి
నిల్పుకొనఁజూడు మా తండ్రి కోల్పడకుము
తెల్గుముద్రను నీయందు దిద్దుకొనుము.

సీ. అద్భుతమైన కావ్యము సుమ్ము తిక్కన
భారతమ్మది నీవు పఠనసేయు
మందారమకరంద మాధుర్యమున భాగ
వతమున్న దది నీవు వల్లె వేయు
మనుచరిత్రంబన్న ఘనకావ్యమున్నది
నెమ్మదిగా వాని నేర్చుకొనుము
వేమన్న పద్యముల్ వేనవేలున్నవి
స్వయముగా నీవవి చదువుకొనుము

ఆవ్వయార్ నీతివంటిది సువ్వె సుమతి
కందశతకను దానిని కంఠపాఠ
ముగ నొనర్పుము; దినదినమును గ్రమముగ
నాంధ్రపత్రిక పఠియింపు మా కుమార !

# వార్తలు - విశేషాలు

## ప్రబంధ రత్నావళి

"మన ప్రాచీన సాహిత్యం కేవలం లేఖకుల వోపిక, శ్రద్ధమీద ఆధారపడి లిఖిత రూపంతోనే వుండవలసి రావడంచేత ఎన్నో గ్రంథాలు అంతరించిపోయాయి. ఎందరో రచయితలపేర్లే తెలియకుండా పోయేయి. లక్షణ గ్రంథాలలో పూర్వ సాహిత్యంనుంచి ఉదాహరించిన సందర్భాలలో ఏ ఒకటి రెండు పద్యాలతోనో అనేక కావ్యాల పేర్లూ, ఎందరో రచయితల పేర్లూమనకు తెలుస్తున్నాయి. అవిధంగా లభ్యమయిన పద్యాలను పెదపాటి జగన్నాథకవి "ప్రబంధ రత్నాకరము" పేరుతో సంకలించేడు. అది సమగ్ర రూపంతో దొరకలేదు. పేరుగాని, తుది మొదలుగాని లేని మరొక సంకలనం 'ఉదాహరణ పద్యములు' పేరుతో ఆంధ్రసాహిత్య పరిషత్తు భాండాగారంలో దొరికింది.

ఈ రెండు సంకలనములలోని పద్యములను గుచ్చి ఎత్తి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈ ప్రబంధ రత్నావళిని సమకూర్చారు. 1918లో మొదటిసారి ముద్రించబడింది రమారమి మరో 60 ఏళ్ళకు రెండో ముద్రణ వచ్చింది. చక్కని ముద్రణ, గెటప్‌లతో బైండ్ పుస్తకం. వెల: 15/– రూపాయలు."

## నీ తి ని ధి

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు అనువదించగా 1926లో ఆంధ్ర గ్రంథమాలా కుసుమంగా వెలువడిన ఈ గ్రంథం ఇప్పుడు శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి ప్రథమ కుసుమంగా ప్రచురించబడింది.

టిబెట్ రాజధాని లాసాలో టిబెట్‌భాషలో దొరికిన ఈ "నీతినిధి" చైనీయ భాషలోకీ, అందునుంచి 1749 ప్రాంతాలలో ఆంగ్ల భాషలోకీ అనువదించబడింది. దీనిని ఎవరో బ్రాహ్మణుడు సంస్కృతభాషలో వ్రాసి వుంటాడనీ, దీని మాతృక అలగ్జాండరుకు పూర్వం నాటిదై వుంటుందనీ ఇంకా అటువంటివే అనేక ఊహలున్నాయి ... సుందరమైన గెటప్‌తో 'నీతినిధి' విలువ 18 రూపాయలు.

'అవంతి'

ఆంధ్రప్రభ. దిన పత్రిక 10-12-82

## నీతినిధి

ఈ నీతి నిధికి మూలమైన సంస్కృత గ్రంథమేదో భారతదేశం నుంచి వేలసంవత్సరాల క్రిందటే చీనా దేశానికి చేరుకొని, చీనీ భాషలో అనువాదం పొందింది. ఆ భాషలోనుంచి అంగ్లంలోకి భావ సాంకర్యంతో పరివర్తితమై కొన్ని వందలసార్లు ముద్రితమయింది. ఆంగ్లంనుండి అనేక

పాశ్చాత్య భాషలలోనికి అనూదితమై అనేకముద్రణలు పొంది ప్రపంచ ప్రఖ్యాతి బడసినమహత్తర గ్రంథమిది. మన తెలుగులో ముద్రితం కావడం ఇది రెండవసారి మాత్రమే.

ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు అనేది ఒకటి ఏర్పడి పుణ్యము కట్టుకోవడంవల్లనే ఈ తరంవారి చేతికి ఈ నిధినిధి అందుతున్నది. దీన్నిబట్టి శ్రీ ప్రభాకరశాస్త్రిగారి రచనలన్నీ మళ్ళీ ముద్రితమవుతాయని ఆశించవచ్చు.

నైతిక ప్రమాణాలు దిగజారి, సమాజంలో క్రమశిక్షణ లోపించిన ఈ రోజుల్లో నిధినిధి వంటి ఉత్తమ గ్రంథాలు దేశానికి ఎంతైనా అవసరం. మానవ జీవిత నిబంధనలు తెలిపే ఈ గ్రంథం అందరికి అవశ్య పఠనీయమని వేరే చెప్పనక్కరలేదు. గ్రంథాలయాలలోనే కాక ప్రతి ఇంట ఉండదగిన అత్యుత్తమ గ్రంథమిది.

- ఉత్పల

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

2-3-1983

మణి మంజరి

## శ్రీ ప్రభాకర పరిశోధక మండలి. హైదరాబాదు.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి వాఙ్మయ సేవనూ, యోగాభ్యాస పద్ధతులనూ పరిశోధించే షాణ్మాసిక పత్రిక మణిమంజరి.

శ్రీ వేటూరి ప్రభార శాస్త్రి గొప్ప పండితులు. వారు తమ జీవితాన్ని తెలుగు సాహిత్య సమున్నతికి ధారపోసేరు.

వారి ఈ కృషి తెలుగువాడు మరవ లేడు. మరవకూడదు. వారి వాఙ్మయాన్ని పరిశోధించి సేకరించడం ఈవేళ నిజంగా చాల కష్టసాధ్యమైనది. వారి కథలు, వ్యాసాలు, పీఠికలు, ఉపన్యాసాలు, ఇతర రేతరాలు ఎప్పటివో, ఏయే పత్రికలనుంచో, మిత్రులనుంచో సేకరించాలి. ఆ మహాద్యమానికి అంకితం అయి శ్రీ ప్రభాకర పరిశోధక మండలి ఏర్పడడం అభినందనీయం. వారు తమ కృషిని తెలుగువారికి అందించేందుకు సాధనంగా 'మణి మంజరి' ని వెలువరిస్తుండడం ప్రశంసించతగివుంది.

—అవంతి

ఆంధ్రప్రభ. దిన పత్రిక 26-12-82

## వేటూరి ప్రభాకరశాస్త్రి స్మారక ట్రస్టు ప్రారంభోత్సవం

న్యూఢిల్లీ, నవంబర్ 28. కేంద్ర ఆర్థికశాఖ స్టేట్ మంత్రి శ్రీ యస్.బి.పి. పట్టాభి రామారావు నేడు వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియాల్, ట్రస్టుకు ప్రారంభోత్సవం చేశారు. ఈ ట్రస్టు వేటూరి ప్రభాకరశాస్త్రి జ్ఞాపకార్థం తెలుగు భాషా సాహిత్యాల్లో పరిశోధనలను ప్రోత్సహిస్తుంది. పరిశోధనా పత్రికను ప్రచురిస్తుంది. లైబ్రరీని, మ్యూజియంను నెలకొల్పుతోంది. వేటూరి

ప్రభాకరశాస్త్రి అముద్రిత రచనలను ప్రచురిస్తారని భావిస్తున్నారు. శ్రీ పట్టాభి రామారావు ఈ ట్రస్టు మొదటి ప్రచురణ 'నీతినిధి'ని నేడు విడుదల చేశారు. తెలుగు సాహితి తెలుగు సారస్వత సమాఖ్యల సంయుక్త ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం జరిగింది.

-ఈనాడు
29-11-1982.

## వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు ప్రారంభోత్సవం

### నీతినిధి ఆవిష్కరణం

గత నవంబరు 23వ తేదీ కొత్తఢిల్లీలో వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు ప్రారంభోత్సవం రమ్యంగా జరిగింది· ఢిల్లీ మహానగరంలోని ప్రముఖ ఆంధ్ర సంస్థలైన తెలుగు సాహితి, తెలుగు సారస్వత సమాఖ్యల సమష్టి ఆధ్వర్యవంలో సాగిన యీ మహాసభ ఆంధ్ర ప్రదేశ్ గెస్ట్‌హవుస్‌లో ఏర్పాటైంది. నగరంలోని ప్రముఖులు పలువురు ఆసభకు విచ్చేశారు. ఆంధ్ర సారస్వత సమాఖ్య అధ్యక్షులు గౌ॥ చెలికాని అన్నారావుగారు సభకు అధ్యక్షత వహించారు. కేంద్ర ఆర్థికమంత్రి మాన్యశ్రీ యస్.బి.పి. పట్టాభి రామారావుగారు ముఖ్య అతిథిగా విచ్చేసి ట్రస్టును ప్రారంభించి, ట్రస్టు వారి ప్రథమప్రచురణ "నీతి నిధి"ని ఆవిష్కరించారు· ఆ సందర్భంలో శ్రీ పట్టాభి రామారావుగారు తమ గురువర్యులైన ప్రభాకరశాస్త్రిగారి పాఠప్రవచన రీతి నుగ్గడిస్తూ ఆయన పాండిత్యాన్నీ, పరిశోధన పాటవాన్నీ, బహు ముఖీనమైన ప్రజ్ఞావిశేషాన్నీ మానవత్వ ప్రపూర్ణమైన హృదయాన్నీ స్నేహశీలాన్నీ కొనియాడేరు·

సభాధ్యక్షులు డా॥ అన్నారావుగారు ప్రభాకరులను సంస్మరించుకోగలగడం తమ భాగ్య విశేషంగా పేర్కొన్నారు· తిరుపతి దేవస్థానం శాస్త్రిగారిని మానవల్లివారిని వాఙ్మయారాధన కెన్నుకొని ధన్యమైనదన్నారు. తాళ్ళపాక వారి వాఙ్మయరాశిని ప్రకటించి ప్రచారానికి తేవడంలోనూ అన్నమాచార్యోత్సవాలను సరిక్రొత్తగా ఆరంభించి నిర్వహింపజేయడంలోనూ ప్రభాకరులపూన్కిని బహుథా శ్లాఘించారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ స్థాపనకుద్దేశించినపుడు వేటూరి వారుండగా తెలుగుశాఖ కేమిలోటు అని పాలకవర్గం తలపోసిందనీ, కానీ వారి అకాల అస్తమయంవల్ల అది ఊహగానే మిగిలిపోయిందనీ అన్నారు. తాము తిరుపతికి తిరిగివెళ్ళిన తర్వాత ఏ మ్యూజియం స్థాపనకోసం ఆయన అసువులు కోల్పోయినారో అద్దానికొక రూపకల్పన వారి పేరుమీదుగానే దేవస్థానంచేత చేయించే యత్నంచేయగల మన్నారు.

నాటి సభలో ఆవిష్కృతమైన "నీతినిధి" గ్రంథాన్ని గూర్చిప్రసంగిస్తూ డా॥ ఇలపావులూరి పాండురంగారావుగారు ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాల సాధనకు నీతినిధి ఉత్తమ సాధనమన్నారు·''Economy of human life" అని ఆంగ్లమూలానికున్న నామంకూడా పురుషార్థసూచకమే. అనీ అన్నారు· నీతినిధి అందరికీ అందుబాటులో ఉండవలసిన ఉత్తమ గ్రంథమని

పేర్కొన్నారు. తదుపరి ఆచార్య చాగంటి సుబ్బారావుగారు ప్రసంగిస్తూ నీతినిధికి పరమమూలమైన రచన సంస్కృతంలో కౌటిల్యుడు వ్రాసినదై ఉండవచ్చుననీ గ్రంథంలో వున్న ఆకరాలను బట్టి తత్కర్త "డాండమిస్" అనే నామాంతరంగల కౌటిల్యుడగునేమో పరిశీలించడం తగుననీ అన్నారు. నైతికంగానూ, విద్యావిషయకంగానూ ఆ గ్రంథానికున్న ప్రాముఖ్యాన్ని బట్టి ఆది ఆధునిక భారతీయ భాషలన్నిటిలోకి అనువదింపబడి అన్ని స్థాయిల్లోను ఉచితరీతిని పాఠ్యం కావలెనన్నారు.

పిదప ప్రముఖ రచయిత డా॥ వేమరాజు భానుమూర్తిగారు ప్రభాకరశాస్త్రిగారి మహనీయమైన వ్యక్తిత్వాన్ని స్మరిస్తూ తామెరిగిన సంఘటలను వర్ణిస్తూ ఆయన యోగసిద్ధిని పడసి ఆ సిద్ధి వల్ల తోటి మానవుల ఆర్తిని తొలగించడానికి పాటుపడిన ధన్యజీవి అనీ, మూర్తీభవించిన దయామూర్తి అనీ ప్రస్తుతించారు.

నాడు ఆరంభింపబడిన ట్రస్టు పక్షాన డా॥ వేటూరి ఆనందమూర్తిగారు ట్రస్టు ఆదర్శాలను వివరించారు.

సారస్వత సమాఖ్య తరఫున డా॥ ఆంజనేయులుగారు స్వాగతం పలుకగా తెలుగుసాహితి పక్షాన శ్రీ చక్రంగారు ధన్యవాదాలర్పించారు. ఉత్తేజకరంగా సాగిన ఆనాటి సభా కార్యక్రమాన్ని ప్రెస్సువారు ఉచితరీతిని సమీక్షించారు. సమాచార శాఖవారు చిత్రీకరించారు.

-ఒక విలేఖరి



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌరగ్రంథాలయశాఖ
సంచాలకుల ప్రొసీడింగులు-హైదరాబాదు-12,
ఆర్. సి. నెం. 2-ఇ 1/82 తేది 21—7—1982.

విషయము : పౌరగ్రంథాలయములు - 'మణిమంజరి' అను అర్థ సంవత్సర
పత్రికను కొనుగోలు చేయుటకు ఆదేశించడమైనది.

 

**Proceedings of the Director of School Education; A.P. Hyderabad :
R. C. No. 1672/S4/82 Dated 28-7-1982.**

**Sub : Commendation of journal "Manimanjari" for library use in the High School and Govt. Training colleges in the state-Regarding.**

 

# DECLARATION FORM

| | | | |
|---|---|---|---|
| 1. | Title of the journal | : | MANIMANJARI |
| 2. | Publication | : | Half-yearly (February and August) |
| 3. | Publisher's Name | : | Veturi Anandamurthy |
| 4. | Nationality | : | Indian |
| 5. | Address | : | 6/2RT (New) Vijayanagar Colony, Hyderabad - 500 457 |
| 6. | Place of Publication | : | " " |
| 7. | Printer's name and address | : | As at Col : No. 3 and 5 noted above |
| 8. | Printing Press | : | DAKSHIN BHARAT PRESS, Khairatabad, Hyderabad-500 004, |
| 9. | Status of the Journal | : | Owned by Individual ; Veturi Anandamurthy. |

Paper used for the printing of this book was made available
by the Government of India at Concessional rate.



# CONTENTS

# The Yoga School of KumbaKonam

**[We are publishing an article titled The YOGA SCHOOL OF KUMBA-KONAM keeping in view of strong pleas from a section of our readership to puplish articles conected with YOGA LINE of Master C.V.V.**

**Though we could not Identify the writer of this article, we are convinced that the writer could be the Late prof. Potaraju Narasimham of Presidency College Ed.]**

The purpose of this essay is to give a brief account of Master C.V.V. and the School of Yoga founded by him. It will not be out of place to refer briefly to Kaka Bhujandar Nadi and the Dhruva Nadi before giving a sketch of the Yoga School and its revered founder. These are two of the several Nadi grandhas in astrology which deal with predictions and life readings of human beings. It is not proposed to enter into the accuracy or otherwise of these predictions, etc., here.

**The Kaka Bhujandar Nadi**

The date of the original Kaka Nadi is not known but is stated to be about the beginning of Kali yuga or about 3,000 B.C. The nadi now extant (which is a copy only) was copied from the original in Kali 1,000, i.e., 2,102 B.C. It is in the form of a dialogue in Tamil verses between Kaka Bhujandar and the eigth Vasishta. From this it can be inferred that Bhujander had been the preceptor of seven Vasishtas prior to the Vasishta of this nadi.

The genesis of the nadi is described in the document itself. Once upon a time Bhujander attempted to see Brahman. Even after having crossed the seven traditional planes, (Maha Paranirvanic, etc.) he could not achieve his object having encountered with an adamantine wall on his way which impeded his further progress. Bhujandar sorely disappointed, gave way to lamentation. As if in response to his piteous cries, there arose a sound from behind this wall from which he understood that the time was not yet ripe for him to see Brahman, that he would get his opportunity when the origin is born in man form in the Kudanthai Kshetra (Kumbakonam) after the lapse of 27 Chatur yugas, and in the first yuga of Kali of the 28th chatur yuga. Bhujander then goes on to say that the Brahman would

be born in a spot to the East of the Kamakotipeetam adjacent to Bhagavad Ghattam on the banks of Kahar nadi (the Cauvery). He then gives in detail the planetary positions under which the Lord would be born. With the help of these details it is now possible to infer that the founder of the Yoga School at Kumbakonam should have been the incarnation referred to by Kakar.

The copy of this Nadi that is extant in our Presidency is written in Tamil verse. It deals with horoscopes as its other sister nadis. But the remarkable feature that is peculiar to this nadi is that it gives such details of the horoscope readings that it is impossible for an ordinary astrologer to foretell, viz], the name of the place of birth, the accurate time of birth, the name of the native, description of the profession, etc., with great precision. But the purpose of this nadi seems mainly to unravel the the mysteries of this New Yoga. The horoscopes so for scrutinised relating to the members of the School of Yoga reveal the greatness of this nadi. The depth of the knowledge of the author is remarkable. It is all-sided and superhuman. This nadi though mainly written in Tamil, indulges in the use of various words relating to other languages like Canarese, Telugu, Hindustani and a large number of English words. And what is more, a number of the verses are composed with the names of the several courses of yoga which Master distributed for proctice to tee mediums.

The courses are given mostly in words (sounds) of English and a few in Sanskrit. The critical reader may wonder as to how an ancient nadi like this could contain pure English words of a post Chaucerian character. This may throw a doubt on the genuineness of the work. But the facts are there to judge. This nadi reveals to us the greatness of the Master to some extent. He is discribed as the very Brahman Himself — the Creator of the Universe.

**The Dhruva Nadi**

In the other nadi — the Dhruva nadi- the Master's horoscope is described in very eloquent terms. The author of this nadi is Satyacharya who flourished about 500 A. D. He is referred to in the Brihathjathaka by Varahamihira. The latter lived around 600 A. D.

Master C. V. V. was born on the 4th day of August 1868 at Kumbakonam in the District of Tanjore. Who could have foreseen that this little child was a Mahatma of Brahmasam— the Virat— who took birth in the physical for the establishment of a New Line of Evolution in Creation? He was born in a Niyogi Brahmin family of Saivite persuasion. The birth took place in his father's house in a town with a river flowing on either side of it, studded with many temples and consisting of a popular of defferent casts and creeds. He was a yogi in his previous life. He is equal to a Virat. He will obtain the knowledge of Brahma Loka throuh

his second wife. The native will practice an unheard of yoga. It is **Briktha yoga**, that he attains and practises in conformity with the current times. The planets rule according to his bidding. His amsam is that of Brahma. He is a Mahatma. He is an equal to Brahmavatar. He transforms those as his equals who bow to him in obeisance. He conquers death and old age by his yoga. He reigns over Brahma Loka.

The Kakar nadi, on the other hand describes the native as the very Brahma of the New Evolution. It refers to the advent of the Halley's Comet in 5,011 of Kali Yuga. This is the time when the revered Master C.V.V. started his Yoga School on 29th May 1910 at Kumbakonam in his 42nd year. The Yoga is called Brikta Rahitha Tharaka Raja Yogam. The yoga courses were distributed for practice to the initiated members of the school during the span of the next 12 years until 31 January 1922. There were 16 General Calls by Master during which the members— called the mediums — used to gather for the purpose of receiving instruction and courses for practice. The General Calls were usually held at Kumbakonam in the premises of the Yoga school. Master himself spent some time in 1917 with his mediums at Madras. A total number of 752 mediums were initiated by Master during the span of these 18 years. The mediums initiated up to the end of 31st January 1922 from the beginning fo the school were grouped together into the Olidere group. The admissions were finally closed after 31st January 1922. Three members were, however initiated by Master subsequently and they were grouped as the Master's Link. It was ordered by Master to practise the last course, viz.. OLIDERE 111 Name— prescribed by him until further advice. On 12th May 1922, Master has dissolved Himself into the elements bidding Ether 'to work out' the rest of His Glorious Plan. The further advice and the time of His Returning can be revealed to us by Him alone. The Kakar nadi refers to this event in its verses. The nadi states that the planets have no influence over this native after his 54th Year.

There are some hints directly given out by Master to enable us to determine the time for the fruition of the Yoga after His disappearance. It has been told that there will be a change in the Moon. There will be an appearance of a Comet before the advent of Master. The comet will appear near Neptune and this will be the time for the gatheting of the mediums. As an evidence of the coming comet, there will irradiate from the Kundalini of the mediums, the Jyothi of Master. His form will be seen by the mediums along with the comet The face of the Earth changes on account of frequent earthquakes before the fulfilment of the Line. The shaking will be so much and so frequent that the Earth will increase in its mass and as a

consequence there will be an elongation in the duration of the day from 24 to 30 hours. And this will produce dislocation of the planets and a rearrangement of the whole cosmic order. The inclination of the axis of the Earth will also undergo change. New lands will appear in the ocean-beds.

It is also said that there will be a perception of Light and a 'memory flash' followed by sound before the completion of Master's work. And until then it tells the mediums to remain silent. The earth will be self-luminous and there will be two Moons to the Earth— the present Moon and Venus. These changes are said to happen at the commencement of the direct working of the Line.

There are references to the Theosophical Society founded by Col. Olcott and Madam Blavatsky in 1873 at Newyork. There are also references to Mrs. Annie Besant and Mr. Leadbeater. It is said that the members of the T. S. will join the Yoga School to get the benefits of this yoga. There are also references to Suddha Dharma Mandalam of N. India and the Order of the Star.

The principles of the school have been explained by Kaka Bhujandar with reference to music symbols, ragams of Indian music, science of drumming, games of cards and other things.

Master appears after breaking the present silence as he was before. It is said he will make his appearance to his disciples at the dead of night on a certain day which he alone would reveal. It is punningly stated by the author who interrogates :— "Dost Thou appear in the dead of night, because Thou thinkest that the world is full of sinners and that they should not see Thee ?".

Regarding the time, manner and sequence of development, Master has given us some illustrations :—

Just as a hen knows the time for pecking at the shell of the egg to let out the developed chicken inside which is ready to come out, so Master knows the time to give the hint to his mediums about the moment of completion.

Another illustration given by him is that of the manufacturing of a watch in a factory. The necessary wheels, pinions, screws, etc., of a watch are made in different spots of the factory (in our case—the body); they are assembled together by the mechanic; the mainspring is wound and it is only when the final shake is given the motion begins and the conception of a working mechanism—as a watch—comes to us

There is a third illustration regarding the sequence of development which Master referred to—viz., the case of an Electric Installation for lighting purposes. The electric plant is installed for generating electricity. Posts are planted and connected with wires and bulbs are fitted. A main switch is fixed to connect the flow of energy with the wires and bulbs. When the switch is put on the

energy flows on rapidly through the wires and illuminates the different bulbs in quick succession. No doubt there is some interval between the lighting up of one bulb and another. But the process is so quick that it may be taken that all the bulbs were illuminated simultaneously, the difference of interval being very negligeble. So is the development of mediums at the time of completion.

The ideal of the Line is to make the people on this planet live in peace, with plenty, without want, disease, decay and death in Eternity in an immortal embodied state. It is to attain a state of 'Jivan Mukta' quite independent of the cosmic laws that govern all Life at present. The New Yoga is to usher in a Pure Merry Life bereft of all pain and misery. And the prophecy in the Corinthians "The last enemy that shall be destroyed is Death", wiil come to pass.

Like all other yogas, this yoga is also based on the rousing or kindling of "Kundalini". It recognises the seven abstract planes of Mahaparanirvanic, Paranirvanic, etc., but with this difference. The knowledge is not obtained here in the Samadhic state. It is obtained in the physical conscious state. The knowledge of the seven planes ia unified and made to act in one plane – say the eighth plane - an absolute physical plane of consciousness. Whereas the old yogas had not attached much importance to the eternal keep-up of the physical body, this yoga places it in the foremost of its principles. The body will be one self-created by the medium (yogi) by dint of practice of the yoga and therefore independent of ordinary creative factors and elements. A continuity or bridge will be established between the supra-cosmic states and the physical cosmic state. There is thus no room for delusion of any kind of phenomenon or abstractivism.

This yoga is not based on any ancient texts like the Upanishads, the Bhagavathgita, etc. It is unique and unparallelled in its conception. The existing knowledge shows us certain clear cut ways and means which have not been able to take man out of the vicious cricle of births and deaths with all the attendant want, pain, misery, disease, etc.. of life on this Earth.

"The old order changeth givlng
place to new,
Lest one good custom should
corrupt the world."

The world is ever-changing. There is nothing like a constant factor except perhaps in mathematics. The Law of Nature is dynamic. The in-flow of energy into the cosmos from the super-cosmic fields is perpetually though imperceptably effecting a change in the nature of things. Evolution is dynamic and not static.

The current philosophical truths which our ancient texts teach us, require to be carefully analysed and reassessed.

The categories — Immortality, Mukti, Existence, Karma, Nirvana, etc., have to be revalued. Thus according to this school 'Immortality' means the conquest of death 'here' and not a belief in not being born after death. The goal is not one of stopping 'births' or 'rebirths'. The foundation of any pragmatic philosophy should be on the factual world of experience. In the practical metaphysics of life, the conquest of disease, decay and death, want, misery, poverty, etc., should be included and an active attempt should be made to eliminate them from the aspect of all embodied life. The mere promise of a future heaven after death has become stale enough to give the necessary urge to life of man to live on in spite of pleasure and all the allurements of life here.

To realise Brahman would mean to attain Immortality in our sense of the term. It should be applied to things mortal. There is no meaning in applying it to things already immortal in their nature. What is mortal should be transformed into immortal. Man should acquire the knowledge of the Self— the immortal principle— in him. Death shold not be viewed as a permanent accident of all embodied life.

Mukti is freedom from re-births. The attainment of freedom from re-birth is a state which we cannot verify with our limited knowledge. We have a disembodied (non-physical) state after death. The continued state of embodied existence only Is knowable and verifiable. A mukta, therefore must be an embodied (physical) jivan mukta. It is a type of embodied life which is yet to come into existence. The prevailing ideas of a jivan mukta are in the abstract only (existing in idea merely).

Karma is commonly understood as the result of an action in the past life or birth. This presupposes a life before the present birth or rather a life after death. When the first life began to function or karma was acquired, it is futile to attempt to determine. If it has no beginning, it has also no end.

"Life and existence" should be understood as a unity and as not two separate categories. They are one concrete fact. It is this fact that has to be established by aiming at physical immortality. The immortality should be self-evolved and not dependent on external factors. This is real "Independency"— a state of existence which is unlimited by the cosmic laws governing life on this planet. It includes a self-creative power with self-direction and control. It is only such a state of embodied existence that can be called independent in any sense of the term. And such existence alone can be said to be the full expression of life capable of exhibiting all the qualities and potentialities of life and functioning as a complete unit by itself. This is the full efflorescence of life.

Again the values of attachment, renunciation, repression, etc., should

be reassessed in the light of the above theory. Neither repression of senses nor absolute self-control [are commendable. The desires are best controlled after full enjoyment. Else to suppress the desire by whatever means leads only to the lurking of the appetite though latently, and when the control is lost leads to disaster. Good and bad qualities are not absolute As heat and cold are the manifestations of the same energy though differently appellated, there is a dual aspect to every category.

Maya ordinarily means 'avidya' or illusion. Spirit and Matter are two aspects of Reality. Knowledge of these two aspects of Reality enables us to understand the unity in the diversity of things, in this Universe. To obtain this knowledge is to know Brahman Himself — the absolute cause of all creation. And this knowledge has to be obtained by **direct** method and means in the physical plane of consciousness.

**Purusha and Prakriti :** Purusha is positive, male factor and Prakrti is negative, femalefactor of the creation. The goal should be to attain a state of conscious union by each positive and negative factor— male and female. The state of Ardhanariswara— Siva with His Sakti united— is the ideal. The goal of Evolution points to the realisation of this ideal in the concrete Realm of Reality. It is then the Life-Everlasting of the Kingdom of Heaven could be established on Earth.

M.C.V.V. NAMASKARAM.



# A New Sanskrit work of Krishnadevaraya

—V. PRABAKARA SASTRI

Collected and annotated by
—M. PRABHAKARA RAO

[The Late V. Prabhakara Sastri, a well known scholar and researcher in the Telugu field concerned has contributed many a new fact for the study of the Telugu language and literature. In this research paper Sastriji has drawn the attention of the scholars to a new Sanskrit work, Viz., Sakalakathasara Samgraha of Srikrisnadevaraya, an hitherto unknown work for his contemporaries and supplied extracts from the above work.

This english paper it may be recalled was first published in the journal of Oriental Research, Madras, an official organ of the Mahamahopadhyaya late Kuppuswami Sastri Research Institute, Vol. XIII, July-September, 1939 PP. 194-96.

The true translation of the paper in Telugu had appeared in the BHARATI, October 1939, PP. 393-94 under the title "Krisnadevarayulu-Sakala-Kathasarasangrahamu."

Again in Bharati, November, 1939, PP. 535-37 under the caption "Avilvi" Sastriji gave some more information regarging the, Sakalakathasarasamgraha and added another three new slokas at the begining to the extract which he had given earlier.

Moreover, in 1925 itself Sastrii published a paper entitled, "Srikrisnadevarayala Vidya Goshtulu" in the Bharathi, April 1925 PP. 65-69, in which the pages 68-69 speak of the Prapancadarpana" mentioned in the first para of the article.

The readers are requested to see the above references for clarification.

—M. P. Rao.

 

Krisnadevaraya states in his Amuktamalyada that he composed some works in Sanskrit' viz , Madalasacarita, Jnanacintamani, Sakalakathasarasangraha, Satyavadhuprinana and Rasamanjari. Some verses from the Rasamanjari and Satyavadhuprinana are cited in the Sanskrit anthological work called the Prapancadapana 1, in which, however, these

works are attributed not to Krsnaraya himself, but to his poet laureate Allasani Peddana. It may, however, be noted that, like other anthologies, this Prapancadarpana[1] also reflects cosiderable confusion regarding the authorship of works cited in it.

शेषक्ष्माधरनायकस्य कृपया
सप्तार्णवीमध्यगां
रज्ञन् गामिह कृष्णराय-
नृपतिर्जेयात्सहस्रं समाः।

A play ascribed to Krsnaraya, called the jambavatikalyana not mentioned in the Amuktamalyada, is found in the Saraswati Mahal library at Tanjore. A part of the Prastavana in this play is lost. But what remains of the Prastavana and the colophon makes it clear that Krsnaraya is the author of the work.

A new sanskrit work of Krsnaraya has been recently discovered in the Madras Government Oriental Mss. Library. The Ms. is a fragment containing only the introductory portion of the work. The names of the work and the author cannot be distinctly made out, but from the verses that are preserred, there can be no doubt that the work was written by Krsnadevaraya. From the drift of the verses we can make out the name of the work as the Sakalakathasarasangraha. In the Amuktamalyada, it is said that Krsnadevaraya culled out stories from Sruti, Purana, Upapurana and Samhita and composed the Sakalakathasarasangraha. The Ms mentioned above answers this description. Therefore I have identified it as the Sakalakathasarasangraha.

Krsnaraya states that he undertook to write this work at the command of his Guru Vyasa Tirtha. Vyasaraya is said to have been a Guru of Krsnadevaraya according to the Madhva litarary tradition; but no exact reference to this fact is found in any known historical work. It is note worthy that this fact is explicitly mentioned in the work composed by Krsnadevaraya himself. The poet Ayyalaraju Ramabhadra begain to compose in Telugu at the instance of Krsnadevaraya a big Vaisnawite Prabandha called Sakalakathasarasangrahamu, to be dedicated to the king, but owing probably to the unexpected death of the Raya, the work was not completed. This unfinished work is available in the Madras Government Oreintal Mss. Library. It can be inferred that this Telugu compilation of Ramabhadra is an adaptation of the Raya's Sanskrit work of the same name, mentioned in the Amuktamalyada, and written by the Raya at the instance of Vyasaraya as is known from the

---

1 A Ms. of this work was acquired **near** the border of Orissa for the Madras Government Oriental Mss Library.

